# పట్టు చీరల నిలయం

హోల్‌సేల్ రేట్లకే

రిటైల్‌గా అమ్మే ఏకైక షోరూమ్

పెండ్లిళ్ల కై...



వస్త్ర జగత్తులో విస్తృత శ్రేణి.

## చందన బ్రదర్స్

(A.C)

లేడీస్ & జెంట్స్ క్లాత్ షోరూమ్

జగదాంబ సెంటర్

విశాఖపట్నం

# ఒక్క స్నేహితుడే



# మీ అవసరాలను అర్థం చేసుకోగలడు.

ప్రతిసారి వేడి, మురికి మరియు చెమటలవల్ల శిక్షించబడినప్పుడు మీ చర్మం మార్గోకై కేకవేస్తుంది. ఎందుకనగా మార్గో ఒక స్నేహితుడు.
దానిలో అధికాంశంలో వేపనూనె గల మార్గో, మీ చర్మాన్ని కేవలం శుభ్రపరచుటే కాదు, తగు జాగ్రత్త తీసుకొనును. మార్గో చర్మపు సూక్ష్మరంధ్రాల లోపల బాగా శుభ్రపరచును. మురికిని మరియు సూక్ష్మ జీవులను తొలగించును, సూర్య రశ్మికి, గాలికి పోయే సహజ నూనెలను తిరిగి పొందేలా చేయును. దానియొక్క సహజ చర్మ ద్రావకాలు పోషించే గుణం, చర్మాన్ని క్రమపరచి బిగువుతో సజీవంగా చేయును.
మార్గోతో చేసిన ప్రతిస్నానం ప్రేమ యొక్క ఒక కానుక.

మార్గో విషయంలో మీరు నచ్చేది దానియొక్క వెల: అంతటా మీరు చూసి మోజుపడే మంచి సబ్బులన్నిటి కన్నా మార్గో వెల చాల తక్కువ. మార్గో వాడండి.

మార్గో-అంగఅంగపు




ఆంతరంగిక సబ్బు

Response 2007

# చతుర సమీక్ష

ఈ శీర్షిక ద్వారా ప్రతి నెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని పాఠకులకు కల్పిస్తోంది 'చతుర'. పాఠకులు 'చతుర' నవలపై ఏ నెలకానెల తమ అభిప్రాయం వెల్లడిస్తూ, ఆ నవల ఎందువల్ల తమను ఆకట్టుకుందో లేదా ఎందువల్ల ఆ నవల తమకు నచ్చలేదో వివరిస్తూ, రచన బాగోగుల గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ సమీక్షలు రాయటం మంచిది.

1. "సమీక్ష" అరఠావుకి మించకుండా, కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల నవల సమీక్షలు ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింద కూపన్ జతపరచాలి.
4. కవర్‌పై **'చతుర' సమీక్షకు** అని పేర్కొని, ఎడిటర్ 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టు చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపిక చేసి, ప్రచురించినవాటిలో తొలి మూడింటికి రు. 100/-, రు. 75/-, రు. 50/- చొప్పున; మరో మూడింటికి రు. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

పాఠకులు నవలతోబాటు 'చతుర'లో ప్రచురించే చిత్రాలు, ఫొటోలు, చతుర ప్రపంచం, చతుర కథలు, ఫీచర్లు వంటి ఇతర అంశాలపట్ల కూడా తమ తమ అభిప్రాయాలు, సలహాలు, సూచనలు కూడా విడిగా వేరే కాగితంపై రాసి పంపగోరుతున్నాం. ఉపయోగకరమైన అభిప్రాయాలు వచ్చిన సందర్భాల్లో ప్రత్యేకంగా బహుమతులు ఇవ్వదలచాం.

## కూపన్

జూన్ 'చతుర' నవల: రేపటి మనుషులు

సమీక్షకుని పేరు: ..............................

చిరునామా: ..............................

..............................

..............................

..............................

# చతుర కతలు

## పాట

సుమ్మ ఊహతెల్సిన తర్వాత ఇదే ఇండియాకు రావడం. అందుకే ప్రతి చిన్న విషయాన్ని ఆసక్తితో చూసేది. ఆచారవ్యవహారాలన్నీ ఎంతో శ్రద్ధగా పరిశీలించేది. కన్పించినవాళ్ళందర్నీ ప్రతిచిన్న సంగతీ సవివరంగా అడుగుతూ సందేహాలు తీర్చుకునేది. అయితే రాను రాను అందరూ తప్పించుకోవడం మొదలెట్టారు. బంధువులందరికీ ప్రశ్నల్తో వేధించే సుమ్మ అంటే "టెర్రర్" అయిపోయింది.



దీనికి విరుగుడుగా సుమ్మ మేనమామ ఒక పద్ధతి కనిపెట్టాడు. దాని ప్రకారం ఫామిలీ సెంటిమెంటు ప్రాధాన్యతగల నాలుగు తెలుగు, ఆరు హిందీ సినిమాలను వరుసగా చూపించాడు. అవి వంటపట్టించుకొని ఆంధ్ర సంస్కృతి అంతా అవుపోసనం పట్టేసినంతగా సంబరపడింది సుమ్మ.

రెండురోజుల తర్వాత పక్క వీధిలోనే ఉన్న తెల్సినవాళ్ళింట్లో ఎవరో ముసలమ్మ పోతే సుమ్మ అమ్మమ్మ పరామర్శకు బయల్దేరింది. అమ్మమ్మ ఎంత చెప్పినా వినకుండా తనూ, చూడాల్సిందేనంటూ సుమ్మ కూడా బయల్దేరింది. పోనీ కాస్త దూరంగా నిలబడి అక్కడ జరిగే తంతు చూస్తానని చెప్పింది. పావు గంట తర్వాత అమ్మమ్మ వెనుదిరిగింది. సుమ్మ కాసేపు ఆగమని ఒకటే గొడవ.

"ఏమిటే నీగోల ... అక్కడ వాళ్ళు ఏడుస్తుంటే" అని విసుక్కుంది అమ్మమ్మ.

"అమ్మమ్మా ... వాళ్ళు పాట ఇప్పుడు పాడతారా? తర్వాత పాడతారా?" ఆసక్తిగా అడిగింది సుమ్మ. తను చూసిన ప్రతి తెలుగు సిన్మాలోనూ చావు సీను తర్వాత పాట ఉండటం బాగా గుర్తుంది సుమ్మకు.

–పి.లక్ష్మి





## మహానటి

పాల గ్లాసుతో సిగ్గుపడుతూ శోభనం గదిలోకి ప్రవేశించింది రమణి. పూలమాలలతో అలంకరింపబడిన బెడ్‌పై మన్మధుడిలా కూర్చున్నాడు రమణ.

కొంటెగా భార్యవంక చూస్తుండగా మెల్లమెల్లగా రమణ దగ్గరకొచ్చి పాలగ్లాసు అందిచ్చింది రమణి.

“ఓ చిన్నపాట పాడ్రాదూ! రోజూ నిద్రపోయే ముందు పాటవినటం నాకు అలవాటు” అన్నాడు రమణ. సిగ్గుపడిపోయింది రమణి.

ఆవేళ పెళ్లిచూపుల్లో నువ్వు పాడినపాట చాలా బాగుంది. అచ్చం సుశీలలాపాడావు. నాకు చాలా ఆనందంగా వుంది. ఎందుకో తెలుసా! పాటలంటే నాకు ప్రాణం. సుశీలలా పాడే అమ్మాయినే పెళ్లి చేసుకోవాలన్న నాకోరిక తీరింది కానీ నాదో అనుమానం. ఆవేళ నువ్వు పాడినప్పుడు సంగీతం కూడా వినిపించింది. నీపక్కన ఎవరూ సంగీతం వాయించినవారు లేరే. మరి అదెలా సాధ్యం అయింది? అది నాకు చాలా విచిత్రంగా వుంది. ఇందులో లిటికేషన్ ఏమిటో తెలీటంలేదు” అంటూ అడిగాడు రమణ.

రమణి నవ్వింది. ఆ నవ్వు సినీనటుడు సత్యనారాయణ నవ్వులా అనిపించింది రమణకు.

“మీరు నిజంగా తెలివైనవారండీ. నా భర్తకు అసలు తెలివితేటలుంటాయా, వుండవా అని నేను కూడా పరీక్షించాలనుకు

న్నాను. నాకోరిక కూడా తీరిందండోయ్! మీరు చాలా తెలివైనవారే. అందుకే అనుమానం వచ్చింది మీకు. ఆరోజు నేను పాడేటపుడు పక్కగదిలో టేప్‌రికార్డర్ పెట్టామండీ పాట చాలా బాగుంది కదండీ... నేను చేసిందల్లా ఆ పాటకు తగ్గట్టు పెదాలు కదపటంవరకే. ఎంతో ప్రాక్టీస్ చేస్తేగాని కుదర్లేదు''మగ గొంతుకలా బొంగురుగా వినిపించింది స్వరం. అంతే!

రమణకి తలకాయ దిమ్మెక్కిపోయింది. కరెంట్‌షాక్ తగిలినవాడిలా గుడ్లు వెళ్లబెట్టి ఉండిపోయాడు.

''పోదురూ... మీరు మరీనూ. పాటలు వినాలంటే రేడియో, టేప్‌రికార్డర్ ఉన్నాయిగా మనింట్లో'' అంది గారాలుపోతూ.

''పాట సంగతేమోగానీ, నువ్వు ముత్తంమీద మహానటివి సుమా'' అన్నాడు రమణిని దగ్గరకు తీసుకుంటూ.

— టి. వెంకటేష్

## తేడా

బోయ్ తెచ్చిన సూట్‌కేసులు కప్ బోర్డ్‌లో పెడుతూ ఒక్కసారి కలియజూశాను. నీట్‌గా వుంది రూమ్. ఉదయమే మార్చినట్టున్న బెడ్ షీట్లు తెల్లని పూలడిజైన్లతో అందంగా వున్నాయ్. కిటికీలకున్న సిల్క్ తెరలు గాలికి కదులుతు వయ్యారాలు పోతున్నాయ్. ఓ మూల డ్రెస్సింగ్ టేబులు... నిలువుటద్దం... ఓ గ్రాడెజ్ టేబిల్. టేబుల్‌మీద ఫ్లవర్‌వాజ్, ఓ వాటర్ జగ్, నాలుగు గ్లాసులు... రూమ్ అందంగా అధునాతనంగా వుంది.

రూమ్‌ని ఆశ్చర్యంగా తిలకిస్తూ ''ఏమండీ... దీనికి అద్దె ఎంత?'' అడిగింది శ్రీమతి.

''డెబ్బై రూపాయలు రోజుకి''

''ఆc...'' అంటూ మంచం మీద కూలబడిపోయింది శ్రీమతి.

''ఏమిటి... ఏమయింది?'' నవ్వుతూ అడిగాను నేను.

''రోజుకి డెబ్బయి రూపాయలా? ఎందుకండీ అంత ఖర్చు అనవసరంగా...'' నొచ్చుకుంటూ అడిగింది.

''చూడు సుజా... ఇది మన డబ్బేం కాదు. అఫిషియల్ టూర్ గనక ఆఫీసువాళ్ళే భరిస్తారు. నేను ఈ రూమ్ రెంట్‌కు రోజుకు నూరు రూపాయలు ఖర్చు పెట్టవచ్చు— నా ఎలిజిబిలిటీ ప్రకారం. నువ్వింక ఆశ్చర్యపోవడాలు



ఆపి స్నానం అదీ ముగించుకునిరా... తొంద రగా బయటకు వెళ్దాం– చూడాల్సినవి చాలా వున్నాయ్''

అఫిషియల్ టూర్లో నేను మద్రాసు రావల్సి వుంది. మా ఆవిడ ఎలాగూ ఇంతవరకు మద్రాసు చూడలేదు. చూపించినట్టు వుంటుందని తీసుకొచ్చాను. మద్రాసులో నాలు గురోజులున్నాం. పెద్ద హొటల్లో మకాం.. ఖరీదైన భోజనం... టాక్సీల్లో తిరుగుడు మా ఆవిడకు ఈ ఖర్చులకు ఆశ్చర్యంగానూ... ఇంత అందమైన అనుభవానికి ఆనందంగానూ వుంది. అది గమనించిన నాకు గర్వం అన్పించింది.

టూర్‌లోంచి తిరిగి వచ్చేశాం. దమారుగా వారంరోజులుగా ఇంట్లో లేకపోవడంతో ఇంట్లో అంతా చీదరగా వుంది. ప్రయాణం... తిరుగుడు మూలంగా నీర్సంగా కూడా వుంది.

''ఏమండీ... ఈపూటకు ఏదైనా హొటల్లో తినేద్దామండీ... నీర్సంగా వుంది. ఇప్పుడు వండలేను... అన్నీ సర్దుకుని రేపట్నుంచి వంట మొదలుపెడదాం'' అంది శ్రీమతి.

''సరే... పద'' అంటూ హొటలుకు దారితీశాం.

''అరే... అదేమిటండీ... ఇంకా ముందుకు పోతున్నారు– హొటలు దాటి...'' ఆపుతూ అంది శ్రీమతి.

''ఇది మామూలు హొటలు కాదు. చాలా కాస్లీ ... భోజనం పదిహేను రూపాయలిక్కడ– ముందుకు పోదాంరా. మనం ఎప్పుడూ వెళ్ళే హొటలుందిగా... అక్కడ ఆరు రూపాయలే...'' చెయ్యి పట్టుకుని ముందుకు నడిపించాను.

శ్రీమతి ఆశ్చర్యంగా నాముఖంలోకి చూస్తోంది. నిన్నటికి, ఈవాళ్టికి ఎంత తేడా అన్నదే ఆమె ఆశ్చర్యం.

కానీ నిన్నటిదాకా ఆఫీసు ఎకౌంటు అనీ, ఇప్పుడు... నేను నేనేననీ మర్చిపోయింది. ఇప్పుడు నేను ఖర్చుపెట్టే ఈ ప్రతి పైసా నా జీతంలోదేమరి.

-టి.గణపతిరావు

# చతుర సమీక్షలు

'చతుర' ఏప్రిల్‌నెల సంచికలో ప్రచురితమైన సారె రామమోహన రావుగారి 'సంహారం' నవలపై మాకు అందిన 'చతుర' సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము.







(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)

సాహిత్యం పేరిట రచయితలు చేస్తున్న గారడీలు, సాముగరిడీలు, ఫైట్లు, ఫీట్లపై సునిశితమైన వ్యంగ్య, హాస్య చిత్రణే "సంహారం".

సెక్సు, హారర్, క్రయిమ్ థ్రిల్లర్స్, సైంటిఫిక్ ఫిక్షన్ వగైరా నవలలు మాత్రమే పట్టంగట్టుకుంటున్న ఈ సాహితీ సమాజంలో మనోల్లాసానికి, ఆహ్లాదానికి అవకాశమే లేకుండా పోయింది. జనరంజకమే సాహిత్య ప్రయోజనమన్నారు. కాని ఆ ప్రయోజనం నెరవేరుతున్న ఛాయలేవి? మనసారా నవ్వలేని మనిషి ఆరోగ్యవంతుడు కాడు. నానాటికీ ఇరుకౌతున్న ఈ శతాబ్దపు మనుగడలో నవ్వుకి స్థానం ఎలాగూ లేదు. కనీసం సాహిత్యమన్నా ఆ లోటును భర్తీచేయడం లేదు. మేధావులచే మలచి, తీర్పబడిన నవల ఎలా అష్టావక్రమైపోతోందో ఎరుగంది కాదు. ఆ ఆక్రోశాన్ని అంతర్థానమైపోతున్న నవ్వుని అంతర్లీనం చేస్తూ ఒక విధమైన సాహిత్యం ఎంత బెడదపీడకమౌతుందో ఊహిస్తూ రాయబడిన 'సంహారం' రచనా ప్రయోజనాన్ని సాధించిందనవచ్చును.

"జీవితంలోంచే కథ పుడుతుంది, కాదేదీ కథకనర్హం, తన రచనల స్థాయికి సంపాదకులు, పాఠకులు ఎదగలేదు"లాంటి సాహిత్యసంభాషణలకు కొత్త భాష్యం చెప్పిందీ రచన.

కథా వస్తువులను కూరగాయల్లోంచి, వాహనాల్లోంచి ఊహించిన తీరు, వాటి పేర్లు ఎంతో వ్యంగ్యాత్మకంగా, హాస్యస్ఫోరకంగా ఉన్నాయి. నవలలోని రాంబాబు రచనలకి ఉందని చెప్పిన చదివించే గుణం ఈ అల్లిన కథల్లోనూ కనిపించింది. జువాలజీ క్లాసు బహిష్కరణ, సెల్ఫ్ హిప్నాటిజం, చలించే వాహనాలకి మనసుంటుందనటం- వీటి హాస్యం వెనక విసురు, నిరసన స్థాయి కూడా తీవ్రంగానే ఉంది. ముగింపులో భూతాలు వెనుతిరగటం ప్రస్తుత రచనా విధానం ఎంత బలంగా వ్రేళ్లూనుకుందో పైకి నవ్వు, లోన ఆవేదనతో గూడిన నిట్టూర్పు తెలుపుతాయి.

అక్కడక్కడ హాస్యం శ్రుతిమించి, వ్యంగ్యం విపరీతమై విసుగు పుట్టించకపోలేదు. కొద్దిగా అతిగా కూడా అనిపించకపోలేదు. కాని సాధ్యా సాధ్యాల విచారణకన్న వ్యంగ్యాత్మక హాస్యం మనల్ని ముందుకి చదివిస్తుంది.

చాలాకాలానికి మనసారా నవ్వుకోగల్గిన, మంచి హాస్య నవలని రాయ సాహసించిన రచయితకు, ప్రచురించిన 'చతుర'కు అభినందనలు.

—శ్రీమతి ఆర్.లక్ష్మీచూడామణి,
సి.మల్లవరం




## సహనానికి పరీక్ష

(ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)

**మా** అభిమాన నవనవలా వేదిక "చతుర" ప్రతి నెలా మార్కెట్లో విడుదల కాగానే ఆసక్తిగా చదివి ఆనందించే పాఠకులలో నేనూ ఒకడిని. అలాగే అంత ఉత్సాహంతోనూ ఏప్రిల్ సంచిక లోని "సంహారం" నవల చదివి అంతగానూ నిరుత్సాహం చెందాను.

తమ క్షుద్ర సాహిత్యంతోనూ అర్థంలేని అవి వేకమైన అసంబద్ధమైన ఊహలతోనూ నవల లల్లి తెలుగు పాఠకులకు ఓ అందమైన అగమ్యగోచరాన్ని సృష్టిస్తున్న నేటి రచయిత లకు చురకలా తగిలి కనువిప్పు కలిగి స్తుందేమో ఈ నవల అనుకున్నానాకు తీరని ఆశాభంగం కలిగింది. ఈనాటి నవలల స్థా యిని వేలెత్తి చూపాలన్న రచయిత ఉద్దేశం మంచిదే అయినా అతిగా హాస్యాన్ని జొప్పించ డంవల్ల అసలు విషయం మరుగునపడి అప హాస్యంగా మారింది.

సంఘంలో జరుగుతున్న ఓ అత్యాచారాన్ని ఓ దురాచారాన్ని తమ రచనల ద్వారా వెలుగు లోకి తెచ్చి పాఠకులలో నవ చైతన్యాన్ని కలి గించటానికి తెలుగు నవలా రచయితలు హాస్యాన్ని సాధనంగా వాడుకున్న విషయం వాస్తవం. ఉదాహరణకు: గురజాడవారి కన్యా శుల్కం. నవలలో హాస్యమే ప్రధాన పాత్రవ హించినా అందులో హాస్యం మోతాదుమించ కుండా ఆనాటి మూఢాచార పరాయణులకు ఓ చెంపదెబ్బలా తగిలింది. తాము ప్రచురించే మంచి నవలలతో సమాజంలోని అన్నివర్గాల వారినీ తట్టిలేపి కొద్దిగానైనా మార్పువైపు పయ నింపజేస్తున్న 'చతుర' సంపాదకవర్గం ఇంతటి తక్కువ సాహిత్య విలువలుగల నవల ప్రచురించటంలోని ఉద్దేశం పాఠకుల ను కలవరపరుస్తుందనటంలో సందేహంలేదు.

సమాజానికి ఏవిధంగానూ ఉపయోగపడని రచనలు చేసే రచయితని సంహరించడం వల్లనే సాహిత్యంలో మార్పుతేగలమని రచ యిత ఉద్దేశమా? ఓ వ్యక్తిని చంపడం అనే క్రూరమైన మనస్తత్వం నేర ప్రవృత్తికి దోహదం చేసేదిగా లేదా? ఇకముందైనా 'చతుర'-సంపా దకులు ఇలాంటి నవలలు ప్రచురించి పాఠ కుల సహనాన్ని పరీక్షించరని ఆశిస్తాను.

– యం. మధుసూదన్‌శర్మ,
గుమ్మడిదల్ల.

## తస్మాత్ జాగ్రత్త

(తృతీయ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)

**నే**టి అశ్లీల సినిమాల కోవలోనే, తమ పడకగ దుల ఊహల్నీ కలల్లోని అనుభవాల్నీ రంగ రించి, ఇంటిల్లిపాది ధైర్యంగా, సంకోచరహిత ంగా ఏ పత్రికనూ చదవలేనిపరిస్థితి కల్పించారీనాటి రచయితలు. తెలుగు సాహిత్యాన్ని దిగజార్చి, కేవలం డబ్బు సంపా దనే పరమలక్ష్యంగా ఉంచుకొని, వినోదంతోపా టు అంతోఇంతో విజ్ఞానం కలిగించవలసిన సాహిత్యాన్ని కేవలం కాలక్షేప సాహిత్యంగా మార్చి, ఆ నంబర్, ఈ నంబర్ రచయితల మంటూ ప్రతివారూ విర్రవీగుతున్న రోజులివి.

ఈ రచనలు, రచయితలమీద వ్యంగ్యప్ర యోగం చేసిన సారె రామమోహనరావుగారి నవల 'సంహారం' నిజంగా అభినందనీయం. దీనితోనే నేటి అవాస్తవిక సాహిత్యసంహారానికి, నాంది పలికితే రచయితగారి శ్రమ సార్థకమ యినట్లే.

ప్రస్తుతం ఏ పత్రిక తిరగవేసినా మితిమీ రిన శృంగారం, సస్పెన్స్ థ్రిల్లర్ల పేరుతో హింస, దౌర్జన్యం, క్రౌర్యం తాండవమాడుతు



న్నాయి. పాఠకుల విచక్షణా రాహిత్యం కూడా ఇటువంటి చెత్తసాహిత్య విజృంభణకు సహాయకారి అవుతున్నది.

స్త్రీని కేవలం మాదకవస్తువుగా చిత్రీకరిస్తూనూ, అక్రమసంబంధాలను వివిధ రీతులలో వర్ణిస్తూనూ తమ సర్క్యులేషన్ పెంచుకొనాలనుకొంటున్న పత్రికలను త్రిప్పికొట్టాలి. లేకుంటే యువతీయువకులపై వాటి చెడు ప్రభావం తన సత్తాను చూపుతుందనడం అతిశయోక్తికాదు.

సాహిత్యం, కథనం ఆరోగ్యకరంగా లేకపోతే, ఇటు పాఠకులపైనైతేనేమి, అటుసంపాదకుల పైనైతేనేమి ఎటువంటి ప్రభావం చూపుతుందో, కొద్దిపాటి హాస్యం మేళవింపుతోరాశారు. చదువుతున్నంతసేపూ ఒక హాస్యభరితమైన సినిమా చూస్తున్న అనుభూతి కలిగించింది "సంహారం" నవల. కాని ముగింపు అంత సమంజసంగాలేదు. పిచ్చిపిచ్చి సాహిత్యంతో పాఠకులను, సంపాదకులను అంత ఇబ్బంది పెట్టి కొంతమందిని పిచ్చి ఆసుపత్రిపాలు జేసి, మరికొంతమందికి భూమ్మీది నూకలు చెల్లేలా చేసిన 'రాంబాబు'లాంటి రచయితకు కనీసం చివరిలోనైనా బుద్ధివచ్చేటట్లుచేసి ఉంటే 'సంహారం' నవల మరింత రక్తికట్టేది.

ఏమయినా ఇటువంటి వెరయిటీ నవలను అందించిన చతురకూ, రచయితకూ అభినందనలు.

—డి.వి.యన్. రావు,
బెంగుళూర్.




(రు. 25/-బహుమతి పొందిన సమీక్ష)

"సందేశాత్మక హాస్య నవల" అంటూ పరిచయం చేసిన "సంహారం"లో అటు సందేశంకాని, ఇటు హాస్యంకాని కొంచెం కూడా కనిపించవు.

సాంఘిక ప్రయోజనం అణుమాత్రం అందించని వెల్లువలో కొట్టుకుపోతున్నాడు నేటి తెలుగు పాఠకుడు. బహుశా ఈ నవల ద్వారా రచయిత అందించదలచిన సందేశం కూడా ఇదేనేమో! ఆ సందేశానికి అతి చక్కగా సరిపోయే నవలకు బదులు పాఠకుల ఓపికకు పరీక్షపెట్టే నవలగా "సంహారం" రూపొందింది. నెల నెలా 'చతుర' ద్వారా ఒక మంచి నవలను అతి తక్కువ ధరకు పొంది తృప్తి పడుతున్న మాకు ఈ నెల నవల అసంతృప్తినే మిగిల్చింది. అతిశయోక్తులతో, అసహజాలతో, అవాస్తవికతతో ఈ నవలలో హాస్యం వికటించి అపహాస్యంగా రూపు దిద్దుకుంది. నవ్వించే ఒక జోక్‌గానీ మురిపించే ఒక సన్నివేశంగానీ, మనసుకు గిలిగింతలు పెట్టే ఒక సంఘటనగానీ, మచ్చుకైనా కనిపించవు. వీటన్నిటినీ అతిశయోక్తులను రచనలో జొప్పిస్తే అదే హాస్యంగా రూపుదిద్దుకుంటుందని రచయిత అభిప్రాయంలా ఉంది— కాని అది సరికాదు.

నేటి సాహితీ విలువలు క్షీణించి వక్రమార్గాన పయనిస్తున్నాయనేది నిర్వివాదాంశం. ఇది చాలా సీరియస్ సబ్జెక్టు! దీన్ని ఇంత తేలికగా తీసుకుని రాయటమే ఇందులో ప్రధాన లోపం. డబ్బుకోసం, పేరుకోసం ఏమాత్రం ప్రయోజనం లేని రచనలు చేసే రచయితలు లేకపోలేదు. కాని రాంబాబులాంటి రచయితలు వున్నారా, వుంటారా అంటే అది జవాబు దొరకని ప్రశ్న! వ్యంగ్యం కోసమో, హాస్యం కోసమో రాంబాబు లాంటి పాత్రను సృష్టించినా, కనీస సహజత్వాన్ని కూడా రచయిత పాటించకపోవడంతో నవల అపహాస్యంగా తయారయింది.

సాంఘిక ప్రయోజనం, సామాజిక స్పృహ లాంటి పెద్ద మాటలను పక్కకు పెడితే, కనీసం వినోదం, కాలక్షేపం కూడా కలిగించని సాహిత్యం తెలుగు పాఠకుడిని పరీక్షిస్తున్నది. అలాంటి రచనలను అపహాస్యం చేయటంలో విఫలమయిందీ "సంహారం".

—ఇ.టి.రామారావు,
శ్రీహరికోట







(రు. 25/- బహుమతిపొందిన సమీక్ష)

రచయిత చిరంజీవి, రచన బలమైన ఆయుధం. రెండింటికీ రాంబాబు ప్రతీక అయ్యాడు. సమాజాన్ని పాఠకుల మానసిక ఆరోగ్యాల్ని ఖాతరు చేయకుండా ఇటీవల పుంఖానుపుంఖాలుగా వస్తున్న మాంత్రిక, తాంత్రిక అవాస్తవిక కథలు, నవలల రచయితలకు "సంహారం" ద్వారా సారె రామమోహనరావుగారు వాతలుపెట్టారు. బాధ్యతారహితంగా పేరుకోసం, డబ్బుకోసం రచనలు చేసేవారికి "సంహారం" ఒక చెంపపెట్టు.

అవాస్తవికతల వేదికపై హాస్యం లాస్యంచేస్తుంది. అయితే నవల అవాస్తవికతల వ్యంగ్య చిత్రణే అయినా హాస్యం పాలుతక్కువయింది. అవాస్తవికతల్ని వాస్తవికతలుగా రాసుకునే స్వేచ్ఛ రచయితకు వుంది. అయితే వాస్తవాల్ని అవాస్తవికతలు చేయటం అన్యాయం. ఉదాహరణకు- తంతి-తపాలాశాఖలో పోస్ట్‌మన్ విధులు, నియామకాలకు సంబంధించిన భోగట్టా లాంటివి. నవలలో నాయికగా కనిపించిన అనవసర పాత్ర మోహిని నవల సంపూర్ణత్వానికి ఏ విధంగానూ దోహదం చేయలేదు. నవలాపరిచయం చదివి ఊహించుకున్నంత గొప్పగా హాస్యపరంగా ఏమీలేకపోయినప్పటికీ మంచి సందేశాత్మకంగా మాత్రంవుంది.

చీఫ్ ఎడిటర్, సబ్- ఎడిటర్‌లు, ఇద్దరు మాంత్రికులు, శివరాం, రాంబాబు కథలు చదివిన వాళ్లయొక్క ఆంగిక, మనోవికృతాలు - వగైరాలకు సంబంధించి సంఘటనలు, సంభాషణలు, వర్ణనల పునరుక్తి దోషం అధి

కంగా వుంది నవలలో. మొత్తంమీద విలువలు దిగజారుతున్న నేటి సాహితీజగత్తులో మార్పుని ఆశించి, ఒక సందేశాన్ని అందివ్వటంలో ఈ నవల ద్వారా రచయితగారి కృషి అభినందనీయం.

—అరుణ,
చిత్తూరు.




(రు. 25/- బహుమతిపొందిన సమీక్ష)

సమాజం సక్రమమయిన నీతితో నడవటంలో, నడిపించటంలో రచయిత పాత్రముఖ్యమైనది. నేటి రచయితలయొక్క సామాజిక బాధ్యతలను తెలియజేస్తూ, సమాజాన్నిజాగృత పరిచే సాహిత్యం ఏ విధంగా చేస్తే వస్తుందో, మంచి రచనలు చేయడానికి రచయితకు ఏ విధమైన ప్రోత్సాహం వుండాలో విశదపరుస్తూ సందేశాత్మకంగా ఈ నవల సాగి వుంటే సంతోషించేవాళ్లం.

కాని, 'చతుర' ముందుమాటను చదివి ముందుకుసాగిన పాఠకుడికి అసంతృప్తి కలిగించిందీ నవల. హాస్యానికే అనుకున్నా చదివించే చక్కటి శైలి కొరవడి నిర్దయగా పాఠకుల సహనాన్నీ సమయాన్నీ సంహరించింది. ఈ నవల ఆకతాయిగా వుందేగాని ఆలోచించే విధంగా, అభ్యుదయపరంగాలేదు. ఒక సిద్ధాంతంలేకుండా నడిచిన హాస్యం వెగటు కలిగించింది. చాలా చక్కటి అభిరుచితో కూడిన నవలలందించి మాసపత్రికలన్నింటిలోనూ అగ్రగామిగా ఉన్న 'చతుర' స్థాయికి ఇది తగిన రచన కాదని నిస్సందేహంగా చెప్పవచ్చును.

—మజ్జి కృష్ణప్రసాద్,
మద్రాసు.

కవర్‌పేజీ ఫోటోగ్రాఫర్: యస్. ప్రసాద్

# చతుర

సంపుటి : 11 సంచిక : 5 జూన్ : 1988


## నవలాపరిచయం

డాడీ... నన్నింకా తీపి తీపి మాటలతో మభ్యపెట్టే ప్రయత్నం చేయకండి! లేదా నా జన్మరహస్యం ఏమిటో నేను వెంటనే వినాలి. నిజం చెప్పండి... లేదా నా వాన్నే కళ్ళచూస్తారు'' అంటూ తండ్రిని కౌగిలించుకుని ఏడవసాగాడు యువకుడు. తండ్రీకొడుకుల ఇద్దరి హృదయాల్లోనూ అగ్నిపర్వతాలు బ్రద్దలయ్యాయి. ఏం చెప్పాలో ఎలా చెప్పాలో తోచక నోటమాట రావటంలేదు తండ్రికి. ఆ రహస్యమేదో తెలుసుకుని తీరాలన్న ఆత్రుత మరింత పెరిగిపోతోంది కొడుకుకి. వీరిద్దరి సంభాషణా విని ఏమనలేక మంచం మీద బోర్లాపడుకుని వెక్కివెక్కి ఏడుస్తోంది తల్లి.

ఆనందనిలయంలా, మూర్తీభవించిన ప్రేమానురాగాల ఆలయంలా ఉన్న ఆ చల్లని, చక్కని కుటుంబంలోని ప్రశాంతతని కబళిస్తూ దుమారం రేపిన తుఫానులాంటి ఆ పరమసత్యం ఏమిటి?

రేపటి మనుషుల జనన వైచిత్ర్యాలనూ, విజ్ఞాన విశేషాలనూ రంగరించి చక్కని కుటుంబగాథగా మలిచి రాపేటి రామకృష్ణారావు అందించిన తాజా నవల 'రేపటి మనుషులు'. ఈ నెల 'చతుర' సమర్పిస్తున్న సమగ్ర నవల.

# రేపటి మనుషులు

—రాపేటి రామకృష్ణారావు

సాయంత్రం ఆరుగంటలాతోంది. ఇందిరాపార్కు జనంతో కళకళలాడుతోంది. టాంక్‌బండ్ మీద నుంచి వచ్చేపోయే బస్సులు ఎర్రని ఆకాశం ముందు నల్లగా అటూఇటూ పరుగెడుతూ కనిపిస్తున్నాయి.

పార్కులో కాలక్షేపంచెయ్యడానికి వచ్చిన కుటుంబాలూ, నూతన దంపతులూ, కుర్రకారూ— గడ్డిమీద, సిమెంటు బెంచీల మీద కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు.

దాదాపు అరగంట నుంచీ జగదీష్ అక్కడే కూర్చుని సమత కోసం ఎదురుచూస్తున్నాడు. ఆక్రితం ఆదివారం ఇద్దరూ యథాప్రకారం కలుసుకున్నారు. ఆదివారం రోజు ఇందిరాపార్కులో కలుసుకుని ఓ అరగంటైనా కబుర్లు చెప్పుకోవడం ఇద్దరికీ అలవాటైపోయింది. టి.వి.లో ఎంత మంచి హిందీ సినిమా అయినాసరే వదులుకుని వచ్చి పార్కులో జనం తక్కువగా వున్నచోట కూర్చుంటారు.

ఆరున్నర కూడా కావడంతో ఆత్రుతగా ఎదురుచూడసాగాడు జగదీష్.

దూరంగా పార్కులోకి ప్రవేశించే గేటు దగ్గర ఓ తటిల్లత మెరిసినట్లయింది.

అంత దూరంనుంచి కూడా సమత చూపులు కలిస్తే శక్తివంతమైన రెండు సెర్చి లైట్లు ముఖం మీద పడినంత అనుభూతి కలుగుతుంది జగదీష్‌కి.

గబగబా ఆమె దిక్కుగా నడిచివెళ్ళాడు.

వేసవి తాపానికి చెమర్చిన మేనుకి శీతలపవనం సోకినట్లు ఆమె జగదీష్‌ని సమీపించింది.

"సారీ జగదీష్‌గారూ! ఈరోజు కాస్త ఆలస్యమైంది" అంది.

"బతికించారు. ఇంక రారేమో అనుకున్నాను" అన్నాడు సంతోషాన్ని చూపుల్లో కూడా వ్యక్తంచేస్తూ.

"ఈరోజు నా ఫ్రెండ్స్ అరవింద, సునీత సినిమా ప్రోగ్రాం వేశారు. మధ్యాహ్నం భోజనం చేసి బయలుదేరాను. ఈరోజు మిమ్మల్ని కలవకుండానే ఇంటికి వెళ్ళిపోదాం అనుకున్నాను. మీరు ఎదురుచూస్తూ వుంటారని వాళ్ళని తప్పించుకుని వచ్చేశాను" అని ఆలస్యానికి కారణం వివరించింది.

"థాంక్స్... మిమ్మల్ని వారంవారం చూడకపోతే తోచదు. ఏదో వెలితిగా వుంటుంది"

సమతకి జగదీష్ అలా అనగానే హృదయ తంత్రులను ఎవరో మీటినట్లయింది. మనస్సు పులకించింది. తనకీ జగదీష్‌ని చూడందే తోచదు. ఇదేనా ప్రేమంటే.

మరి తనకి పెళ్ళైతే ఈ జగదీష్‌ని ఇలా కలుసుకోగలదా? ఏడాది నుంచి ఓ స్నేహితుడిగానే చూస్తోంది. ఏనాడూ చెడు తలంపు రాలేదు.

ఓ పరీక్షలో నెగ్గే పురుమడి కోసం తన నిరీక్షణ ఈనాటికి పూర్తయిందా?

వానిటీ బేగ్‌లోనుంచి డైరీతీసి జగదీష్‌ని కలుసుకున్న రోజున డైరీలో రాసుకున్న వాక్యం చూసింది.

చిత్రం. పోయిన ఆదివారానికే సరిగ్గా ఏడాది పూర్తయింది. ఈయన పరీక్షలో నెగ్గాడన్న మాట.

జగదీష్ మౌనాన్ని భరించలేకపోయాడు.

"ఏమిటండీ సమతగారూ... మాట్లాడరేం?" అని మరోమారు మాట్లాడాడు.

ఊహల్లోనుంచి ఒక్కమారు స్పృహలోకి వచ్చింది. జగదీష్ తనని పెళ్ళి చేసుకుంటాడా?

"ఏం మాట్లాడాలండీ! అయినా ఇలా మనం ఎంతకాలం కలుసుకోగలం చెప్పండి జగదీష్‌గారూ! ఉద్యోగం చేస్తున్నానుగనుక ఇంట్లో ఫ్రీడమ్ తీసుకొని స్నేహితుల ఇంటికనీ, సినిమాలకనీ రాగలుగుతున్నాను. మా పిన్నికి నామీద నమ్మకం. మా చిన్నాన్న నా స్వేచ్ఛకి అడ్డుచెప్పడు. కాని రేపు నాకు పెళ్ళయితే ఈ స్వాతంత్ర్యం వుండదు. అప్పుడింక మనం ఎలాగూ కలుసుకోలేం. ఇంక మన స్నేహానికి స్వస్తిచెప్పక తప్పదు" అంది.

జగదీష్ ముఖం మ్లానమైంది. అపురూపంగా చూసుకుంటున్న గాజుబొమ్మ అరచేతిలో నుంచి జారిపడినట్లయింది. నిజమే... సమత పెళ్ళి అనేమాట ఎత్తగానే దూరం జరిగిపోయినట్లు అనిపించింది. దాదాపు ఏడాది నుంచి సమతని గమనిస్తున్నాడు. స్త్రీకి




కావలసిన అన్ని మంచి లక్షణాలనూ ఆమెలో చూశాడు. ఇద్దరూ మంచి స్నేహితుల్లాగా ఎలాంటి చెడు తలంపూ లేకుండా పవిత్రంగానే ఇన్నాళ్ళూ వున్నారు. పెళ్ళవగానే సమత దూరమైపోతుందనే ఆలోచనే రాలేదేం తనకి? నిస్సత్తువ ఆవరించింది. మెల్లగా పక్కనే వున్న సిమెంటు బెంచీమీద చతికిలపడ్డాడు.

సమత జగదీష్ అవస్థని అర్థంచేసుకుంది. ప్రేమ ఇద్దరిలోనూ తెలియకుండానే ప్రవేశించిందా! జగదీష్ పక్కనే తనూ కూర్చుండిపోయింది.

సరిగ్గా ఏడాదిక్రితం ఓ విచిత్రమైన పరిస్థితుల్లో ఆ ఇద్దరికీ పరిచయమైంది.

ఆరోజు ఇలాగే జగదీష్ పార్కుకి రావడం జరిగింది. ఒంటరిగా కూర్చుని వచ్చేపోయేవారిని గమనించడమేగాని ఎవ్వరితోనూ కలుగచేసుకుని మాట్లాడే అలవాటు అతనికి లేదు. సెక్రటేరియట్‌లో ఉద్యోగం దొరకగానే, పెళ్ళిచేసుకొమ్మనే అమ్మానాన్నా పోరుపడలేకపోయేవాడు. తన ఊహలకి సరిపోయే స్త్రీ తటస్థపడేదాకా ఆ ప్రశ్నేలేదనీ, కనీసం ఓ ఏడాదైనా గడువివ్వమనీ చెప్పి తప్పించుకున్నాడు. వాళ్ళ ఆఫీసులోనే పెళ్ళికాని ఎంతోమంది అమ్మాయిలున్నారు. కాని ఎవ్వరూ అతనికి నచ్చలేదు.

ఆ విధంగా మధనపడుతున్నరోజుల్లోనే ఆరోజు ఇందిరాపార్కుకి రావడం జరిగింది. ఓ బెంచీమీద కూర్చుని ఆలోచనల్లోకి జారిపోయాడు. ఆ బెంచీ పక్కనే మరో బెంచి ఖాళీగా వుంది. జగదీష్ ఊహల్లోకి వెళ్ళిన కాసేపటికి ముగ్గురమ్మాయిలు వచ్చి ఆ బెంచీమీద కూర్చున్నారు. అరగంట సేపట్నుంచి వాళ్ళు జగదీష్‌నే గమనిస్తున్నారు. కనీసం కన్నెత్తి చూస్తాడేమో అని ఎదురుచూశారు. లాభం లేకపోయింది. వాళ్ళు కామెంట్సు కూడా మొదలుపెట్టారు. కాని అతని చెవికెక్కలేదు. ఆ కామెంట్సు వింటే జగదీష్ అక్కడి నుంచి పారిపోయేవాడే కాని వినలేదు. బతికిపోయాడు.

స్పృహలోకి వచ్చిన జగదీష్‌కి వాళ్ళనుకుంటున్న చివరి మాటలు చెవిన పడ్డాయి.

"అరవిందా... లేవే చీకటిపడింది. ఇంక ఇంటికి పోదాం" అందొక అమ్మాయి.

"మరికాసేపు కూర్చోవే. నీతో వస్తే ఇదే తంటా" అంది ఆ అరవింద అనే ఆ అమ్మాయి.

"సమతా... నువ్వు చెప్పవే— కాసేపుందామా లేక వెళ్ళిపోదామా?" అనడిగింది మూడోపిల్ల.

"నేను చెబితే మాత్రం మీరు వింటారా? మీరు వెళ్ళండి— నేనుమాత్రం మరో గంటసేపు పార్కులో కూర్చుని వస్తాను" అంది ఆ సమత అనే అమ్మాయి.

"మతిగాని పోలేదుగదా? ఎంత సిటీ అయితేమాత్రం ఒక్కతెవీ ఈ పార్కులో ఒంటరిగా, మేం లేకుండా వుండగలవా?"

"ఏం... ఎందుకుండలేను?" అంది సమత.

"ఎందుకా... అటు ఆ మొగలిపొదలు, ఇటు చిట్టడవిలాంటి గుబురైన చెట్లు. ఎవడైనా వచ్చి వెనకనుంచే ఏ మత్తుమందో రాసిన రుమాలుతో ముక్కుకి వాసన చూపిస్తూ నోరు మూసేస్తే ఏం చేస్తావు? మత్తులో నువ్వున్నప్పుడు ఆ పొదల్లోకి ఈడ్చుకుపోయి ఏదైనా అఘాయిత్యం చేస్తే?" అంది అరవింద ఆరిందాలాగా భయపెడుతూ.

"ఏమే అరవిందా... ఏదైనా సస్పెన్సు నవల చదివి మరీ బయలుదేరావా? లేక ఏదైనా డిటెక్టివ్ సినిమాకి వెళ్ళావా ఈమధ్య. నాకా భయంలేదు— మీరు వెళ్ళండి" అనేసింది.

నిజానికి సమత ఆ సిమెంటు బెంచీ మీద ముక్కుమూసుకుని కూర్చుని వున్న యువకుడి మీద తన ప్రయోగం చేయాలనుకుంది. అందుకే వాళ్ళని పొమ్మంది.

ఆ ఇద్దరమ్మాయిలూ గుడ్లు పెద్దవి చేసుకుని చూశారు. సమత చీకటిపడ్డ తర్వాత ఎప్పుడైనా వుందా? అందరినీ ముందుగా లేవకుపోయే సమతేనా ఇలా మాట్లాడుతున్నది.

వాళ్ళు నమ్మలేదు. నిజంగా వెళ్ళిపోతే వెనకే పరుగెత్తుకొచ్చేస్తుందనుకున్నారు. అంతే— లేచి గబగబా నడిచిపోయారు.

పోతూ పోతూ "ఆ పక్క బెంచీమీద కూర్చున్న మొద్దబ్బాయి నచ్చినట్లున్నాడే— అందుకే

# అతి పల్చని తొడుగు...
# సహజమైన సంతృప్తికి
# సూపర్ డీలక్స్ నిరోధ్




నిజానికి, ప్రపంచంలోనే అతిపల్చని, నాజూకైన తొడుగు. అయినా, అన్ని విధాలా సురక్షితమైనది.

సూపర్ డీలక్స్ నిరోధ్ అతి నాజూకైన లేటెక్స్‌తో ప్రపంచంలోని అత్యంత ఆధునికమైన కర్మాగారంలో తయారై, ఎలక్ట్రానిక్ పరికరాలతో పరీక్షించబడినది. నునుపైన, జారుడు గుణం కలది - సూపర్ డీలక్స్ నిరోధ్ మీ అభిరుచికి అనువుగా ఇప్పుడు సహజమైన చర్మం రంగులో లభిస్తున్నది.

ASP/HLL/8807 TEL

మీకే తేడా తెలుస్తుంది

## సూపర్ డీలక్స్ నిరోధ్

పంచంలోని తొడుగుల తయారీలో అతిపెద్ద సంస్థ
యిన హిందుస్థాన్ లేటెక్స్ లిమిటెడ్ వారి మేలైన ఉత్పత్తి.

[illegible] వాత అతనితో మాట్లాడుతుంది'' అనుకుంటూ వెళ్ళిపోయారు.

ఆ మాటలు జగదీష్ చెవిలోపడ్డాయి. ఆ సమతకి కూడా ఆ మాటలు వినిపించే వుంటాయి అనుకున్నాడు.

వాళ్ళు పార్కు బయటికి వెళ్ళేదాకా సమత అనే అమ్మాయిని అతను చూడనేలేదు. చూస్తే ఆ సమత సిగ్గుపడి పారిపోతుందనుకున్నాడు. కాని తనవంకే చూస్తున్నట్లు తరవాత గ్రహించే సరికి అతడికి చెమట్లుపట్టాయి.

నిజంగానే ఈమె మాట్లాడుతుందా అనుకున్నాడు.

సమత మాత్రం ఇతనూ అందరిమగాళ్ళ లాగే ఆడపిల్ల ఒంటరిగా కనిపించి తనకుతానుగా మాట్లాడగానే ఒళ్ళుమరిచిపోయి ఒంటిమీద చెయ్యేస్తాడేమో అనుకుంది.

నిజంగానే జగదీష్ కూర్చున్న బెంచీకి ఎదురుగా వచ్చి నుంచుని "ఎక్స్‌క్యూజ్‌మి... మీ బెంచీమీద కూర్చోవచ్చునా?'' అనడిగింది.

తనకేం అభ్యంతరం ఉంటుంది. పబ్లిక్‌పార్కులో అలా ఆమె కూర్చోవడం ఇష్టంలేకపోతే తనే లేచిపోతాడుగదా అనుకున్నాడు.

"అబ్బే లేదండి... మీరు నిరభ్యంతరంగా కూర్చోవచ్చు'' అని కొంచెం జరిగాడు.

అలా కలునుకున్నారు ఆనాడు తొలిసారిగా!

ఏడాదిక్రితం సమత కూడా పెళ్ళి చిక్కుల్లోనే ఉంది. పిన్నీ చిన్నాన్నా పెళ్ళి చేసుకోమ్మని గొడవ! తనకి బేంకులో అప్పుడే ఉద్యోగం అయింది. ఇంకా ఆలస్యం ఎందుకని.

ఆమెకు చిన్నప్పుడే తల్లిదండ్రులు పోయారు. పుట్టిన రెండో ఏటే తండ్రి చనిపోయాడు. సొంత కొడుకులాగా పెంచి చదివించి ఉద్యోగం కాగానే పెళ్ళి చేసిన తమ్ముడి చేతుల్లో భార్యనీ, కూతుర్నీ పెట్టి మరీ చనిపోయాడు. ఏడెనిమిదేళ్ళవయస్సులో మూడో క్లాసు చదువుతూ ఉండగా తల్లి కూడా చనిపోయింది. తల్లితండ్రీకన్నామిన్నగా పిన్ని చిన్నాన్నా పెంచి పెద్దచేసి చదివించి ఉద్యోగంలో వేయించి రుణం తీర్చుకున్నారు. సమత అదృష్టంవల్లనో లేక వాళ్ళ పిన్ని చిన్నాన్నల దురదృష్టంవల్లనో వాళ్ళకి పిల్లలే పుట్టలేదు. పిన్నికి నలభై, చిన్నాన్నకి నలభై అయిదు సంవత్సరాల వయసు రావడంతో ఇంక పిల్లలు పుట్టరనే నిర్ధారణకి వచ్చేశారు.

సమతకి ఇరవైయ్యొక్క సంవత్సరాలు నిండిపోవడంతో ఆ పెళ్ళి ముచ్చట కూడా తీర్చుకుందామని తొందర చెయ్యసాగారు.

ఉద్యోగం దొరకగానే సంబంధాలు చూడ్డం మొదలుపెట్టారు. ఆ సంగతి సమతకి తెలిసింది.

"పిన్నీ నేనిప్పుడే పెళ్ళి చేసుకోను. మరో ఏడాది ఇలాగేవుండనివ్వండి'' అని బతిమాలుతూ చెప్పింది.

"సమతా... నువ్వింకా చిన్నపిల్లవికావు. ఇరవైరెండోఏడు వచ్చింది. ఏ వయసులో ముచ్చట ఆ వయసులోనే తీరాలి. నీకిష్టమైన వ్యక్తి ఎవరన్నా ఉంటే చెప్పు అంతేగాని పెళ్ళిచేసుకోను అని మాత్రం చెప్పకు. మనకేంతక్కువ. ఆయన పోరుపడలేకగాని నువ్వు ఉద్యోగం చెయ్యడం కూడా నా కిష్టంలేదు'' అంది పిన్ని అన్నపూర్ణ.

వాళ్ళసంభాషణ చిన్నాన్న కృష్ణమూర్తి కూడా విన్నాడు. అతడు సమత అభిప్రాయానికి వ్యతిరేకంగా ఏదీ చెయ్యడు. ఆడిందిఆటగా పాడిందిపాటగా పెంచాడు.

"అన్నపూర్ణా నువ్వూరుకో అమ్మాయికిష్టమొచ్చినప్పుడే చేసుకుంటుంది. అమ్మా! మరి వచ్చే ఏడాది ఈ తేదీనాటికి నువ్వు పెళ్ళికి ఒప్పుకోవాలి'' అని కండిషను పెట్టాడు చిన్నాన్న.

"అలాగే చిన్నాన్నా వచ్చే ఏడాది చూద్దాం'' అని ఒప్పుకుంది సమత. అలా అప్పటికా గండం నుంచి తప్పించుకుంది.

కాని ఆనాటినుంచీ తనకెలాంటి భర్తకావాలో ఆలోచించుకోసాగింది. తనకెలాంటి భర్త కావాలి? డబ్బుగలవాడు కావాలా! అందగాడైతే చాలా. ఏమో! సమతకే తెలియదు.

ఆరోజునుంచే పురుమల్ని పరిశీలనగా చూడాలని నిర్ణయించుకుంది. అంతవరకు మగవాళ్ళందరినీ కేవలం వ్యక్తులుగానే చూసింది.

ఇంక వాళ్ళలో ఓ పురుషుణ్ని భర్తగా ఎన్నుకొనే దృష్టితో చూడాలనుకుంది.

అయితే కంటికి నచ్చిన వ్యక్తిని కాస్త ఆసక్తిగా తిలకించేసరికి వాళ్లు కన్నుకొట్టడమో లేక మరోవిధంగా అడ్వాన్సుకాబోవడమో చేశారు. మగవాళ్ళందరూ అంతే అనుకుంది. అప్పుడే ఏడాది కలిసి తిరిగినా కేవలం కబుర్లు చెప్పుతూ స్నేహితుడుగా ఉండగలిగేవాణ్ని మాత్రమే పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకుంది.

ఆ పరిస్థితుల్లోనే జగదీష్ అలా పార్కులో తగిలాడు. పక్కనే కబుర్లాడుకుంటున్న ముగ్గురమ్మాయిలనూ కనీసం కన్నెత్తి చూడని జగదీష్‌మీద ఆసక్తి కలిగింది.

అతనితో స్నేహంచేసి పరీక్షించాలనుకుంది. అందుకనే ఆనాడు అతని పక్కన కూర్చుంది.

మొట్టమొదటిరోజు పరిచయాలూ, చదువులూ, ఉద్యోగాల గురించి సంభాషణ సాగింది.

తరవాత రాజకీయాలు ఆ తరవాత చూసిన సినిమాలమీద విమర్శ.

తనలాగే... అచ్చం తనలాగే ఆలోచించే వ్యక్తి జగదీష్ అని సమతకి కొన్ని నెలల పరిచయంలోనే అర్థమైపోయింది. ప్రతి ఆదివారం కలుసుకుని ఏడాదిలో ఒకరి గురించి ఒకరు, ఒకరి కుటుంబాన్ని గురించి ఒకరు వివరంగా మాట్లాడుకున్నా, ఇద్దరూ పెళ్ళి కానివారని తెలిసినా ఏనాడూ జగదీష్ 'ఐలవ్ యూ సమతా' అనలేదు.

తన భర్తకి కావలసిన అన్ని మార్కులూ జగదీష్ సంపాదించాడనుకుంది సమత.

★ ★ ★

జగదీష్, సమతా ఆలోచనల్లోనుంచి తేరుకున్నారు. ముందుగా సమత నోరు విప్పి మాట్లాడింది.

"జగదీష్‌గారూ... రండి ఇంక బయలుదేరుదాం. చెప్పానుగదా. మధ్యాహ్నామనగా ఇల్లు విడిచిపెట్టాను. వచ్చే ఆదివారం కాస్త ముందుగానే కలుసుకుందాంలెండి" అంది.

సమత గొంతు జగదీష్‌కి కొత్తకాదు. అయినా ఏదో మాధుర్యాన్ని కలగలుపుకునివచ్చినట్లు వినిపించింది. ఆ గొంతులో అర్థంకాని విడమర్చి చెప్పలేని అనురాగపు అగాధాలు. ఆప్యాయత ఆత్మీయతల రంగరింపు.

జగదీష్‌కి ఏదో తెలియని అనుభూతి. తనకి ఇలాంటి అనుభూతి ఎప్పుడూ కలగలేదు. తన శరీరంలోని ఓ భాగం విడిపోతున్నదా అనే భావన. మళ్ళీ సమత కనిపించదేమోననేంత భయం. తనకితాను ఏనాడూ మరికాస్తసేపు కూర్చుందాం సమతగారూ అని అడగలేదు. ఆమె ఇష్టానుసారం ఆమెకి ఎంతసేపు ఉండాలో అంతసేపు కూర్చుని ఇక వెళతాను జగదీష్‌గారూ అని మరో మాటకు ఎదురు చూడకుండా లేచిపోయేది.

గలగలాపారే సెలయేరులా ఏ విషయాన్నైనా ఎంతో ఆసక్తిదాయకంగా వివరించే ఆమె తెలివితేటలకి అబ్బురపడిపోయేవాడు. మరికాసేపు కూర్చుంటే బాగుండిపోను అనివున్నా ఏనాడూ అర్థించలేదు.

అలాంటిది ఈనాడు ఆమెని మరికాసేపు ఆగమని అడగాలనే బలమైన కోరికని అణచుకోలేకపోయాడు.

"సమతగారూ... ఈరోజు మనం కలుసుకున్నట్లేలేదు. క్షణంక్రితం వరకూ ఎదురు చూడ్డంతోటే సరిపోయింది. ఇప్పుడేమో వచ్చే వారం కలుద్దాం అంటున్నారు. నాతో మాట్లాడటానికి టాపిక్ కరువైందా?" అన్నాడు నిష్ఠూరంగా.

సమత తన చెవులను నమ్మలేకపోయింది. ఆమాట పోయిన ఆదివారం అన్నా జగదీష్ స్నేహానికి గుడ్‌బై కొట్టేసేది. కాని సరిగ్గా ఏడాది నిండిన తరవాత యాభైమూడో ఆదివారం జగదీష్ సమత సాహచర్యంమీద ఆసక్తి కనపరిచాడు. ఇది కాకతాళీయమా? లేక ఇద్దరికీ రాసిపెట్టివుందా! అని ఆశ్చర్యపోయింది.

"గుడ్‌గాడ్... మీరేనా మాట్లాడుతున్నది. ఎప్పుడైనా నన్ను ఆపుతారేమో అని ఏడాది నుంచీ ఎదురు చూస్తున్నాను. ఈనాటికి ధైర్యం చేశారు. హేట్స్‌ఆఫ్! సరే... అలాగే" అనేసి లేచిన సమత మళ్ళీ సిమెంటు బెంచీమీద కూర్చుండిపోయింది.

జగదీష్ కూడా కూర్చున్నాడు.




నిజమే... తను ఏనాడూ ధైర్యంచేసి మరికా సేపు కూర్చొమ్మని అడగలేదు. తన గురించి ఎంత తేలికగా అంచనా వేసుకుని ఉంటుందో ఆలోచించాక ఒళ్ళు జలదరించింది.

"ఆగమనగానేనేరా ఏవైనా విషయాలు ఈరోజు మీరే చెప్పాలి" అంది జగదీష్ ము ఖంలోకి లోతుగా చూస్తూ.

ఎంత అందగాడు. ఒత్తైన కట్ చేసిన మీసాలు. తెల్లని చర్మంమీద షేవ్ చేసుకు న్నంతమేర నీలంగా కనబడుతున్న గడ్డం. నిజంగా మగమహారాజు ఇంత క్లోజ్‌గా చూడ లేదేంతను. పెళ్ళి చేసుకోవాలి అని అను కుంటేగదా. తనెంత అదృష్టవంతురాలు. తాన నుకున్న రీతిలోనే ఏడాది నిబ్బరంగా ఉండి పందెం గెలిచిన మొనగాడు.

"ఏం మాట్లాడాలి... మీరేమో పెళ్ళి చేసు కుని వెళ్ళిపోతానని గుండెల్లో బాంబు పేల్చా రు" అన్నాడు.

"ఏం... నేనేం ఆడపిల్లను కాననుకున్నారా? ఈ అనాకారి పిల్లనెవడు పెళ్ళిచేసుకుంటాడు. జీవితాంతం ఈ ఇందిరాపార్కులో పెళ్ళిపెటా కుల్లేకుండా ప్రతి ఆదివారం రాకేం జేస్తుంది అనుకున్నారా?" అని ప్రశ్నల వర్షం కురి పించింది.

"మీరు అనాకారి పిల్లా... ఎవరండీ అలా అనగలిగేది? కళ్ళులేనివాళ్ళు సంగతి చెప్పలే నుగానీ, కళ్ళున్నవారికి మీరు అందంగానే కనిపిస్తారే" అన్నాడు.

"భలేవారు .. నా ఫ్రెండ్సందరూ నీకు పెళ్లె లాగౌతుంది తల్లీ, కట్టుకున్న వాడెవడో కళ్ళు మూసుకునే నీతో కాపురం చెయ్యాలి అని ఎగతాళి చేస్తూ ఉంటారు" అని నవ్వుతూ చెప్పింది.

"ఎవరండీ- రమ్మనండి, వాళ్ళ కళ్ళకి ఏదో దోషం ఉండి ఉంటుంది. నా కళ్ళు పెట్టుకుని చూడమంటాను" అన్నాడు.

అలా అని రెప్ప వెయ్యకుండా, ఆరాధించే కళ్ళతో చూడసాగాడు.

'మెరుపు తీగెలాంటి ఈమె అందంగా లేదా? నిజానికి అందం, హృదయ సౌందర్యం కలిపి ముద్ద చేసిన బంగారు బొమ్మే' అనుకొని చూపులు తిప్పుకోలేకపోయాడు.

"డొంక తిరుగుడంతా ఎందుకండీ నమత గారూ! మీరు చాలా అందంగా ఉన్నారు. నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. నన్ను మీరు పెళ్ళి చేసుకుంటారా? అని అడగగూడదా?" అంది నమత పకపకా నవ్వుతూ.

జగదీష్ గుండెల్లో మరో బాంబు పేలినట్ల యింది. ఏమిటీ అమ్మాయి- ఎగతాళికి కూడా ఎవరూ ఇంతసూటిగా మాట్లాడరే. అయినా సందర్భం వచ్చింది గనక ఇంక ఊరుకోకూడ దు అనుకున్నాడు. షాకు నుంచి తేరుకున్నాక.

"నమతగారూ... నాకంత అదృష్టమా?" అన్నాడు జగదీష్ అంతకు మించి మరేం అనలేక.

"మనసులోని మాటని ధైర్యంగా చెప్పలేని వాళ్ళంటే నాకు జాలి. అలాంటి వాళ్ళు జీవి తంలో సుఖపడలేరు. మరొకళ్ళని సుఖపెట్టలే రు" అంది.

"మీ అభిప్రాయం తెలుసుకోకుండా నేనె లాగ బయటపడాలండీ. ఏడాది నుంచి చూస్తు న్నాను. మీరెప్పుడైనా బయటపడ్డారా? ప్రేమగా నావంక చూశారా? మరి నమతా! ఐ లవ్‌యూ అని నేను ఎలా చెప్పగలనండి" అన్నాడు జగదీష్ నవ్వుతూ.

"పరవాలేదే రొమాన్స్ తెలుసన్నమాట. ము ద్దపప్పనుకున్నాను" అంటూ పకపకానవ్వింది నమత.

"ఇంకా ఏం చూశారు. ఆరోజురానివ్వండి" అన్నాడు గంభీరంగా.

అప్పటిదాకా ధైర్యంగా మాట్లాడిన నమత జగదీష్ అలా అనగానే సిగ్గుపడిపోయి తల దించుకుంది. ముఖానకెంపులు విరిశాయి.

తానేమైనా తప్పు మాట్లాడానా అనుకున్నా డు జగదీష్.

ఇద్దరి మధ్యా కాసేపు మౌనం తాండ వించింది.

"ఇక సెలవిస్తారా దొరగారూ" అంది నమత.

ఎంత మార్పు! ఆ చలాకీతనం ఏమైంది? స్త్రీ సహజమైన గుంభనత్వం, నిండుతనం తన స్వరంలో ఎలా చోటుచేసుకుంది? అను కుంది ఆ మాట అనేశాక.



"అలాగే వెళ్లిపోదాంలెండి. ఇంతదాకా ఎలాగూ వచ్చాంగదా! నేనంటే మీ అభిప్రాయం చెప్పండి" అడిగాడు.

"మీమీద పోయిన ఆదివారం దాకా ఎలాంటి అభిప్రాయమూలేదు. ఓ అందమైన మగాడిగా మాత్రమే చూశాను. మీ మంచితనానికి మనస్సులోనే జోహార్లర్పించుకునేదాన్ని. కాని ఈరోజే మొదటిసారిగా మీరు నాకు భర్త అయితే ఎలావుంటుంది అని ఆలోచించాను. మీరు నాకు నచ్చారు. మీ ఉద్దేశాలు నాకు నచ్చాయి. ఒకే మాటలో చెపుతున్నాను. పెళ్ళంటూ చేసుకుంటే మిమ్మల్నే చేసుకుంటాను" అని లేచి చంగున లేడిలాగా గెంతి బస్‌స్టాప్ వేపు పరుగుతీసింది.

"సమతా... హలో... సమతా!" అని పిలిచాడు గానీ ఆమె ఆగలేదు. కనీసం వెనక్కి తిరిగి కూడా చూడలేదు.

మరికాస్త స్వరం పెంచాలనుకున్నాడు.

అయితే, అప్పటికే జరగరానిదేదో జరిగినట్లు అందరూ తమవేపే చూస్తున్నారని గ్రహించి మెల్లగా సమతని దూరం నుంచే అనుసరించాడు.

అప్పుడే పార్కు ఎదురుగాఉన్న బస్‌స్టాప్‌లోకి బస్ వచ్చి ఆగింది. సమత బస్ ఎక్కడం చూశాడు. బస్ బయలుదేరి వెళ్ళిపోయింది.

జగదీష్ ఏనాడూ సమత వెళ్ళినప్పుడు ఇంతగా స్పందించలేదు.

తనలోని ఓ ప్రాణం, తన శరీరంలోని ఓ భాగం విడిపోయిన భావన కలిగింది. ఆమెతో తప్ప తన జీవితానికి ఇక సంపూర్ణత్వం ఉండదని గ్రహించడానికి ఎంతోసేపు పట్టలేదు. ఈ ప్రేమ ఓ వ్యామోహం వలన జనించిన వికారం కాదు. ఈ తపన లవ్ ఎట్ ఫస్ట్ సైట్‌లాంటి కామ వికారం అంతకన్నా కాదు. ఏడాది కాలంలో ఆమెని అర్థం చేసుకున్న తరవాత కలిగిన అపూర్వమైన ప్రేమానుభూతి. ఇది కేవలం శరీరాలకి మాత్రమే పరిమితమైనది కాదు. ఇరువురి హృదయాల మధ్యా జరిగిన సంఘర్షణలవల్ల జనించిన పవిత్ర భావన అనుకున్నాడు.

ఈ స్థితిలో మరో వారం రోజులు గడపడం కష్టమే. ఆ ఉదయం దాకా ప్రతి ఆదివారం మాత్రమే సమతగారిని సాయంత్రం కలుసుకోవచ్చు అనే భావన కలిగేది. ఇక ప్రతిక్షణం సమత కావాలి. తాను ఎంత బుద్ధి లేనివాడో అర్థమైంది. మాటల సందర్భంలో ఎప్పుడో తాము విద్యానగర్‌లో ఉంటున్నామని చెప్పింది. ఎడ్రసు కనుక్కున్నా ఇంత బాధ వుండేది కాదుగదా అనుకున్నాడు.

అయితే ఎడ్రసే గనుక నిజంగా సమతని అడిగిఉంటే కథ మరోలా ఉండేదని జగదీష్‌కి తెలియదు.

★ ★ ★

జగదీష్ ఇందిరాపార్కుకి ఆ మరునటి ఆదివారం ఓ గంట ముందుగానే చేరుకున్నాడు. ఆ వారంరోజులూ క్షణమొక యుగంగా గడిపాడు.

ప్రేమికుడి అవస్థ ప్రియురాలి ఎడబాటులో ఎలా ఉంటుందో అనుభవానికి వచ్చింది. ఇష్టమైన వ్యక్తి కోసం ఎదురు చూడ్డం, కొండ చిలువలాగా మెల్లగా సాగేకాలంతో కుస్తీపట్టడంలో ఎంత బాధవుందో గ్రహింపుకి వచ్చింది.

కానీ సమత జాడ మరునటి ఆదివారం కనిపించలేదు. సాయంత్రం ఏడు గంటల దాకా చూశాడు. అంత ఆలస్యంగా పార్కుకి రాదని తెలుసు! కానీ తప్పకుండా వస్తుందనే ఆశతో ఎదురు చూశాడు. చివరికి వెళ్ళక తప్పలేదు.

ఇహ తను మళ్ళీ ఆదివారం దాకా ఆగకతప్పదు. ఆమె రిజర్వు బేంకులో పనిచేస్తున్నానని చెప్పడం జ్ఞాపకం వచ్చింది. వెళ్ళి ఆమె గురించి భోగట్టా చేశాడు. సెలవు పెట్టిందని తెలిసింది. సెలవు కూడా ఈ వారంలోనే పెట్టాలా!

రోజూ సాయంత్రం విద్యానగర్ రోడ్లమీద తిరిగాడు. కాని ఆమె ఎక్కడా కనిపించలేదు.

ఎంతో ఎదురు చూసిన ఆదివారం మళ్ళీ వచ్చింది. ఎప్పుడూ సమతా తనూ కూర్చునే సిమెంటు బెంచీమీద కూర్చున్నాడు.

చుట్టూ ఉన్న ప్రపంచం, ఎగిరేపిట్టలు, తిరిగే మనుషులూ వేటిమీదా ఆసక్తిలేకపోయింది. కన్నులు సమతని మాత్రమే చూడదలచుకున్నాయి. ఆమె ఇంక రాదా? కీట్స్




పద్యం జ్ఞాపకం వచ్చింది. కీట్స్ ప్రియురాలి లాగా చేస్తుందా? చందమామ పొందుకోరి ఎదురుచూసే చకోరంలాగా తను ఇలా బతుకంతా ఎదురుచూడాల్సిందేనా?

అంతలో గుండెల్లో ఏదో తెలియని ఆనందం రేకెత్తిస్తూ పార్కులో ఓతటిల్లత మెరిసినట్లయింది. దూరంగా పార్కులోకి ప్రవేశిస్తూ నమత. ఆమె కన్నుల్లోని మెరుపే తన హృదయాన్ని తాకిందా. ఎంత వింత అనుభూతి.

అయితే ఆమె పక్కనే నడివయస్కులైన ఓ స్త్రీ, పురుషుడూ నడుస్తున్నారు. వాళ్ళెవరైందీ మొదట అర్థం చేనుకోలేకపోయినా తరవాత వాళ్ళు నమత పిన్నీ చిన్నాన్న అయివుంటారని గ్రహించాడు.



వాళ్లని తనకి పరిచయం చెయ్యాలని తీసుకుని వస్తున్నదా. సమతా నువ్వెంత నిర్దయురాలివి. ఈ పని పోయిన వారమే చేసివుంటే ఎంత బాగుండేది.

ఎదురుగా పరుగెత్తుకుని వెళ్ళి సమత చేతులు ముద్దాడి గుండెలకు హత్తుకోవాలనే ప్రబలమైన కోర్కెను అదుపుచేసుకున్నాడు.

వాళ్ళు ముగ్గురూ తిన్నగా జగదీష్ కూర్చున్న బెంచి దగ్గరికి వచ్చారు.

సమత జగదీష్‌ని చూసి– "జగదీష్‌గారూ ఈయనే మా నాన్న కృష్ణమూర్తి, ఈమె మా అమ్మ అన్నపూర్ణ" అని పరిచయం చేసి వాళ్ళతో– "ఈయనేనేను మీకు చెప్పిన జగదీష్" అని పరిచయాలు పూర్తి చేసింది.

సమత వాళ్ళ పిన్నినీ, చిన్నాన్నను ఎవ్వరికి పరిచయం చేసినా తల్లిదండ్రులుగానే పరిచయం చేస్తుంది. ఏ నూటికొక్కరికోగాని సమత వాళ్ళకి పుట్టిన కూతురు కాదని తెలియదు.

జగదీష్ రెండు చేతులూ ముకుళించి నమస్కారం చేశాడు.

సమత చిన్నాన్న కృష్ణమూర్తి ముందుగా జగదీష్‌తో "మీరెక్కడ పనిచేస్తున్నారు?" అని అడిగాడు.

"సెక్రటేరియట్‌లోనండీ" అన్నాడు వినయంగా.

"మీ నాన్నగారేం చేస్తున్నారు?"

"ప్రస్తుతం ఏపనీ చెయ్యడం లేదండీ. ఇంజనీరుగా ఉద్యోగం చేసి రిటైరయ్యారు" అన్నాడు.

"మీ ఇల్లెక్కడ?"

ఇలాంటి ప్రశ్నలు మరెవరైనా మరో సందర్భంలో అడిగిఉంటే ఒక్క ప్రశ్నకి కూడా సమాధానం చెప్పిఉండేవాడు కాదు. ఇప్పుడు తనకి ఇష్టమైన సమత తల్లిదండ్రులనే గౌరవం అతని చేత సౌమ్యంగా సమాధానాలు చెప్పేలాగా చేసింది.

"ఆదర్శనగర్‌లోనండీ. పోయిన ఏడాదే రిటైరైనప్పుడు వచ్చిన డబ్బుతో ఓ ఇల్లు అమ్మకానికొస్తే కొన్నారు" అని వివరించాడు.

కృష్ణమూర్తి అంతమాత్రం సభ్యతా సంస్కారాలు తెలియనివాడు కాదు. కాకపోతే కన్నకూతురికన్నా మిన్నగా పెంచిన సమత. ఆమె భవిష్యత్తు కోసం ఆ మాత్రం వివరాలు తెలుసుకోకతప్పలేదు.

"మీరే ఉంటున్నారా... అద్దెకేమైనా ఇచ్చారా? ఇవన్నీ ఊరికే అడుగుతున్నాను. మా అమ్మాయి సమత నడిగితే ప్రతిదానికీ తెలీదుతెలీదు అనేమాటే. ఏవిటో ఈకాలం పిల్లలు" అన్నాడు.

"పరవాలేదు. అడగండంకుల్... తెలుసుకోవడంలో తప్పులేదుగదండీ. కింద రెండుపోర్షన్లు అద్దెకిచ్చాము. పైన ఫస్టుఫ్లోర్‌లో మేముంటున్నాము" అన్నాడు.

"అదిసరే... మా గురించి ఎప్పుడైనా మా సమత మీకు చెప్పిందా?" అడిగాడు.

"లేదండీ, నేనెప్పుడూ అడగందే. కనీసం మీ అడ్రను కూడా నాకు తెలీదు. లేకపోతే పోయిన వారం మీఇంటికి రావాలనుకున్నాను" అన్నాడు.

అలా అన్నాడేగానీ తప్పుగా మాట్లాడానా అని కొంచెం కంగారుపడ్డాడు ఆ తర్వాత.

సమతవేపు చూస్తే ఆమె ముసిముసి నవ్వులు నవ్వుతోంది.

"అలాగా" అని నవ్వేడు కృష్ణమూర్తి.

అన్నపూర్ణకి వాళ్ళలాగ నవ్వడం నచ్చలేదు. జగదీష్ చిన్నబుచ్చుకుంటేనో అనుకుంది.

సమత– "ఊరికే మెయిన్‌రోడ్లమీదా, లింకు రోడ్లమీదా తిరిగితే కావలసిన వాళ్ళు కనబడరండీ! కాస్తలోపలి సందుల్లో కూడా చూడాలి" అంది పకపకానవ్వుతూ.

అన్నపూర్ణ కలగజేసుకుంది.

"ఏమిటే సమతా... అలా ఎగతాళి చెయ్యొచ్చునా?" అని మందలించింది.

"సారీ మమ్మీ" అంది. అన్నపూర్ణకి కోపం వచ్చినప్పుడల్లా అలా క్షమాపణ చెప్పడం సమత అలవాటు.

"ఏమిటి మీరంటున్నది" అన్నాడు జగదీష్! సమత, తను విద్యానగర్‌లో పోయిన వారం కాలుకాలిన పిల్లిలా తిరగడం చూసిందని అర్థమైపోయింది.

కృష్ణమూర్తి జగదీష్‌తో– "ఇప్పుడైనా మా గురించి తెలుసుకోవా బాబూ! మా అమ్మాయి




# ఇతర డైలు అన్నీ కలిపి ఎంతమంది వాడుతారో అంతకంటే ఎంతో ఎక్కువ మంది తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డైనే వాడుతారు.

ఇవిగో 3 మంచి కారణాలు:




రెండు నైసర్గిక రంగులలో లభ్యం—
బ్లాక్ మరియు డార్క్ బ్రౌన్.

**1** తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డై మీ జుట్టుకు అందిస్తుంది నైసర్గిక రంగు, రూపం. జుట్టును మృదువుగాను, ఎలా కావలిస్తే అలా చక్కగా వుంచుకోడానికి దీనిలో కండిషనర్ కూడా వున్నది.

నిజానికి, వేసుకొన్నారని మీరు చెప్పితే తప్ప ఎవరికీ తెలియదు.

**2** ఇతర హేర్ డైలలాగా కాకుండా, తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డైని సులభంగా, అనుకూలంగా వేసుకోవచ్చు.

అవును, జుట్టును షాంపూ చేసుకోవడం లాగే ఎంతో సులభం.

**3** తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డై నాణ్యత సంబంధంగా మీరు నిశ్చింతగా వుండవచ్చు. ఎందుకంటే, మీ జుట్టును, చర్మాన్ని సంరక్షించడానికి ఇది ప్రత్యేకంగా తయారు చేయబడినది.

పరిపూర్ణ రక్షణ—ఇదే గోద్రెజ్ వాగ్దానం.

**గోద్రెజ్®** తనంతట తానే వ్యాపించే పర్మనెంట్ హేర్ డై.



మీ విషయం చెప్పింది'' అన్నాడు.

''నేనేమీ తెలుసుకోనవసరం లేదండి. నాకు కావలసింది మీ అమ్మాయి అంతే. మీకేం ఉన్నా లేకపోయినా సరే'' అన్నాడు తల వంచుకొని ఎంతో నమ్రతగా.

''మంచిది బాబూ... మీ అమ్మానాన్నలను ఒప్పించి మా ఇంటికి తీసుకువస్తే పెళ్ళిమాటలు మాట్లాడుకుంటాము. ఇదుగో నా విజిటింగు కార్డు'' అని జేబులోనుంచి ఓ విజిటింగు కార్డు తీసి అందించాడు.

జగదీష్ విజిటింగ్‌కార్డు అందుకుని చదివాడు. జేబులో పెట్టుకున్నాడు.

''ముందుగా నా దొక రిక్వెస్టు అంకుల్'' అన్నాడు.

''చెప్పు బాబూ ఏమిటది?'' అడిగాడు ఎంతో ఆప్యాయంగా కృష్ణమూర్తి.

''ఏం లేదండీ. మీకభ్యంతరం లేకపోతే ముందుగా సమతని మా ఇంటికి తీసుకుని వెళ్ళి మా అమ్మానాన్నలకి పరిచయం చేస్తాను. తరవాత మీ ఇంటికి తీసుకువస్తాను''.

''దానికేం బాబూ- అలాగే చెయ్యి'' అన్నాడు.

ఆ తర్వాత పని అయిపోయినట్లుగా బెంచీలమీది నుంచి లేచారు ఇద్దరూ.

''ఇక వెళ్ళొస్తాం జగదీష్ బాబూ'' అని అన్నాడు కృష్ణమూర్తి.

''ఉండండి ... అలా కాంటీన్‌కి వెళ్ళి కాఫీలు తాగుదాం'' అన్నాడు జగదీష్.

కృష్ణమూర్తి భార్య అన్నపూర్ణ ''తప్పు నాయనా! ఇప్పుడు మనమేమీ తినకూడదు, తాగకూడదు. కతికితే అతకదు అంటారు'' అంది భయంగా.

''నయం. చెప్పారు. మీకూ ఇలాంటి నమ్మకాలున్నాయాండీ! అయితే తప్పకుండా కాఫీలు తాగితీరాల్సిందే'' అంటూ మొగిలిపొదలకి ఎడమగా తోటలో వున్న కాంటీన్ వైపు తోవతీశాడు. కృష్ణమూర్తి, అన్నపూర్ణ, సమత తప్పదన్నట్లు జగదీష్‌ని అనుసరించారు.

కాంటీన్‌కి ఎదురుగా ఆరుబయట గచ్చువాకిలి మీద కేన్ కుర్చీలు వేసివున్నాయి.




జగదీష్ ఖాళీగావున్న నాలుగు కుర్చీలు చూపించి వాళ్ళని కూర్చోమన్నాడు.

వెళ్ళి బిస్కెట్లు ఓ ప్లేటులో తీసుకువచ్చి టీపాయ్‌మీద ఉంచాడు.

కూర్చుని తలోరెండేసి బిస్కెట్లు తిన్నారు. ఇంతలో నాలుగు కూల్‌డ్రింక్సు తెచ్చాడో కుర్రాడు. చల్లని డ్రింక్స్ తాగగానే కాస్త తాపం చల్లారినట్లయింది.

జగదీష్ బిల్లు చెల్లించాడు.

కృష్ణమూర్తికిగాని, అన్నపూర్ణకిగాని అలా తినడం, జగదీష్ చేత ఖర్చు పెట్టించడం ఇష్టం అనిపించలేదు.

విడిపోయేముందు ''రేపే సమతని మా ఇంటికి తీసుకెళతానండి. బ్యాంకు దగ్గరే కలుసుకుని నాతో తీసుకువెళతాను. నేనే మళ్ళీ మీ ఇంట్లో దిగబెడతాను. ఆలస్యమైనా కంగారుపడకండి'' అని చెప్పాడు.

''అలాగే'' అని అనుమతించాడు కృష్ణమూర్తి.

అప్పుడే బస్ వచ్చింది.

కృష్ణమూర్తి, అన్నపూర్ణ బస్సు ముందుగా ఎక్కారు. సమత జగదీష్‌కి బస్ ఎక్కేముందు చెయ్యివూపి ''బై'' అంది.

ఆ రోజు సమతతో ప్రత్యేకంగా మాట్లాడకపోవడం వెలితిగానే అనిపించింది. ఎడబాటనే వడగాడ్పుల తాకిడికి సతమతమయ్యాడు. తొలకరిజల్లులాగా సమత సన్నిధిలో ఊరటపొందాడు.




ఆదర్శనగర్‌లోని ఇళ్ళన్నీ పెద్ద పెద్ద భవనాలే. జంటనగరాలలో చెప్పుకోదగ్గ కాలనీ అది. సాయంత్రం వేళ ఏ టాంక్‌బండ్‌కో,



పబ్లిక్‌గార్డెన్స్‌కో వ్యాహ్యాళికి నడిచిపోవచ్చు. రవీంద్రభారతి, బిర్లామందిర్, ప్లానిటోరియమ్ అన్నీ దగ్గరే- కాలక్షేపానికి కొరతవుండదు.

ఓ పాతిక సంవత్సరాలక్రితం ఈ ప్రాంతం ఇంతలాగా వుండేదికాదు. ప్రస్తుతం బిర్లా మందిర్, బిర్లాప్లానిటోరియమ్ వున్నవి రెండు కొండ శిఖరాలు. వాటిని కాలాపహాడ్, నౌబత్‌పహాడ్ అని పిలిచేవారు. నౌబత్‌పహాడ్ మీద పూర్వం పెద్దఢంకా మోగించేవారట. ఇటు గోలుకొండ నవాబులకీ, అటూ మౌలాలీ పహాడ్‌కీ ఢంకా శబ్దం ద్వారా నమాజుకి సంబంధించిన సమయాలు తెలియజేసేది అని చెపుతారు. ఇప్పుడా కొండశిఖరాలు జంటనగరాలకి వినోదవిజ్ఞాన కేంద్రాలుగా






మారిపోయాయి.

చలపతిరావుగారిల్లు బిర్లామందిర్‌కి పోయే రోడ్డు మీదనేవుంది. గేటు తెరుచుకుని కాంపౌండులోకి ప్రవేశిస్తే ఎదురుగుండా ఆహ్వానిస్తున్నట్లు డాబా మీదికి మెట్లుంటాయి. పైన డాబాలో సగభాగం ఖాళీగానే వుంటుంది. మిగతా సగభాగంలోనూ చక్కని ఇల్లు. పెద్దహాలు, రెండు పడకగదులు, కిచెన్, ఎటాచ్‌డ్ బాత్ రూములు, టాయ్‌లెట్లూ- అన్ని సదుపాయాలతో అధునాతనంగా కట్టించిన ఇల్లు.

సాయంత్రం అయిదు గంటలౌతోంది.

హాలులో సోఫాసెట్ మధ్యలో టీపాయ్‌వుంది. కింది అరలో కొత్త కొత్త పత్రికలూ, మేగజైన్‌లూ అమర్చివున్నాయి.

చలపతిరావు సోఫాలో కూర్చుని పేపరు చదువుకుంటున్నాడు. మామూలుగా అయితే ఆ సమయానికి వాకింగ్‌కి వెళ్లిపోయేవాడే. కాని కాఫీ ఇంకా తయారుకాలేదు.

కాఫీ వచ్చేలోగా ఉదయం వదిలేసిన కొన్ని వార్తలు చదువుతున్నాడు.

ఇంతలో గేటు తెరిచిన చప్పుడు. తరవాత స్కూటర్‌లోనికి ప్రవేశించడం వినిపించింది. వాళ్ళబ్బాయి వస్తున్నాడని అర్థంచేసుకున్నాడతను.

మరో అయిదు నిముషాలలో కొడుకు జగదీష్‌తోపాటు ఓ అందమైన అమ్మాయి కూడా రావడం చూసి ఆశ్చర్యపోయాడు. ఏనాడూ జగదీష్ ఏ అమ్మాయినీ వెంటబెట్టుకుని రాలేదు.

వస్తూనే జగదీష్ "నాన్నా ... సమత అని నాకు తెలిసిన అమ్మాయి" అని చెప్పి "సమతా ... ఈయనే మా నాన్నగారు" అని పరిచయం చేశాడు.

సమత చలపతిరావుకి నమస్కరించింది.

చలపతిరావు సమతని పరిశీలనగా చూశాడు. బాగా చదువుకున్న బుద్ధిమంతురాలిలా కనిపించింది.

"రా అమ్మా! అలా సోఫాలో కూర్చో" అని లోన కాఫీ తయారుచేస్తున్న భార్యని "నిర్మలా ... కాస్త బయటికిరా! ఎవరొచ్చారో చూడు?" అని కేకేశాడు.

గేస్ స్టౌ వెలిగించి కాఫీ కలిపే పనిలో మునిగివున్న నిర్మలకి "ఎవరొచ్చారో చూడు" అనే మాట వినిపించింది.

ఎవరో చాలాకాలం నుంచి రాని చుట్టాలెవరైనా వచ్చారేమో అనుకుని కిచెన్‌లోనుంచి గబగబా బయటికి వచ్చింది.

జగదీష్‌ని, మరెవరో అందాలభరిణలాగ సోఫాలో కూర్చున్న కొత్త అమ్మాయిని చూసింది.

జగదీష్ అమ్మకి కూడా సమతని పరిచయంచేద్దాం అనుకుంటూ వుండగానే-

"ఎవరీ అమ్మాయి" అని జగదీష్‌ని అడిగింది.

"నా స్నేహితురాలమ్మా ... పేరు సమత" అని పరిచయం చేశాడు.

సమత ఎంతో అణుకువగా "నమస్కారమండీ" అంది.

చక్కని చుక్కలాగా వున్న సమత నిర్మలాదేవిని ఆక్షణమే ఆకట్టుకుంది.

"కూర్చో అమ్మా ... ఇప్పుడే కాఫీలు తెస్తాను. కాఫీ తాగుతూ మాట్లాడుకుందాం" అని లోనికి వెళ్ళబోయింది.

"అబ్బే ... ఎందుకులెండి. కాఫీలెప్పుడూ వుండేవే. మీరు కూర్చుని సరదాగా కబుర్లు చెప్పండి చాలు" అంది కలుపుగోలుగా.

"ఉండమ్మా ... ఎంతసేపు ... కలిపి తీసుకురావడమే" అని లోనికి వెళ్ళింది.

సమత జగదీష్ వేపు చూసి "పాపం, మీ అమ్మగారికిప్పుడు పనిపెట్టాను" అంది.

"ఏం ... మీ ఇంటికి వస్తే మీ అమ్మ చేతకాఫీ పెట్టించవా?" అన్నాడు ఎగతాళిగా.

"కాఫీ పనిపెట్టనని నేనెప్పుడన్నాను. భోజనం పనికూడా పెడతాను- మీరు రావాలేగాని" అని నవ్వింది.

"అలాగేం ... మా అమ్మ ఒట్టి కాఫీయే ఇస్తున్నదని ఎగతాళి చేస్తున్నారుగదూ" అని బుంగమూతిపెట్టాడు జగదీష్.

చలపతిరావు ఆ ఇద్దరినీ గమనిస్తూనేవున్నాడు. అతనికి ప్రేమలొలుకుతున్న వాళ్ళ కళ్ళు కబుర్లాడుకుంటున్నట్లు కనిపించాయి. తాను దగ్గరేవున్నానన్న ధ్యాసే లేకుండాపోయింది వాళ్లకి.

కాస్త దగ్గాడు "తప్పురా జగదీష్ ... ఇంటికి వచ్చిన అమ్మాయిని అలా చిన్నబుచ్చకు. కావాలంటే మీ అమ్మకి కూడా నువ్వు భోజనం వనిపెట్టు" అన్నాడు నవ్వుతూ.

"లేదంకుల్ ... ఊరికే అన్నాను" అని సిగ్గుపడింది నమత.

నిర్మలాదేవి ఓ ట్రేలో నాలుగు కప్పుల కాఫీ తెచ్చి టీపాయ్‌మీద పెట్టింది. ఆమెకూడా భర్త పక్కనే కూర్చుంది. జగదీష్ నమతా చెరో సోఫామీదా కూర్చుని ఉన్నారు.

కాఫీలు ముగించారు.

నిర్మల నమతతో మాటలకి దిగింది.

"మీ నాన్నగారేం చేస్తుంటారమ్మా" అనడిగింది.

నమత మెల్లగా "మా నాన్నగారు చిన్నప్పుడేపోయారండీ! మా అమ్మకూడా నా ఎనిమిదో ఏట పోయింది. మా చిన్నాన్న పిన్ని పెంచి పెద్దచేశారు" అంది.

చిన్నప్పుడే తల్లిదండ్రుల్ని పోగొట్టుకున్న పిల్లల్ని చూస్తే నిర్మల భరించలేదు. ఆమె హృదయం జాలితో నిండిపోయింది.

"అయ్యో పాపం ... మీ పిన్నికెంతమంది పిల్లలు" అనడిగింది.

నమత ముఖంలో విషాదం అలముకుంది. ఆమెకి జీవితంలోవున్న దిగులంతా అదే. పిన్నికడుపుపండి వాళ్ళ కడుపున ఓ కాయ కాసి తనకో తమ్ముడు పుడితే ఎంత బాగుండునో, పెళ్ళిచేసుకుని తనువెళ్ళిపోతే వాళ్ళేమైపోతారు అనేదే.

చెప్పలేక చెప్పింది "ఆమెకి పిల్లలు లేరండి"

"అయ్యో ... మరి మీ బాబాయేం చేస్తుంటారు?" అనడిగింది.

జగదీష్‌కి అలా ఎదుటిమనిషిని కూర్చోబెట్టి ప్రశ్నల మీద ప్రశ్నలు వేసి సమాచారం సేకరించే స్త్రీల మనస్తత్వం అంటే ఎలర్జీ, చాలా చిరాకు. కాని ఓ వేపు అమ్మ ఏకంగా ప్రశ్నల బాణాలు సంధించి నమత మీదికి వదులుతోంది. నమత ఉక్కిరిబిక్కిరి అవడం చూశాడు.

నమత ఒపిగ్గానే "స్టేట్ గవర్నమెంటులో పనిచేస్తున్నారు"

"సొంత ఇల్లేనా?"

"అవునండి. హౌసింగ్‌బోర్డు ఎలాట్‌మెంటు. మరో అయిదేళ్ళలో సొంతం అవుతుంది" అంది.

"ఆహా ... చాలా సంతోషం. అమ్మాయ్ ... నువ్వేమీ అనుకోకపోతే మీదే కులమమ్మా" అనడిగింది.

జగదీష్‌కి కోపం వచ్చింది. స్వతంత్రం వచ్చి ఇన్నేళ్ళు అయినా ఈ కులమత ప్రసక్తి రాకుండా వుండదు.

సీరియస్‌గా "ఏం ప్రశ్నమ్మా అది? ఏ కులమైతే నీకెందుకు?" అని గదమాయించాడు.

చలపతిరావుకి కూడా కులాల ప్రసక్తికిట్టదు.

నమత జగదీష్‌ని వారిస్తూ, "మీరుండండి. మా ఆడవాళ్ళ మాటల్లో జోక్యం చేసుకుంటారేం. కులాలూ మతాలూ అంటూ వున్నప్పుడు అడగడంలో తప్పేముంది" అని నిర్మలాదేవి వేపు తిరిగి, "మీ అబ్బాయి మాటలకేంలెండి! ఈ కులమతవర్ణ విభేదాలున్నంతకాలం అడిగే వారు అడగకా తప్పదు, చెప్పేవారు చెప్పకాతప్పదు. మా కులం పేరు చెప్పినా మీకు అర్థంకాదులెండి. మాది విశాఖపట్నం జిల్లాలో మాత్రమే వినిపించే ఓ వెనకబడిన కులం. వృత్తి వ్యవసాయం. అగ్రకులం మాత్రం కాదు" అని చెప్పింది.

నిర్మల అలాంటి ప్రశ్న వేసినందుకు చిన్నబుచ్చుకుంది. ముఖం ప్రసన్నంగా మార్చుకుని "పోనీలే అమ్మా! ఊరికే అడిగాను. కులాల పేరెత్తితేనే మా అబ్బాయి తిడతాడు. అయినా ఏమిటో నేనిలాగ తెలివితక్కువగా వాగేస్తూ వుంటాను. నిజానికి కులంలో ఏముందమ్మా ... గుణం ప్రధానంగాని- నువ్వేమీ అనుకోకమ్మా" అని నమతని సముదాయిస్తూ ఒళ్ళు నిమిరింది.

"ఫరవాలేదులెండి. మన సాంఘిక వ్యవస్థ మారనప్పుడు ఒకరిని తప్పు పట్టలేం. ఈ కులమతవర్గ విభేదం లేని వ్యవస్థ రేపెప్పుడో తప్పకుండా వస్తుంది- అంతదాకా ఓపిగ్గా ఎదురుచూడ్డమేగాని ఏమీ చెయ్యలేము" అంది

సమత.

వాతావరణం కాస్త కలుషితం అయినట్లు యింది. జగదీష్ కూడా ఫీలయ్యాడు. గాలీ, నీరూ, ఎండా, వానా అందరినీ సమానంగా ఆదరిస్తున్నప్పుడు మనిషి అందరినీ సమానంగా ఎందుకు చూడడు- అనుకున్నాడు. ఓ తెలివైనవాడు అడ్డుగోడలు సృష్టించాడు. ఈ తెలివితక్కువ సమాజం వాటిని ఆచరిస్తోంది. ఆ అడ్డుగోడలు వగుళ్ళేసి కూలిపోతున్నా కొంతమంది ఇంకా వాటిని తడికెలతో నిలబెడుతున్నారు. సూర్యకాంతిని అరిచేతితో అడ్డే ప్రయత్నాలు- నవ్వుకున్నాడు.

"జగదీష్‌గారూ ... మీ అమ్మాగారినీ, నాన్నగారినీ చూపించినందుకు థాంక్స్. ఇంక వెళదామా?" అంది సమత.

నిర్మల "చాలా సంతోషం అమ్మాయ్- అప్పుడప్పుడు వస్తూవుండు" అంది.

"అలాగేనండీ" అని చలపతిరావుకి నమస్కరిస్తూ "వస్తానంకుల్" అని సెలవు తీసుకుంది.

"మంచిదమ్మా" అని కొడుకుతో- "జగదీష్...

జగదీష్! అమ్మాయిని దిగబెట్టిరా" అని పురమాయించాడు చలపతిరావు.

"అక్కర్లేదండీ ... బస్‌స్టాప్‌దాకా దిగబెడితే చాలు. ఉద్యోగం చేసుకునే అమ్మాయిని- ఆ మాత్రం ఇల్లు చేరలేనా?" అంది సమత.

జగదీష్, సమతా బయటికి వెళ్ళిపోయారు. తరవాత కాంపౌండులోనుంచి స్కూటర్ దూసుకుపోయిన శబ్దం వినిపించింది.

చలపతిరావు, నిర్మలాదేవి ఆశ్చర్యం నుంచి తేరుకున్నారు.

నిర్మల భర్తనిచూస్తూ "అబ్బాయి ఎప్పుడూ లేంది ఓ అమ్మాయిని తీసుకువచ్చాడేవిటండీ?" అంది.

"అదే చూస్తున్నాను. ఓ వయసులోవున్న యువకుడు అమ్మాయిని తీసుకువచ్చి తల్లిదండ్రులకు పరిచయం చేశాడూ అంటే ఒకటే అర్థం. మనవాడు ప్రేమలోపడ్డాడన్న మాట. రేపెప్పుడో ఈ అమ్మాయినే పెళ్ళిచేసుకుంటానని గొడవచేస్తాడు" అన్నాడు సాలోచనగా

నిర్మల గుండె ఝల్లుమంది.

"ఏమిటి మీరనేది ... మన అబ్బాయి వర్ణాంతర వివాహం చేసుకుంటాడంటారా?" అంది బెంగగా.

"ఇంకా వర్ణాంతర వివాహాలేమిటి నీమొహం, ఆమె యువతి, మనవాడు యువకుడు. ఇష్టపడి పెళ్ళిచేసుకుంటాం అనివాళ్ళంటే మనం అనుమతించక తప్పదు" అన్నాడు విషయాన్ని తేలిగ్గా తీసిపారేస్తూ.

భార్య నిర్మల తనస్థాయికి ఎదిగి వర్ణాంతర వివాహానికి ఒప్పుకోదని బాగా తెలుసును. ఒప్పించడానికి మొదటి అస్త్రంగా ఆమాట అన్నాడు.

"నేను బతికుండగా ఆపనిచెయ్యనివ్వనండీ! కన్నతల్లిని, నామాటకాదని ఆ అమ్మాయిని చేసుకునే ధైర్యమే" అంది ఎంతో నమ్మకంగా.

"అలాగైతే మరీమంచిది. జరగబోయేదానికి ముందే జగడమెందుకు- నువ్వూరుకో. నేనలాకాస్త వాకింగ్‌కి వెళ్ళివస్తాను" అని బయటికి నడిచాడాయన.

★ ★ ★

జగదీష్ ఇల్లు చేరుకునేసరికి దాదాపు రాత్రి పదిగంటలయింది. కింది కాంపౌండులోనే స్కూటర్‌ని మెట్లకింది స్థలంలో పార్కుచేశాడు.

మెట్లెక్కి ఢాబా మీదికి వెళ్ళాడు.

చలపతిరావూ, నిర్మలా హాలులో టీవీ చూస్తున్నారు.

జగదీష్ తిన్నగా తన గదిలోకి వెళ్ళిపోయాడు. బట్టలు విప్పి హేంగర్‌లో తగిలించి గోడ బీరువాలో పెట్టేశాడు. లుంగీకట్టుకుని బాత్‌రూంకి వెళ్ళి ముఖం అదీ కడుక్కుని హాలులోకి వచ్చాడు.

నిర్మల లేచి "రారా- భోజనంచేద్దువుగాని" అని పిలిచింది.

"ఒద్దమ్మా ... ఎంతవద్దన్నా సమతవాళ్ళ ఇంట్లో టిఫినూ అదీపెట్టారు. ఆకలిగా లేదు. ఓ గ్లాసెడు మజ్జిగ ఉంటే తీసుకురా- తాగి పడుకుంటాను" అని సోఫాలో కూలబడ్డాడు.

నిర్మల వంటింట్లోకి వెళ్ళగానే చలపతిరావు కొడుకుని చూశాడు.




"ఒరే జగ్గూ ... ఇందాక ఆ అమ్మాయిని తీసుకువచ్చిన దగ్గర్నుంచి చూస్తున్నాను. చాలా హుషారుగా కనిపిస్తున్నావు. ఏమిటి విశేషం? ఆ అమ్మాయిని మాకెందుకు పరిచయం చేశావు?" అని అడిగాడు.

"డాడీ ... మీదగ్గర దాపరికమెందుకు. నేను సమతని ప్రేమిస్తున్నాను. నేనంటే సమతా ఇష్టపడింది. ముందుగా మీకు చూపించి అమ్మనీ, మిమ్మల్నీ ఒప్పించి పెళ్ళిచేసుకుందామనుకుంటున్నాను" అన్నాడు.

జగదీష్ ముక్కుసూటితనం చలపతిరావుకి తెలుసును. చిన్నప్పట్నుంచీ అంతే! ముసుగులో గుద్దులాట అంటే అసహ్యించుకుంటాడు.



చలపతిరావు నిట్టూర్చాడు. నిర్మల మాత్రం విషయాన్ని అంతతేలిగ్గా తీసుకోలేదు. ఇంట్లో తుఫాను చెలరేగే సూచనలు కనిపించాయి.

మెల్లగా "నేనో విషయం ముందుగానే గ్రహించానురా! పెళ్ళికాని ఇద్దరు యువతీ యువకులు ఎప్పుడు కలిసి తిరుగుతారో తెలియనివాణ్నికాదు. నాకెలాంటి అభ్యంతరమూ లేదురా జగదీష్" అన్నాడు.

"థాంక్స్ నాన్నగారూ! నేను మీ రక్తం పంచుకుని పుట్టిన కొడుకుని. నా భావాలు కూడా మీలోనుంచి వచ్చినవే అయివుంటాయి. మీరు నన్ను సమర్థిస్తారని నాకు తెలుసును" అని తేలికగా గాలిపీల్చుకున్నాడు జగదీష్.

అతని ఆనందానికి అవధుల్లేకపోయాయి. తండ్రి అంటే ఎప్పుడూ ప్రేమ ఎక్కువే. తండ్రీ, దైవం, స్నేహితుడూ అన్నీ ఆయనే. ఏనాడూ మనస్సు నొప్పించిన జ్ఞాపకంలేదు. ఇలాంటి తండ్రి ఎంతమందికి వుంటాడు. ఇదంతా తన అదృష్టంకాదూ- అనుకుని తండ్రిని మనసులోనే అభినందించాడు.

చలపతిరావు మళ్ళీ అందుకున్నాడు- గొంతుసవరించుకుని "కాని జగదీష్ ... నీకు తెలియని విషయం చెప్పడం తండ్రిగా నాబాధ్యతరా! నీకు ఈ సమాజం సరిగ్గా తెలియదు. నీ ఎదురుగా నీ అంతవాడు లేడు అని పొగిడేవారే నీవెనక తిడతారు. విమర్శిస్తారు. నీ చరిత్ర నీకు తెలియకుండానే నిన్ను నీడలాగా వెంటాడుతుంది.

తండ్రి ధోరణిని మధ్యలోనే ఆపాడు జగదీష్- "వెనక ఎవరెన్ని చెప్పుకున్నా మనమెందుకు లెక్కచెయ్యాలి డాడీ! నేనలాంటివి లెక్కచెయ్యను" అన్నాడు కరాఖండిగా.

"నాకు తెలుసునురా జగ్గూ- నువ్వు అలాంటివి లెక్కచేసేవాడివి కాదని. నాకు తెలియదా? కాని నీపిల్లలు, వాళ్ళ భవిష్యత్తు, వాళ్ళ పెళ్ళిళ్ళు, ఇవన్నీ ఆలోచించాలిగదా?"

"నాకా నమ్మకం వుంది డాడీ" ఈతరానికి చెందిన మీరే మమ్మల్ని ప్రోత్సహించి మా పెళ్ళికి సమ్మతిస్తున్నప్పుడు రేపటితరానికి వారధినైన నేను వర్ణాంతర వివాహానికి ఎలాగ అభ్యంతరం చెపుతాను అన్నాడు.

నిర్మల మజ్జిగ కలిపి తేబోతూనే తండ్రీకొడుకుల సంభాషణ విన్నది. అక్కడేవుండి మొత్తం విషయం అర్థంచేసుకుంది. ఆమెకి ఎంతో కోపం వచ్చింది. పిల్లల్ని కనడం, పెంచడం ఇందుకేనా? తల్లిదండ్రుల ఇష్టాఇష్టాలు గ్రహించకుండా, తెలుసుకోకుండా ఓఅమ్మాయిని తీసుకువచ్చి 'నేనీ అమ్మాయిని ప్రేమించాను. పెళ్ళి చేసుకుంటాను' అంటే ఒప్పుకోవలసిందేనా?

వంటగదిలోనుంచి సుడిగాలిలాగ బయటికి వచ్చింది నిర్మల. చేతిలోని మజ్జిగ గ్లాసుని టీపాయ్ మీద పెట్టింది. ఒళ్ళంతా తేళ్ళూ, జెర్రులూ పాకుతున్నట్లుగా వుంది. అసలు జగదీష్‌తో మాట్లాడగూడదు అనుకుంది. కాని కోపం అణచుకోలేకపోయింది.

"విన్నాను బాబూ ... అంతా విన్నాను. నీయిష్టం వచ్చినట్లు చెయ్యడమేగాని తల్లిదండ్రులున్నారు, వాళ్ళ అభిప్రాయం తెలుసుకుందామనే జ్ఞానం లేకపోయిందిరా నీకూ, విశ్వాసఘాతకుడా" అని అరిచింది- నిప్పులు కురిపిస్తూ.

తల్లి అంతగట్టిగా ఎప్పుడూ మాట్లాడి ఎరగదు. అందుకే జగదీష్ అవాక్కయిపోయాడు. అమ్మకి అంతకోపం వస్తుందని అతడు ఊహించలేదేమో ఆశ్చర్యపోయాడు. "ఏమిటమ్మా ... ఇదంతా కోపమే!" అన్నాడు.
వెళ్ళి అమ్మ భుజాల మీద రెండు చేతులూ వెయ్యబోయాడు.

వాళ్ళమ్మకి కోపమొచ్చినప్పుడల్లా భుజాల మీద చేతులు వేసి దగ్గరికి లాక్కుని బుగ్గమీద ముద్దు పెట్టుకోవడం జగదీష్‌కి అలవాటు.

కాని చేతులు దగ్గరికి రాకుండానే విదిలించి కొట్టింది. "జగ్గూ ... ఎగతాళికాదు నేను సీరియస్‌గా చెబుతున్నాను. నువ్వు ఆ కులం తక్కువ అమ్మాయిని పెళ్ళి చేసుకోవడానికి వీలులేదు" అంది.

"ఎందుకమ్మా ... అలా మాట్లాడతావు. ఇందాక నువ్వే కదా అన్నావు. కులంలో ఏముంది గుణం ప్రధానంగాని అని. ఇంతలోనే ఎందుకమ్మా మాటమారుస్తావు" అన్నాడు.

"జగదీష్ ... ఇప్పటికైనా మించిపోయింది




లేదు. నేను చెప్పేది శ్రద్ధగా విను. కులంలో ఏముంది గుణం ప్రధానంగాని అన్నాను. నిజమే. అంటే దానర్థం మన కులంలో గుణవంతులు లేరనా? మనకులంలోనే ఈ అమ్మాయి కన్నా అందమైన అమ్మాయిని, మంచి గుణవంతురాలిని ఎన్నుకుని పెళ్ళిచేసుకోరా'' అంది.

ఆమె కళ్ళల్లో నీళ్ళు నిండుకున్నాయి.

చలపతిరావు మధ్యలో కలుగజేసుకోలేకపోయాడు. ఏమీ మాట్లాడలేదు. ఇలాంటి విషయాలలో ఆమెది మొండి పట్టుదల. అసలే కొడుకు పెళ్ళి విషయం. అబ్బాయిని సమర్థిస్తే భోజనమే మానేస్తుంది అని వూరుకోవలసి వచ్చింది.

జగదీష్ మామూలుగానే శాంతపరుద్దామనుకున్నాడు గానీ సాధ్యం కాలేదు. హాస్యధోరణి వదిలి తనూ సీరియస్ మూడ్‌లోకి వచ్చేశాడు.

"అమ్మా అసలు నేను పెళ్ళి చేసుకోవాలా వద్దా?'' అని ఒకే ఒక్క ప్రశ్న వేశాడు.

"నువ్వు పెళ్ళి చేసుకోని ఈ అమ్మాయిని మాత్రం కాదు'' అంది తల్లి అంతకన్నా కరాకండిగా.

జగదీష్ స్థిర నిశ్చయానికి వచ్చినట్లు- "అయితే విను నేను బ్రహ్మచారిలాగానన్నా వుండిపోతానుగాని మరో స్త్రీని భార్యగా చూడలేను. తరువాత నీఇష్టం'' అన్నాడు.

చలపతిరావు ఇంక కలుగజేసుకోకతప్పలేదు. అలాగే వదిలేస్తే చిలికిచిలికి గాలివాన కావడం తథ్యం.

"నిర్మలా ఎందుకిలా కొట్లాడతావు. ఎప్పుడో జరగబోయేదానికి ఇప్పట్నుంచే ఎందుకిలా గొడవచేస్తావు. మెల్లగా నచ్చజెప్పవచ్చును గదా'' అని భార్యని మందలించబోయాడు.

అంతే ... నిర్మల విసవిసా వంటగదిలోకి వెళ్ళిపోయింది.

జగదీష్‌కూడా టీపాయ్ మీది మజ్జిగని అలాగే వదిలేసి తన గదిలోకి వెళ్ళిపోయాడు కోపంగా. తలుపులు బిడాయించుకున్నాడు. లైటు ఆర్పి బెడ్‌లైటు వేసుకుని పడుకున్నాడు.

ఉదయం నుంచీ మనస్సు ఆనంద డోలికల్లో తేలియాడింది. ఇప్పుడంతా పాడయింది. అమ్మ ఒప్పుకునేలాగలేదు. ఇప్పుడెలా? సమత కాదని తను మరో స్త్రీని వివాహం చేసుకోగలడా? అందుకనే ఇలాంటి గొడవలు వస్తాయనే మనస్సుని గుప్పెట్లో భద్రంగా ఇంత కాలం దాచుకుని వుంచాడు. ఏడాది పరిచయం వున్నా సమతని ఓ స్నేహితురాలిగానే చూశాడుగాని ప్రేమించలేదు. ఆ ఆదివారమే ప్రేమలో పడిపోయాడు. గాఢమైన ప్రేమలో మునిగిపోయాడు. సమత లేకపోతే జీవితం వృథా అనేభావన ఏర్పడిపోయింది.

ఏం చెయ్యాలి? ఎలా సాధించాలి?

పరుపుమీద అటూఇటూ పొర్లాడు. ఒక నిర్ణయానికి వచ్చాడు. ఎన్నాళ్ళయినాసరే అమ్మతో మాట్లాడకూడదు. ఇంట్లో తినడం కూడా మానెయ్యాలి. అప్పుడు దారికి రాకమానదు అనుకున్నాడు.

అలిసిన దానిమీద సమస్యకి ఓ పరిష్కారం ఆలోచించగానే నిద్రముంచు కొచ్చింది. నిద్రపోయాడు.

ఓ గంటైనా నిద్రపోయాడో లేదో టక్కున మెళకువ వచ్చింది. జగదీష్‌కి అలా ఎప్పుడూ మెళకువరాదు.

కాస్తగట్టిగా అమ్మానాన్నల బెడ్ రూమ్‌లో నుంచి మాటలు వినిపిస్తున్నాయి.

అమ్మ గట్టిగా అరుస్తోంది.

నాన్న మందలిస్తున్న ధోరణిలో- "నిర్మలా ... అబ్బాయి విన్నాడంటే బాగుండదు. గోడలకి చెవులుంటాయి. నామాట విను. ఈ రహస్యం ఇంతకాలం ఎందుకు దాచాము చెప్పు'' అని అనునయిస్తున్నాడు.

జగదీష్‌లో ఉత్సుకత పెరిగింది. ఏ రహస్యం అబ్బా! తనకి తెలియని రహస్యాలా ఈ ఇంట్లో? మెల్లగా లేచాడు.

మెల్లగా తలుపు తెరచి బయటి హాలులోకి వచ్చాడు. హాలుని ఆనుకునే వాళ్ళ బెడ్ రూమ్. గది తలుపులు మూసేవున్నాయి.

అక్కడే ఆ చీకటిలో నుంచుండిపోయాడు. లోపలినుంచి మాటలు స్పష్టంగా వినిపిస్తున్నాయి.

"మీరు అప్పుడూ ఇలాగే బలవంతంచేసి

మీ ఇష్టానుసారం నాచేత ఆ తప్పు చెయించారు. నిజంగా వాడు మీ కొడుకే అయితే మీ రక్తం పంచుకుని పుట్టిన వాడైతే ఇలాగ చేసే వాడా? విత్తనమొకటైతే మొక్కొకటౌతుందా? ఏ కులహీనుడి రక్తమో ఏమో'' అని ఏడుపు మొదలుపెట్టింది.

''నిర్మలా ... ప్లీజ్ అబ్బాయి వింటే ప్రమాదం. ఆ సంగతిని ఓ పీడకలలా మరిచిపోయాం గదా! మళ్ళీ ఇప్పుడెందుకు జ్ఞాపకం తెచ్చుకుంటావు. మన ఒట్టు సంగతి మరిచిపోయావా?''

''నాకు ఏఒట్టూగిట్టూ జ్ఞాపకం లేదు. రేపు వాడు నామాట విని ఆ అమ్మాయిని మరిచిపోతే సరేసరి. లేకపోతే వాడి ఎదుటే వాడిజన్మ రహస్యం చెప్పి బాగా తిడతాను. ఇంతకాలం అమ్మ ప్రేమే చూశాడు. ఇప్పుడు అమ్మ కోపం ఏమిటో చూస్తాడు'' అంటోంది.

''అయితే విను నిర్మలా వాడి ఎదుట నువ్వా రహస్యం చెబితే వాడు మనకికదక్కడు. వాడికేంఖర్మ రెక్కలొచ్చినవాడు. ఉద్యోగం చేసుకుంటున్నాడు. పట్టుదలగలవాడు. పెళ్ళి చేసుకుని ఎటో ఎగిరిపోతాడు. వాడు పోతే నేను బతకలేను నిర్మలా! నేనుకూడా నీకుదక్కనని గుర్తుంచుకో''

తండ్రి గొంతు పూడుకపోవడం చూసి ఏడుస్తున్నట్లు గ్రహించాడు జగదీష్.

అలా చాలాసేపు జగదీష్ స్థాణువులాగా నుంచుండిపోయాడు. తను చలపతిరావు కొడుకుకాడా! ఏమిటి తన జన్మరహస్యం. ఛీ ... తనదెంత నికృష్టమైన పుట్టుక. తల్లినోటనే అలా విని కూడా బతికే వున్నాడు. ఆ రహస్యం ఎలా తెలుసుకోవాలి.

జీవితం మీద విరక్తి కలిగింది. తన జన్మ నిజంగానే అంతహేయమైనదైతే బతుకుని చాలించాలి అని నిశ్చయించుకున్నాడు.

మెల్లగా తన గదిలోకి వెళ్ళి పడుకున్నాడు. నిద్రరాలేదు. అటూఇటూ పొర్లాడు. జీవితానికి కావలసింది శాంతి. అది లేనివాడికి నిద్ర రాదు. ఆకలి వుండదు. అన్నిటిమీదా ఆసక్తి నశిస్తుంది.

[illegible]
తల్లిమాటలు చెవుల్లో రింగుమనసాగాయి. ఇటువంటి పరిస్థితుల్లోనే మనుషులు ఆత్మహత్య చేసుకుంటారేమో అనిపించి– సులువైన ఆత్మహత్యా పద్ధతులకోసం ఆలోచించాడు.

అంతలోనే– ఛీ... ఏమిటి తను ఇలా ఆలోచిస్తున్నాడు– అనుకుని ఆ ఆలోచనలను అదుపుచేసుకున్నాడు. ఈ ఇంట్లో బతకలేక పోతే మరోచోట బతకలేడా! దేశం గొడ్డుపోయిందా?

ఈ ఊళ్ళో ఉంటే ఈ వాసనలు వదలవు– అనుకుని వెంటనే ఓ నిశ్చయానికి వచ్చేశాడు.

★ ★ ★

తూర్పుదిశ తెల్లబారింది. ఉషస్సు తట్టిలేపినట్లు మేలుకుని పక్షులు కిలకిలారావాలు మొదలుపెట్టాయి. పక్షులతోబాటు మేలుకునే అలవాటుగల చలపతిరావు కూడా వేకువనే లేచాడు. రాత్రి జరిగిన రభస మళ్ళీ మదిలో బుసకొట్టింది.

అంతరంగంలో అశాంతి తరంగాలు మొదలయ్యాయి. నిరంతర సాధనతో ఓ జీవిత కాలం శృతిచేసిన అతని హృదయవీణ తీగతెగినట్లు అపశృతి పలుకుతోంది. హృదయ భారంతో మెల్లగా మంచంమీదనుంచి లేచాడు.

ఎంత దురదృష్టం. జగదీష్ ఆ అమ్మాయినే ప్రేమించాలా. అంతా ఖర్మ. ఏనాడో మరిచిపోయిన జగదీష్ జన్మం గురించి మళ్ళీ నిర్మల కెలికింది. ఇప్పుడేం చెయ్యడం? తల్లీకొడుకులనెలా సఖ్యతకి తీసుకురావాలో అర్థంకాలేదు. కొన్ని విషయాలలో నిర్మల మొండితనం, ఒక నిర్ణయం తీసుకున్న తరువాత వెనక్కి తగ్గని కొడుకు దీక్ష చలపతిరావుకి బాగానే తెలుసును.

మనస్సు బాగాలేనప్పుడు కాంపౌండులోని పిచ్చిమొక్కలని కలుపు తియ్యడం, పూలమొక్కలకి పాదులుచేసి నీరుపొయ్యడం చేస్తాడు.

అలాగే కింది గార్డెన్‌లోకి అలవాటు ప్రకారం డాబామీదినుంచి వంగి చూశాడు. తరువాత మెట్లు దిగాడు.

ప్రకృతి ఆహ్లాదకరంగా వుంది. పక్షులప్పుడే గూళ్ళు విడిచిపెడుతున్నాయి. ఎవరెలాపోయినా సృష్టి సాగుతూనే వుంటుంది. అదే




# కొత్త సెరిలాక్ ఆరంజ్




## మీ పాపాయికి సెరిలాక్ లాభాన్ని అందించడానికి మరొక మార్గం

మీ పాపాయికి మరొక లాభాన్ని అందజేసేందుకు యిదిగో కొత్త సెరిలాక్ ఆరంజ్. మీ పాపాయి కొత్త రుచులను అలవరుచుకున్నప్పుడు, అతని ఆహారంలో మరింత వైవిధ్యం తెచ్చే లాభం. దీనితోబాటు నారింజ మంచితనం కూడా లభిస్తుంది.
మీరు మీ పాపాయికి సెరిలాక్ ఆరంజ్ యిస్తున్నారంటే, అతనికి సెరిలాక్ లాభాలన్నింటినీ యిస్తూనే ఉన్నారన్న మాట–ప్రతీ సారి తినిపించినప్పుడు పరిపూర్ణమైన పోషక శక్తి, చక్కటి రుచి, క్షణాలలో తయారు కావడం.
కాబట్టి, పాలు త్రాగించడంతోబాటు, 4 నెలల నుంచి అతనికి సెరిలాక్ వీట్, 6 నెలల నుంచి సెరిలాక్ ఆపిల్/క్రొత్త సెరిలాక్ ఆరంజ్ యివ్వండి–మీ పాపాయికి సెరిలాక్ లాభాన్ని అందజేసేందుకు రుచి కరమైన మూడు మార్గాలు.
పరిశుభ్రంగా తయారు చేయడానికి, మీ పాపాయికి సమతూకంలో పోషకాహారం సమకూర్చేందుకూగాను, దయచేసి డబ్బా మీద ఉన్న సూచనలు జాగ్రత్తగా అనుసరించండి.






Nestlé

R K SWAMY/FSL/4974-TEL

లోకం పోకడ— అనుకుంటూ పనిలో మునిగిపోయాడు.

తర్వాత నిత్యకృత్యాలు పూర్తిచేశాడు. రోజూలా స్నానం పూర్తిచేసుకుని వచ్చేసరికి భార్య వేడివేడిగా కాఫీ కలుపుకు వచ్చి ఇచ్చేది. ఇవాళ అందలేదు. పడకగదిలోకి తొంగిచూశాడు. నిర్మల ఇంకా నిద్రనటిస్తూనే వుంది. ఏం చెయ్యాలో తోచలేదు.

అబ్బాయి గదివేపు చూశాడు. తలుపు మూసేవుంది. వాడూలేవలేదు. రెండు గదులమధ్యా కాలుకాలిన పిల్లిలాగ కాసేపు తిరిగాడు. కొడుకు జగదీష్ ఆరుగంటలు కొట్టేసరికి ఆదివారమైనా సరే లేచే అలవాటు తననుంచే నేర్చుకున్నాడు. డబ్బు పోయినా తిరిగి సంపాదించుకోగలం, పోయిన టైముని మళ్ళీ సంపాదించలేం. కాలం ఎంతో విలువైనది. అన్నిటికన్నా విలువైనది అని నూరిపోశాడు తను. ఆ టైమ్‌సెన్సు డెవలప్ కావడం చేతనే ఈ మాత్రమైనా పైకి వచ్చాడు. తన కాళ్ళమీద తాను నిలబడగలిగాడు.

మరోమారు గదిలోనుంచి శబ్దాలు వినవస్తాయేమోనని చెవులకి పని కల్పించాడు.

ఇంకాలేవలేదు. వాడిమనసెంత కుమిలిపోతున్నదో!

ఇంతలో కింద సైకిల్‌బెల్ వినిపించింది. ఉదయాన్నే మెట్లగది తలుపు దగ్గర కుర్రవాడు పేపరు పడేస్తాడు. మెట్లగది తలుపు దగ్గరికి వెళ్ళాడు. తెరిచేవుంది. రాత్రి జరిగిన గొడవలో తలుపు వేయడం మరిచిపోయాననుకుంటూ పేపరు తీసుకున్నాడు. హాలులోకి వచ్చి సోఫామీద కూర్చుని హెడ్‌లైన్సు చూశాడు. న్యూసేదీ తలకెక్కలేదు.

పేపరు టీపాయ్‌మీద పడేశాడు.

చూస్తూ వుండగానే ఎనిమిది గంటలయింది. గోడమీద గడియారం నిశ్శబ్దాన్ని భగ్నం చేస్తూ టంగ్‌టంగ్‌మని ఎనిమిది గంటలుకొట్టింది.

అబ్బాయి మరో గంటలో తయారై ఆఫీసుకి వెళ్ళిపోవాలి. కాని చలపతిరావు నిద్రపోతున్న వారిని లేపడు.

భౌతిక ప్రపంచాన్ని తాత్కాలికంగా మరిపించి ఏవో మంత్రసరిహద్దులను దాటించి మరో లోకంలోకి తీసుకుని వెళ్ళేది నిద్ర. నిద్రపట్టడమే ఓ అదృష్టం.

ఈ లోకంలో దుఃఖం తప్ప మరేముంది. అందుకే లేపడం ఇష్టం వుండదు. కాని ఈరోజు తప్పేలాగాలేదు.

"జగ్గూ!" అని పిలిచాడు.

సమాధానంలేదు.

మెలకువరాలేదు కాబోలునని తలుపు దగ్గరికి వెళ్ళాడు.

తలుపుమీద కొట్టి "ఒరే జగ్గూ..." అని మరింత గట్టిగా పిలిచాడు. తలుపుమీద చెయ్యి వెయ్యగానే దానికదే తెరుచుకుంది.

మంచంమీద జగదీష్ లేడు.

గది అంతా పరిశీలించాడు. తను పేపరు కోసం వెళ్ళినప్పుడుగాని బాత్‌రూమ్‌లోకి వెళ్ళలేదుగదా!

టేబుల్‌మీద పేపర్‌వెయిట్ కింద ఓ తెల్లకాగితం కిటికీలోనుంచి వచ్చే ప్రత్యూష పవనాలకి రెపరెపలాడుతూ కనిపించింది.

గుండె లయతప్పినట్లయింది.

మనస్సు ఏదో కీడుని శంకించింది.

గబగబా వెళ్ళి పేపరు చేతిలోకి తీసుకున్నాడు. అక్షరాలవెంట కళ్ళు పరుగులు తీశాయి.

ప్రియమైన చలపతిరావుగారికి,

చెప్పాపెట్టకుండా మిమ్మల్ని విడిచిపెట్టి వెళ్ళిపోతున్నందుకు క్షమించండి. ఈ నికృష్టుడికోసం మీరు ఎన్నో చేశారు. మీ రుణం తీర్చుకునే అదృష్టం నాకులేదు. ఈ విశ్వాసఘాతకుణ్ని క్షమించి మరచిపొండి. నాకోసం వెతికే ప్రయత్నం చెయ్యకండి.

ఇట్లు

జగదీష్"

ఉత్తరంలో జగదీష్ తండ్రిని సంబోధించిన తీరుకి అతడు విచలితుడయ్యాడు. "చలపతిరావుగారికి' అనే సంబోధన మనస్సులో మాటిమాటికీ గొడ్డలిపెట్టులాగ బాధించసాగింది.

అంతలాగ మనస్సు విరక్తి చేసుకున్నాడా? ఆ అమ్మాయిని అంతలాగ ప్రేమిస్తే పెళ్ళికి తను కాదంటాడా? ఇంతేనా వీడు తనని అర్థం చేసుకున్నది. ఎలాగైనా నిర్మలని ఒప్పించి ఈ




పెళ్ళిని ఆదర్శంగా జరిపించాలనే అనుకున్నాడు. ఎలా జరిగిందిది.

పెళ్ళికి ఒప్పుకోలేదని ఇల్లువదిలి వెళ్ళిపోతారా ఎవరైనా? అందులో తన పెంపకంలో ఓ వ్యక్తిగా పెరిగిన జగదీష్?

ఏదో పొరపాటు జరిగింది... జగదీష్ తప్పకుండా వస్తాడు.

సమతని రిజిష్టరు పెళ్ళిచేసుకున్నైనా ఇంటికి వస్తాడనిపించింది. అమ్మని ఒప్పించడం కష్టం, పెళ్ళి అయిపోతే ఇంక ఏమీ చెయ్యలేదని ఊహించుకుని ఉంటాడని సరిపెట్టుకున్నాడు.

అప్పుడే భార్య నిర్మల జ్ఞాపకం వచ్చింది. నిద్రపోతున్నట్లు నటిస్తూ కొడుకు వచ్చి బతిమాలుతాడని ఎదురుచూస్తున్నది. జగదీష్ అలిగి ఇల్లు విడిచి వెళ్ళిపోయాడని తెలిస్తే ఏం చేస్తుందో!

వాళ్ళ బెడ్‌రూమ్‌లోకి వెళ్ళి నిద్రపోతున్న భార్యని తట్టిలేపాడు.

"నిర్మలా... అబ్బాయిలేడు. ఇల్లువిడిచిపెట్టి మనమీద కోపంతో ఎటో వెళ్ళిపోయాడు. ఇదుగో ఈ ఉత్తరం రాసి మరీ వెళ్ళిపోయాడు" అని కంగారుపడుతూ చెప్పాడు.

నిర్మల షాక్‌కి తట్టుకోగలగుతుందో లేదోననే భయం.

నిర్మల ఉలిక్కిపడిలేచింది.

ఆ ఉత్తరాన్ని చలపతిరావు చేతిలోనుంచి లాక్కుని పక్కనే తలగడ కిందనున్న కళ్ళజోడు పెట్టుకుని చదివింది.

"ఇలా నన్ను భయపెడదామనుకున్నాడులాగుంది. నేను ఇలాంటి బెదిరింపులకి లొంగే దాన్నికాదు" అంది.

చలపతిరావు భార్యమనస్తత్వాన్ని కొత్తగా చదవసాగాడు. ఈమె తనతో ఇన్నాళ్ళూ కాపురం చేసిన నిర్మలేనా! కొడుకు ఇల్లు విడిచి పెట్టిపోయాడనే బెంగ అసలేలేదేం. జగదీష్‌ని ఇంతేనా ఈమె అర్థం చేసుకున్నది.

ఎంత మంచి స్త్రీ అయినా ఇంతేనా!

తల్లిస్థానంనుంచి అత్తస్థానంలోకి మారగానే ఎందుకీ మార్పు. కొడుకు మనస్ఫూర్తిగా ప్రేమించిన అమ్మాయిని పెళ్ళి చేసుకుంటే ఇంక తల్లిదండ్రులను లెక్కచెయ్యడనా! ఏమో!!

రిజిష్టరు పెళ్ళి చేసుకుని వస్తే ఏంచేస్తుందో!!!

ఆ విషయమే అడిగాడు

నిర్మలా నువ్వు చాలా మారాలి. జగదీష్ రిజిష్టరుపెళ్ళి చేసుకుని ఆ అమ్మాయిని తీసుకొస్తే ఏం చేస్తావు!

ఉగ్రకాళిలాగ లేచింది.

"ఎక్కడికొస్తాడు. మన ఇంట్లోకా గమ్మనండి. ఈ గడప తొక్కమనండి తెలుస్తుంది" అంది.

"ఏం చేస్తావు?" మళ్ళీ ప్రశ్నించాడు.

"ఏంచేస్తానా... ఇంట్లోకి రానివ్వను అంటాను. నువ్వు మా కొడుకువి కావు పొమ్మంటాను" అని కోపంగా అంది. ముఖం కోపంతో కందిపోయింది. కళ్ళు ఎర్రగా నిప్పుకణికల్లా వున్నాయి.

"అహా... అలా నువ్వు పొమ్మంటే వాడు భయపడిపోతాడా. వాడికేం మహారాజు. రెక్కలొచ్చినవాడు. ఎక్కడో వేరే కాపురం పెట్టుకుంటారు. ఇద్దరూ ఉద్యోగస్తులే. మనమే వృద్ధాప్యంలో నానా తిప్పలూపడాలి" అని బెదరిస్తున్నట్టు అన్నాడు.

నిర్మలకు మరింత కోపం వచ్చింది.

"అందుకని వాడిష్టమొచ్చినట్టు ఏంచేసినా ఊరుకోవాలా? వాడికీ వాడి పెళ్ళానికీ నివాళులిచ్చి అడుగులకి మడుగులొత్తాలా, నాతరంకాదు. మీరూ, మీకొడుకూ ఎప్పుడూ ఒక్కటే. నేనే ఎప్పుడూ వేరు" అని బావురుమని ఏడుపు లంకించుకుంది.

ముత్యాలలాంటి కన్నీళ్ళు జల జలా కళ్ళలోనుంచి కారిపోయాయి.

చలపతిరావు బాధపడ్డాడు. నిర్మలకి కొడుకంటే ఎంత ప్రేమో తెలుసును. కనీసం ఆమె రక్తం పంచుకుని పుట్టాడు. తనది తండ్రిస్థానంలో వుండి పెంచిన ప్రేమ మాత్రమే. అయినా తనెంత బాధపడ్డాడు. మరి నిర్మలకెంత వుండాలి. మాట పెరిగితే మరింత బాధపడుతుందనుకున్నాడు.

భార్యని సముదాయించాలనే నిర్ణయానికి వచ్చేశాడు.



''నిర్మలా... ఊరికే నీ అభిప్రాయం తెలుసుకుందామని అన్నానేగాని నాకు మాత్రం వాడలాగ చెయ్యడం ఇష్టమా! ఆ అమ్మాయి నాకేమైనా చుట్టమా. నువ్వూరుకో వాడు ఎలాగూ ఏదోఒకరోజు రాకమానడు. మనల్ని బెదిరించడానికే ఇలాగ చేసిఉంటాడు. వాడి మొహం! నేనన్నట్లు ఆ అమ్మాయిని మన ప్రమేయంలేకుండా రిజిష్టరు పెళ్ళి చేసుకునే బుద్ధిహీనుడుకాడు మనవాడు. రానియ్... మనమిద్దరం ఒక్కమాటమీద ఉండి వాడిపనిపడదాం'' అన్నాడు.

నిర్మలకి కొండంతబలం వచ్చింది. కన్నీళ్ళు తుడుచుకుంటున్నా మళ్ళీ మళ్ళీ తెరలు తెరలుగా దుఃఖం పెల్లుబికిరాగా చలపతిరావు గుండెలమీదపడి ఏడ్చేసింది. చలపతిరావు ఆమెతల వీపు నిమిరి సముదాయించాడు.

''లే... కాస్త కాఫీపెట్టు. నేను సెక్రటేరియట్‌కి వెళతాను. వాడు లీవ్‌పెట్టకుండా డ్యూటీ మానడు. లీవ్ శాంక్షను చేయించుకోవడానికి పది గంటలకల్లా వస్తాడు. వాడిని పట్టుకుంటాను. నా దగ్గరవాడి ఆటలు సాగవని నీకు తెలుసునుగదా'' అని ధైర్యం చెప్పాడు.

నిర్మల బాత్‌రూమ్‌లోకి వెళ్ళిపోయింది.

నిత్యకృత్యాలు తీర్చుకుని వంటగదిలోకి వెళ్ళింది. గాస్ స్టౌ వెలిగించి రెండుకప్పుల కాఫీ తీసుకువచ్చిది.

ఇద్దరూ తాగారు.

''ఏమండీ... మీరన్నట్లు మనవాడంతపని చేస్తాడంటారా?'' అని భయపడుతూ అడిగింది.

'నేరకపోయి అన్నాను. ఇంక ఆ రిజిష్టరుపెళ్ళిని గురించి ఆలోచిస్తూ మనస్సు పాడుచేసుకుంటుంది' అనుకున్నాడు.

''నీమొహం... ఊరికే అన్నానని చెప్పానుగా! రిజిష్టరు పెళ్ళంటే జనం అనుకుంటున్నంత తేలికగా జరిగిపోదు. మూడు నెలలు ముందుగా పెళ్ళి చేసుకోదలచుకున్న ఇద్దరూ పెళ్ళిళ్ల రిజిష్ట్రారుకి అప్లికేషను పెట్టుకోవాలి ఆ తరువాత వాళ్ళిచ్చిన డేటుకి వాళ్ళు మనస్సులు ఆలోగా మార్చుకోకపోతే ఆ డేటున జరుగుతుంది. సాక్షులుగా తల్లిదండ్రులూ, బంధువర్గమూ వుంటే మంచిది అని రిజిష్ట్రారు సూచిస్తాడు కూడాను. నీకా భయం అక్కరలేదు'' అని ఆమె భయం పోగొట్టాడు.

భార్యని సముదాయించడానికి అలాగ అన్నాడేగాని జగదీష్‌ని తక్కువగా అంచనా వెయ్యలేదు చలపతిరావు. తలచుకోవాలేగాని ఏ పనినైనా ధైర్యంగా తన కొడుకు చెయ్యగలడని తెలుసును.

నిర్మలకి బాధ కలిగించేపని జగదీష్ చెయ్యకుండా చూడమని ఆ భగవంతుణ్ని మనస్సులోనే ప్రార్థించుకున్నాడు.

చలపతిరావుకి రాత్రి నిర్మలకు, అతనికీ జరిగిన సంఘర్షణ జగదీష్ విన్నాడని తెలియదు. ఆ విషయం గనక ఊహించి వుంటే మరోవిధంగా ఆలోచించేవాడు. మరింత తీవ్రంగా కొడుకుకోసం వలవేసి గాలించేవాడు. వాళ్ళమ్మని భయపెట్టడానికే అలాగ రాశాడుగాని లేకపోతే అలాగ రాయడని ఆరోజు సాయంత్రానికి ఇంటికి వచ్చేస్తాడని నమ్మాడు.

వాళ్ళ ఆఫీసుకి వెళ్ళి మందలించి తీసుకువద్దామని నిర్ణయించుకున్నాడు. పది గంటలకి సెక్రటేరియట్‌కి వెళ్ళాడు.

కాని చలపతిరావు ఊహించినట్లు జగదీష్ సెలవు గ్రాంట్ చేయించుకోవడానికి రాలేదు. ఎక్కడినుంచో లీవ్‌లెటర్ పోస్ట్ చేస్తాడని అర్థం చేసుకున్నాడు.

చలపతిరావు మొదటిసారిగా షాక్ తిన్నాడు. విషయం కాస్త సీరియస్‌గానే అనిపించింది. అంత చిన్న విషయాన్ని ఇంత సీరియస్‌గా తీసుకోడే?

ఏమైందో అర్థంకాలేదు.

సాయంత్రందాకా చూసి మరునాటి ఉదయం వెతికేపని మొదలు పెడదామనుకున్నాడు.

సాయంత్రం కాదుగదా మరునాటి ఉదయం తెల్లవారినా జగదీష్ అయిపులేదు.

ఇది చలపతిరావు ఊహించనిరీతిలో జరిగిన పరిణామం. 24 గంటలు దాటిపోయాయి. అయినా రాలేదు అంటే మరో నాలుగురోజులైనా వస్తాడనే నమ్మకం లేకుండాపోయింది. ఆలోచించిఆలోచించి మనస్సు పాడు




చేసుకున్నాడు.

బుర్ర వేడెక్కిపోయిందిగాని ఫలితం లేకపో యింది.

నిర్మల కొడుకు ఊసు ఎత్తలేదు. భర్త చల పతి ఆరాటాన్ని చూస్తూ ఊరుకుంది.

★ ★ ★

తూర్పు తెల్లవారింది.

జగదీష్ సికింద్రాబాద్ స్టేషన్‌కు అటు వచ్చిన మొదటి బస్సులోనే చేరుకున్నాడు.

రెండు జతలు బట్టలు, లుంగీ, ఒక టవల్, టూత్‌బ్రష్, పేస్టు, షేవింగ్‌సెట్, సబ్బుబిళ్ల బ్రీఫ్‌కేసులో వేసుకొని ఇంట్లోనుంచి బయలుదే రాడు.

అతని గమ్యం ఏమిటో అతనికే తెలియదు.



జేబులో నుంచి పర్సు తీసి చూశాడు. దాదాపు పదిహేనువందలున్నాయి. జీతం వారం రోజుల క్రితమే అందినా టైము కుదరక బేంకులో వెయ్యలేదు. ఖర్చయింది ఖర్చవగా మిగిలింది పర్సులోనే వుంది. డబ్బు అలా జేబులో ఉండటమే మెరుగైంది అనుకున్నాడు.

గతం జ్ఞాపకం వచ్చింది.

ఆరోజు తనకి మొదటిజీతం అందినరోజు అమ్మకోచీరా, నాన్నగారికి ధోవతీ కొన్నాడు. స్వీట్సు కొని పట్టుకు వెళ్ళాడు.

హాలులో నాన్న పేపరు చదువుకుంటున్నారు.

''నాన్నా'' ఎంతో సంతోషంగా పిలిచాడు.

నాన్న తనవేపు చూశారు. ఆ కళ్ళలో ఆనంద జ్యోతులు. చేతిలో పేకెట్లు చూసి విషయం గ్రహించారని ఆ కళ్ళు చెప్పాయి.

నిజానికి ఆరోజుల్లో ఆర్థికంగా కాస్తటైట్‌గానే ఉంది. ఉన్న డబ్బంతా ఇంటిమీద పెట్టేశారు.

మిగిలిన డబ్బుని నాన్నగారి చేతిలోపెట్టాలనే కోరిక.

అమ్మని పిలిచారాయన.

''చూడవే అబ్బాయొచ్చాడు. మనకేవో కానుకలు తెచ్చాడే'' అని నవ్వుతూ అన్నారు.

అమ్మ గబగబా వంటగదిలోనుంచి వచ్చింది. ఎంత సంతోషించింది.

వెంటనే లోపలికెళ్లి కాఫీ చేసి తెచ్చింది.

చీర, ధోవతి పేకెట్లు వాళ్ళ చేతుల్లో పెట్టి పాదాలకి నమస్కారం చేశాడు.

ఎప్పుడూ కన్నీరు ఎరగని నాన్న కళ్ళలో ఆనంద భాష్పాలు.

గుండెలకి హత్తుకున్నారు.

తనకి తెలియకుండానే కన్నీళ్ళు తిరిగాయి.

''ఇదిగోండి నాన్నా, మిగిలిన డబ్బు'' నాన్నకి ఇవ్వబోయాడు.

''జగ్గూ! వద్దురా... ఈరోజే నువ్వు నీ పేరున బేంకులో ఎకౌంట్ తెరుచుకో. నేను నిన్ను డబ్బు లెక్కడగను. ఎంత కూడబెట్టుకుంటావో లేక ఖర్చే చేసుకుంటావో నీఇష్టం'' అన్నారు.

తనకి ఎంతో బాధవేసింది. ముఖం చిన్నబోయింది. ఆనందం ఆవిరిలా ఎగిరిపోయింది.

''నేను సంపాదిస్తున్నది నాకోసమేనా? అయితే నేను ఉద్యోగం చెయ్యను రేపే రిజైన్ చేసేస్తాను'' అన్నాడు తను కోపంగా.

''అలా కాదురా... నా పెన్షన్, ఇంటి అద్దెలు మన ఇల్లు గడవడానికి సరిపోతుంది. నువ్వూ నాకేఇస్తే అదీ ఖర్చే. నువ్వేనాపొదుపు చేస్తే ఏ అవసరానికైనా పనికొస్తుంది. నీ డబ్బుఒకటీ నా డబ్బు ఒకటీనా. నేను చెప్పినట్లు చెయ్యి'' అన్నారు.

నాన్నగారు చెప్పింది శాసనమే.

అలాగే చేశాడు. ఇంట్లోకి కావలసిన కూరగాయలు, పళ్ళు తీసుకుని ఫ్రిజ్ నింపడమేగాని డబ్బు తల్లిదండ్రులకు ఇవ్వలేకపోయాడు.

బేంకు బేలన్సు బాగానే పెరిగింది.

నాన్నని తల చుకోగానే జగదీష్‌కి కళ్ళు నిండుకున్నాయి. ఇంతా చేస్తే తను అతని కొడుకేకాడు. తనది నిజంగానే అక్రమమైన పుట్టుకా?

భగవాన్, ఏమిటీ శిక్ష. తల్లినోటనే ''ఏ కుల హీనుడి రక్తమో ఏమో'' అని విన్నవాడు మరొకడు ఉంటాడా, తను తప్ప.

ఇరవైనాలుగు గంటల క్రితం బతుకులో వెన్నెల విరిసినట్లయింది. జీవితం పూలపానుపులాగా అనిపించింది. సమతతో సంసార జీవితం ఆలోచించుకుని బంగారు కలలు కన్నాడు.

ఇప్పుడు-

సమత, వివాహం, చివరికి బతుకే ు న ర్థకం అనిపిస్తున్నాయి.

పర్సు జేబులో పెట్టుకున్నాడు.

ఎంత త్వరగా వీలైతే అంత త్వరగా జంట నగరాలకి దూరంగా పారిపోవాలనుకున్నాడు.

కృష్ణా ఎక్స్‌ప్రెస్ రెడీగా ఉంది.

సికిందరాబాదు స్టేషనులోనే ముఖం అదీ కడుక్కుని కేంటీన్‌లో టిఫిన్ చేసి కాఫీ తాగాడు.

విజయవాడకి టిక్కెట్టుకొని బండెక్కాడు బండి కదిలింది. సీటులో కూర్చుని భవిష్యత్తు ఆలోచించసాగాడు.




చల్లనిగాలి రివ్వున వీస్తూ ముఖానికి తగులుతూంది. ఇలాంటప్పుడే సలహాచెప్పగల ఆత్మీయుడి అవసరం ఎంతో ఉంది. జీవిత భాగస్వామినిగా చేసుకోవాలనుకున్న సమత చక్కని ఆలోచనా శక్తి గలదే. కాని ఈ పరిస్థితుల్లో నిస్సహాయుడిగా ఆమెని సలహా అడగలేడు.

ఏ ప్రాణమిత్రుడి సహాయమో కావాలి, అతని సలహా అర్థించాలి.

శ్రీనివాస్ మదిలో మెదిలాడు.

అవును, శ్రీనివాస్ తనకన్నా అన్నివిధాలా తెలివైనవాడు. శ్రేయోభిలాషి. అతనిమీద తనకి గురివుంది. అతని సలహా పాటించాలి అనుకున్నాడు.

శ్రీనివాస్ ఇంటర్‌దాకా తనతోనే చదివాడు. తరవాత బి.ఇ. ఎలక్ట్రికల్ ఇంజినీరింగు పాసై విశాఖపట్నం పోర్టు ట్రస్టులో పనిచేస్తున్నాడు. ఎన్నోమార్లు విశాఖపట్నం రమ్మని బలవంతం చేశాడు. తాను ఎవరికైనా ఉత్తరాలు రాస్తాడూ అంటే అతనికే.

అంతే! విశాఖపట్నం వెళ్ళాలనుకున్నాడు.

విజయవాడలో మధ్యాహ్నం భోజనం చేసి సాయంత్ర దాకా గడిపి రాత్రి గోదావరి పట్టుకోవాలని నిశ్చయించుకున్నాడు.




ఉదయం తొమ్మిదిగంటలకి గోదావరి వాల్తేరు చేరుకుంది. పడుకోవడానికి బెర్తు సంపాదించుకోగలిగాడు గనుక రాత్రి ట్రైనులో బాగానే నిద్రపోయాడు. యలమంచలి స్టేషనులోనే మెలకువ వచ్చింది. కంపార్టుమెంటులోనే పళ్ళు తోముకుని సబ్బుతో శుభ్రంగా ముఖం కడుక్కున్నాడు.

ఫ్రెష్‌గా ట్రైన్ దిగాడు. బ్రీఫ్‌కేసు పట్టుకుని స్టేషను బయటికి వచ్చాడు. జగదీష్‌కి శ్రీనివాస్ అడ్రసు కంఠస్తమే.

ఆటో కట్టించుకుని సులువుగానే వాళ్ళ ఇల్లు చేరుకున్నాడు.

ఇంటి ముందు పెద్ద ఆవరణ. పూలమొక్కలున్నాయి. పెద్దఇల్లు. జగదీష్‌కి శ్రీనివాసు వాళ్ళింటిలోని అందరితో పరిచయమే. కాకపోతే వాళ్ళ శ్రీమతితో అంత పరిచయం లేదు. పెళ్ళిలో చూడటమే.

గేటు చప్పుడుకి శ్రీనివాస్ అమ్మగారు బయటికి వచ్చింది. జగదీష్‌ని తలవని తలంపుగా చూడ్డంతో ఆశ్చర్యపోయింది.

"జగదీష్ బాబూ... ఇంతకాలానికి మీ స్నేహితుడు జ్ఞాపకం వచ్చాడన్నమాట" అని పలకరిస్తూ ఆహ్వానించింది.

జగదీష్ లోనికి అడుగుపెట్టాడు.

పెద్ద వరండా. గ్రిల్స్‌తో మూసివుంది. పది మంచాలైనా పడతాయి.

వరండా దాటి మరో గదిలోకి ఆమె వెంట ప్రవేశించాడు.

పెద్ద హాలు.

రెండు సోఫా సెట్లు. మధ్యలో టీపాయ్.

ఒక మూలగా టి.వి. సెట్.

గోడకి ఓ వారని ఫ్రిజ్ ఉన్నాయి.

ఇల్లు చూడడానికి పాతదానిలాగ కనిపిస్తున్నా అన్ని సౌకర్యాలున్నాయి.

హాలుకి కుడివేపున ఒక బెడ్‌రూమ్. ఎడమవేపున మరో బెడ్‌రూమ్. ఆ హాలుని ఆనుకునే కిచెన్ స్టోర్‌రూమ్ కూడా వున్నాయి.

శ్రీనివాస్ భార్యకి వచ్చిన వారెవరో శ్రీనివాస్ తల్లి వివరించినట్లుంది. ఆమె కిచెన్‌లోనుంచి బయటికి వచ్చి-

"నమస్కారం అండీ. ఆయన మీగురించే ఎప్పుడూ చెపుతూవుంటారు. మీరు వస్తున్నట్లు ముందుగానే రాస్తే రిసీవ్ చేసుకోవడానికి స్టేషన్‌కి వచ్చేవారు. ఇల్లు కనుక్కోవడానికి ఇబ్బంది పడలేదుగదా" అని ఎంతో కలుపుగోలుగా మాట్లాడింది.

"ఇబ్బందేం పడలేదండి. ఆటో వాడేతి

న్నగా తీసుకువచ్చేశాడు. సడెన్‌గా బయలుదేరాను. అందుకే ఉత్తరం రాయలేదు. టెలిగ్రామ్‌ల మీద నమ్మకం పోయింది. చాలాసార్లు నేనిచ్చిన టెలిగ్రామ్‌లు నేనే అందుకోవడం జరిగింది'' అన్నాడు.

ఎంత సీరియస్‌గా ఉందామనుకున్నా ఆమెకి నవ్వాగలేదు. బాగుండదని వంటగదిలోకి వెళ్ళిపోయింది.

బ్రీఫ్‌కేస్‌ని టీపాయ్‌మీద పెట్టి సోఫాలో కూర్చున్నాడు.

శ్రీనివాస్ భార్య మళ్ళీ బయటకు వచ్చి హాలులోనే టేబులుమీదున్న టెలిఫోన్‌నుని డయల్ చేసింది.

అవతలి నుంచి శ్రీనివాస్ మాట్లాడాడు.

జగదీష్ చేత మాట్లాడించమన్నట్లుంది.

మౌత్ పీస్‌ని కుడి చేత్తో మూసి- ''మిమ్మల్ని మాట్లాడమంటున్నారండీ'' అని పిలిచింది.

జగదీష్ రిసీవర్ అందుకున్నాడు.

''హల్లో... నేనే జగదీష్‌ని''.

''... ...''

''సడెన్‌గా బయలుదేరాను. ముందుగా అనుకోలేదు. ఇబ్బందేమీ అవలేదు. భలేవాడివే... అడ్రసున్నా మీ ఇల్లు కనుక్కోలేని బడుద్దాయిననుకున్నావా?''

''ఆ... ఆ... నువ్వు వచ్చేదాకా కాలం కదల్దు బాబూ! వెంటనే చెప్పి వచ్చెయ్యి... ఆ... ఆ... మరో అర్ధగంటలో ఇక్కడుండి తీరాలి'' అని ఫోను పెట్టేశాడు.

''వేణ్నీళ్ళు పెట్టమంటారా?'' అడిగింది శ్రీనివాస్ భార్య.

''అబ్బే... వద్దండి– చన్నీళ్ళే చేసేస్తాను'' అని బ్రీఫ్‌కేసులోనుంచి టవల్ తీసుకున్నాడు.

అప్పటికే బకెట్‌తో నీళ్ళు, కొత్తగా శుభ్రంగా వున్న టవలు అన్నీ సిద్ధం చేసిందామె.

శ్రీనివాస్ వాళ్ళఇంట్లో కూడా తన టవలునే వాడేవాడు.

శుభ్రంగా స్నానం చేశాక బడలిక తీరినట్లయింది.

లుంగీ కట్టుకుని చొక్కా వేసుకున్నాడు.





ఈలోగా అల్లం, ఉల్లిపాయలు వేసి గబగబా ఉప్మాచేసింది.

స్కూటర్ శబ్దం వినిపించింది. శ్రీనివాస్ వచ్చాడు.

''ఏరా'' అంటే ''ఏరా'' అని ఎంతో ఆప్యాయంగా పలకరించుకున్నారు.

టిఫిను పూర్తిచేశారు.

శ్రీనివాస్ అమ్మ చలపతిరావు గురించీ, నిర్మలాదేవి గురించీ, వాళ్ళ ఆరోగ్యాల గురించీ చాలాచాలా విషయాలు అడిగింది. ఓపికగా సమాధానాలు చెప్పాడు జగదీష్.

''పెళ్ళింకా చేసుకోలేదా? ఇంకా ఎప్పుడు చేసుకుంటావు?'' ప్రశ్నించింది.

ఆ ప్రశ్న జగదీష్‌ని ఇరకాటంలో పెట్టింది. ప్రేమ - పెళ్ళి వ్యవహారంవల్లనే తన జీవితం ఈ మలుపు తిరిగింది. లేకపోతే తన పుట్టుక రహస్యం ఏనాటికీ తెలిసేది కాదేమో?

''చేసుకుంటానత్తా! సరియైన అమ్మాయి దొరకాలిగదా!'' అని సమాధానం చెప్పాడు.

ఆమాట ఈమాటతో మధ్యాహ్నమైంది.

భోజనాలు తిన్నారు.

జగదీష్‌కి ఓ బెడ్‌రూమ్ కేటాయించారు. దాంట్లో కూడా ఓ డబుల్‌కాట్ వుంది.

మంచంమీద పడుకుని దినపత్రిక తిరగవేస్తూనే నిద్రపోయాడు. రాత్రి రైల్లో నిద్రపోయినా మళ్ళీ కళ్ళు మూతలుపడ్డాయి.

సడెన్‌గా మెలకువ వచ్చి వాచీ చూసుకునే సరికి నాలుగు గంటలయింది. అప్పటికే శ్రీనివాస్ మేలుకుని ఏవేవో ఇంట్లో పురమాయిస్తున్నాడు.

జగదీష్ గదిలోకి తొంగిచూశాడు. శ్రీనివాస్ కూడా అప్పుడే బయటికి చూశాడు. ఇద్దరి చూపులు కలుసుకున్నాయి. నవ్వుకున్నారు.

జగదీష్ బాత్‌రూమ్‌కి వెళ్ళి ముఖం కడుక్కున్నాడు.

అతని మనస్సులో ఎన్నో ఆలోచనలు. ఎంత త్వరగా శ్రీనివాస్‌కి జరిగిన సంగతి చెప్పేద్దామా అనే తొందర; ఎంత త్వరగా ఏకాంతానికి సరియైన అవకాశం లభిస్తుందా అనే ఆరాటం.

మళ్ళీ టిఫిన్, టీ కార్యక్రమం పూర్తయింది.

శ్రీనివాస్ అడిగాడు—

"ఏరా ఎక్కడికేనా వెళదామా! ఇంట్లోనే ఈ రోజుకి రెస్టు తీసుకుంటావా?" అడిగాడు.

"ఎటైనా వెళదాం. బీచ్‌కి వెళ్ళి చాలా సంవత్సరాలైంది. తీసుకువెళ్ళు. అక్కడ నీతో చాలా సంగతులు మాట్లాడాలి" అన్నాడు.

"అయితే తయారవ్" అని పురమాయించాడు.

నోటిలోమాట నోటిలో వుండగానే బ్రీఫ్‌కేసులోని బట్టలు తొడుక్కున్నాడు. తల దువ్వుకుని తయారయ్యాడు.

ఇద్దరూ స్కూటరు మీద బయలుదేరారు.

తన కథని ఎలా మొదలుపెట్టాలి, ఎలా చెప్పాలి అని స్కూటర్ వెనకకూర్చుని జగదీష్ ఆలోచించసాగాడు. స్కూటర్ విశాఖ జనసమ్మర్ధమైన వీధుల్లోనుంచి ముందుకి దూసుకుపోసాగింది.

★ ★ ★

బీచ్‌రోడ్డుమీద కొత్తగా ఓ పార్కు వెలిసింది. జగదీష్ వైజాగ్ వచ్చి బీచ్ చూసి చాలా ఏళ్ళయింది. అప్పుడా పార్కులేదు. స్కూటర్ని పార్కింగుకి నిర్దేశించబడిన స్థలంలో నిలబెట్టాడు శ్రీనివాస్.

"ఇదే వుడా పార్కు. రా లోనికి వెళదాం" అని లోనికి నడిచాడు.

జగదీష్‌కి చాలా హాయి అనిపించింది. విశాఖపట్నం హనుమంతుడి తోకలాగా పెరిగిపోతున్నది. కొత్తగా వెలిసిన కాలనీలు, భవనాలు చూస్తుంటే మరో దశాబ్దం నాటికి జంటనగరాలు రెండో స్థానానికి దిగిపోతాయేమో అనిపించింది.

పరిశుభ్రమైన రోడ్లు, ఆహ్లాదకరమైన బీచ్, బంగాళాఖాతం. దూరంగా కుడివేపున యారాడకొండ కనిపిస్తూంది. సముద్రంలో కనుచూపు మేర దూరంలో ఔటర్ హార్బరులో రెండు ఓడలు లంగరు వేసి వున్నాయి.

సముద్రం మీదినుంచి చల్లనిగాలి రివ్వున వీస్తున్నది. ఈ హాయిని ఎంత డబ్బు పోసినా హైదరాబాదులో కొనుక్కోలేం అనుకున్నాడు.

పార్కంతా కలయతిరిగారు.

ఇందిరాపార్కుని దృష్టిలోపెట్టుకుని దీనిని రూపొందించినట్టున్నారు. ఓ కొలను, దానిలో నౌకావిహారం. ఎంతోమంది చిన్నచిన్న బోటుల్లో విహరిస్తున్నారు.

చుట్టూ ఫౌంటెన్లు. తీర్చిదిద్దినట్లున్న నందనవనంలా వుంది. ఎక్కడ చూసినా నేల ఈనినట్లు జనం. రకరకాల గడ్డిపూలు. కూర్చోవడానికి గడ్డి తిన్నెలు. చిన్నచిన్న పూల పార్కులు. సిమెంటు సోఫాలు.

విశాఖపట్నానికి నీటియెద్దడి లేదు.

నాలుగు వేపుల నుంచీ నగరానికి నీరు ప్రవహించివస్తుంది. మేఘాద్రిగడ్డ, రేవాడ రిజర్వాయర్ నుంచి కాలువ, ముడసరి లోయ నుంచి నీరు వస్తుంది. ఆ పచ్చదనం ఆ పార్కులో కనిపిస్తూంది.

మరో ఏడాది వర్షాలు సరిగ్గా పడకపోతే జంటనగరాలలోని జనం ఏమైపోతారోనని భయం వేసింది.

"కూర్చుందామా... ఇంకా తిరుగుదామా?" అన్న శ్రీనివాస్ ప్రశ్నఆలోచనల్ని తుంచేసింది.

"కూర్చుందాం" అని దగ్గరగా వున్న ఒక బల్లమీద ఇద్దరూ కూర్చున్నారు.

ఈ ప్రపంచంలో ఒకరి గొడవ ఒకరికి పట్టదు. అంతమందిలోనూ వాళ్ళు ఏకాంతంగావున్న అనుభూతి పొందారు.

"జగదీష్ చెప్పరా... నాతో ఏదో మాట్లాడాలన్నావు. నీయిష్టం వచ్చినన్ని సంగతులు చెప్పు కరువు తీరేలాగ మాట్లాడుకుందాం" అన్నాడు శ్రీనివాస్.

జగదీష్‌కి ఎలా మొదలుపెట్టాలో ఎంత ఆలోచించినా అర్థంకాలేదు. తన పరిస్థితికి ఓ వేదాంతిలాగ నవ్వుకున్నాడు.

ప్రతి జీవీ పుట్టి ఈ భూతలంమీదికి వస్తాడు. ఎలాపుట్టారో, ఎందుకు పుట్టారో వాళ్ళ గమ్యం ఏమిటో ముందుగా ఎవ్వరికీ తెలియదు.

అందరిలాగే తనూ పుట్టాడు.

అందరిలాగే తనకీ అమ్మవుంది. నాన్న వున్నాడు. తన ఆలానాపాలనా చూసి పెంచి పెద్దచేశారు.

ఒంటికొడుకు. తల్లిదండ్రులని నీట

ముంచినా పాలముంచినా తనే అనే బాధ్యతతో కష్టపడి చదివి ఒక లక్ష్యాన్ని ఏర్పరచుకుని పైకివచ్చాడు.

తనకి ప్రేమించే అర్హతలేదా! అమ్మ ఇష్టప్రకారమే నోరుమూసుకుని చెయ్యాలా. అనాధనైతే మాత్రం తనకి మనసుండదా!

కళ్ళు నీళ్ళతో నిండుకున్నాయి.

ఆ సాయంత్రపు సూర్యకాంతిలో తళుక్కున మెరిసిన ఆ కన్నీటిని చూసి శ్రీనివాస్ విచలితుడయ్యాడు.

షాక్ తిన్నాడు. ఏదో పెద్ద సమస్యే. లేకపోతే! జగదీష్ కన్నీళ్ళు పెట్టుకోవడమా "ఏం జరిగిందిరా?" అంటూ జేబులో నుంచి తీసి రుమాలు అందించాడు.

జగదీష్ చేత్తో వారించి తన జేబులో నుంచి రుమాలు తీసుకుని కళ్ళు వత్తుకున్నాడు.

పూర్తిగా స్వస్తతకి చేరుకోవడానికి ఓ పదిని ముషాలు పట్టింది. తరవాత మెల్లగా సమతని ప్రేమించడం, పరిచయం చెయ్యడం, కులాంతర వివాహానికి వాళ్ళమ్మ ఒప్పుకోకపోవడం, అర్ధరాత్రి నిద్రలేచి అమ్మానాన్నల ఘర్షణవడుతూ వుండటం- ఆరాత్రి తను విన్న సంగతి వరసగా చెప్పాడు.

శ్రీనివాస్‌కి కూడా షాక్ తిన్నట్లయింది.

ఇంపాసిబుల్ అనుకున్నాడు. పంచప్రాణాలూ పెట్టి కొడుకుని పెంచడం అంటే ఏమిటో వాళ్ళింట్లోనే చూశాడు. జగదీష్ తల్లిదండ్రులతో పరిచయ భాగ్యం కలిగిన ప్రతి స్నేహితుడూ జగదీష్ అదృష్టానికి అసూయపడేవాడు. ముఖ్యంగా చలపతిరావులాంటి తండ్రి అందరికీ వుంటే దేశం దానికదే బాగుపడుతుంది అనుకునేవారు.

మరి తను వింటున్నదేమిటి?

జగదీష్ చలపతిరావు కొడుకు కాదా!

ఆశ్చర్యంలో తలమునకలయ్యాడు.

"ఏంవిన్నావో సరిగ్గా చెప్పు?" మళ్ళీ అడిగాడు.

"మీరానాడు నాచేత ఆ పాపం చేయించి వుండకపోతే ఈనాడిలాగ జరిగేదా? ఏకులహీనుడి రక్తమో ఏమో? విత్తనమొకటైతే మొక్కొకటొతుందా" అంది.

"మరి మీ నాన్నగారేమన్నారు?"

"ఊరుకో నిర్మలా... అబ్బాయి వింటే బాగుండదు. గోడలకి చెవులుంటాయి. ఇంత కాలం వాడి జన్మ రహస్యం దాచాము. మనం చేసుకున్న ఒట్టు మరిచిపోయావా?" అని మందలించడం విన్నాను.

శ్రీనివాస్ మరింత ఆశ్చర్యపోయాడు. దత్తతకి తీసుకున్నా లేక మరేవిధంగానైనా పిల్లల్ని పెంచుకుంటే అలాంటి సంగతులు ఊరికే బయటికి వచ్చేస్తాయి. మరి ఇంతకాలం ఈ రహస్యాన్ని ఎలాగదాచారో.

అయినా అంత ప్రేమగా పెంచిన తల్లిదండ్రుల్ని అలాగ వదిలేసి జగదీష్ రావడం శ్రీనివాస్‌కి నచ్చలేదు.

"సరే... ఇప్పుడేం చెయ్యాలనుకుంటున్నావు?" అనడిగాడు.

"ఆ సంగతి విన్నదగ్గర్నుంచీ నాకు జీవితం అంటే విరక్తిపుట్టింది శ్రీనూ! నేనింక మా అమ్మా నాన్నల ముఖం చూడలేను" అన్నాడు.

జగదీష్ ఒకమారు అలాంటి నిర్ణయం తీసుకున్న తరవాత అంత తేలికగా మనస్సు మార్చుకోడని తెలుసు శ్రీనివాస్‌కు.

"సరే... నీయిష్టం వచ్చినట్లే చెయ్యి. నానుంచి నీకెలాంటి సహాయం కావాలన్నా చేస్తాను" అని ధైర్యం చెప్పాడు.

అనడమైతే అన్నాడుగాని అది వివేకమైన పనిగా అనుకోలేదు. చలపతిరావుగారంటే శ్రీనివాస్‌కి ఎంతో గౌరవం. జగదీష్ చేసిన పొరపాటుని సరిదిద్దాలనుకున్నాడు.

వెంటనే ఓ నిర్ణయానికి వచ్చాడు.

సడెన్‌గా ఏదో జ్ఞాపకం వచ్చినవాడిలాగా- "ఒరే జగదీష్... నువ్వు ఏమీ అనుకోకపోతే అర్జంటుగా ఓ ఫ్రెండుని కలుసుకోవాలి. అ గంటలో వచ్చేస్తాను. నువ్వు పార్కులో స్వేచ్ఛగా అటూఇటూ తిరిగి మళ్ళీ ఇదే బెంచీమీద కూర్చుని వుండు" అన్నాడు.

"దానికేం, అలాగే" అన్నాడు జగదీష్.

స్కూటర్‌మీద వెంటనే బయలుదేరాడు శ్రీనివాస్. టెలిగ్రాఫ్ ఆఫీసువేపు పోనిచ్చాడు.

అతని ఆలోచనలు పరిపరివిధాలపో





యాయి. చెప్పి అయినా రాకుండా ఎందుకిలా పారిపోయి వచ్చాడో అర్థంకాలేదు.

చిన్నపిల్లాడు తప్పిపోయాడంటే ఆ సంగతి వేరు. పెద్దవాళ్ళు ఇల్లు విడిచిపెట్టిపోయారు అంటే ఇంక తిరిగి వాళ్ళంతటవాళ్ళే రావాలని అర్థం చేసుకోవాలి. అటువంటప్పుడు రేడియో ప్రకటనలు, దూరదర్శన్ ప్రకటనలు చేసి వృధా. విన్నా చూసినా వెనక్కివెళ్ళే ఉద్దేశం లేనివారు వెళ్ళరు.

చలపతిరావుగారికి ఆ విషయం తెలిసే వుంటుంది. ఆయనెంత కంగారు పడుతున్నారో ఏమో! ముల్లోకాలూ గాలించి అయినా కొడుకిని పట్టుకోవాలనే సంకల్పంలో వుంటారు పాపం. వృద్ధాప్యంలో ఇలాంటి సంఘటనలు ముసలివాళ్ళ ఆరోగ్యంమీద బాగా దెబ్బతీస్తాయి. మానసికంగా ఎంతో కుమిలిపోతారు.

వెంటనే ఎక్స్‌ప్రెస్ టెలిగ్రామ్ ఇవ్వాలి అనుకుని వేగాన్ని మరింత పెంచాడు.

టెలిగ్రామ్‌లు ఇచ్చే అవసరం శ్రీనివాస్‌కి ఎప్పుడూరాదు. ఎప్పుడో ఒకటీ అరా గ్రీటింగులు మాత్రం ఇస్తాడు. అదీ పెళ్ళిళ్ళ సీజనుల్లో కాస్త ఎక్కువ.

దగ్గరగా టెలిగ్రాఫ్ ఆఫీసు ఎక్కడవుందో అతనికి తెలియదు. అందుకని దూరమైనా తెలిసిన పూర్ణామార్కెట్ దగ్గరి టెలిగ్రాఫ్ ఆఫీసువేపు సాగిపోయాడు.

కె.జి. హెచ్. మీదుగా జగదాంబా జంక్షన్ చేరుకుని అక్కడినుంచి పూర్ణా మార్కెట్ టెలిగ్రాఫ్ ఆఫీసు చేరుకున్నాడు.

"జగదీష్ ఈజ్ సేఫ్ విత్ మి ఇన్ వైజాగ్"
– శ్రీనివాస్.

అని చలపతిరావుకి టెలిగ్రామ్ ఇచ్చాడు.

ఈ సంగతి తెలిస్తే జగదీష్‌కి కోపం వస్తుంది. మరెటో ఉడాయిస్తాడు. అందుచేత టెలిగ్రామ్ విషయం చెప్పకుండా మెల్లగా బ్రెయిన్ వాష్ చేసి, సెలవు పెట్టి స్వయంగా హైదరాబాదుకు తీసుకెళ్ళాలని నిర్ణయించుకున్నాడు.

మరోమారు జగదీష్‌ని గురించి ఆలోచించాడు. తనేవాడి స్థానంలో ఉంటే ఏం చేసేవాడిని– అని ఆలోచించాడు.

తన విషయం వేరు.

తండ్రి చిన్నప్పుడేపోగా తల్లే అన్నయ్యనీ, తనని చదివించింది. అన్నయ్యకి ఉద్యోగం రాగానే హైదరాబాద్ తరలిపోయాడు. చదువు పూర్తవగానే మళ్ళీ విశాఖపట్నం వచ్చేశాడు. పోర్టుట్రస్టులో ఇంజనీరుగా ఉద్యోగం దొరికింది. అన్నయ్యకి విజయవాడకి ట్రాన్స్‌ఫర్ అయిపోయింది. అమ్మా, అన్నయ్యా నిశ్చయించిన సంబంధమే చేసుకున్నాడు. తన కథకీ, జగదీష్‌కీ పొంతనేలేదు.

తన ఆలోచనలకి నవ్వొచ్చింది.

మనిషికో కథ ఉన్నప్పుడు జగదీష్ పరిస్థితులూ, తన పరిస్థితులూ ఒక్క లాగా ఎలా వుంటాయి?

ఒకవేళ తనే జగదీష్? అయితే.

ఓ అమ్మాయిని ప్రేమిస్తే!

కులం ఒకటి కాకపోతే తన తల్లిదండ్రులూ చలపతిరావు– నిర్మలాదేవిలాగే ఆ వర్ణాంతర వివాహానికి ఒప్పుకోకపోతే, జగదీష్‌లాగే ఇల్లువిడిచిపెట్టి పారిపోయి ఉండేవాడా?

తనైతే బహుశా వాళ్ళని ఒప్పించి అమ్మాయిని పెళ్ళిచేసుకునేవాడేగాని పారిపోయేవాడు కాదు– అనుకున్నాడు.

ఆలోచిస్తూనే బీచ్‌కి చేరుకున్నాడు. అనుకున్నదానికన్నా ఓ పదినిముషాలు ఆలస్యమైందనుకున్నాడు వాచీ చూసుకొని.

జగదీష్ అదే బెంచి మీద కూర్చుని ఉన్నాడు. శ్రీనివాస్ అతని సరసన కూర్చున్నాడు.

"లేరా... అలావెళ్ళి ఏదైనా టిఫిన్ చేద్దాం" అన్నాడు.

"ఒద్దు... వచ్చేముందేకదా టిఫిను చేశాం." పద– కాసేపు అలా ఇసకలో నడుద్దాం" అన్నాడు.

ఇద్దరూ సముద్రంవేపు నడిచారు.

మెత్తటి ఇసుక.

కెరటాలు తీరాన్ని తాకుతున్నాయి.

ఒడ్డెక్కడానికి ప్రయత్నించి ప్రయత్నించి అలసిపోయిన గుర్రాలలాగా నురగలు కక్కుతున్నాయి కెరటాలు.

సృష్టిని చూసి మనిషి ఎన్నో నేర్చుకున్నాడు.



బాతు నీటిమీద తేలడాన్ని చూసి బోటుని, తరవాత ఓడని చేశాడు. ఎగిరేపిట్టని చూసి విమానాన్ని కనుక్కొన్నాడు.

ఒక రాజు ప్రాణభయంతో శత్రువుల చేతిలో ఓడిపోయి కొండ గుహలో దాక్కుంటాడు. ఆ గుహలో పట్టుదలతో ఏడుమార్లు ప్రయత్నించి ఓ సాలెపురుగు గుహ పైభాగాన్ని చేరుకోవడాన్ని చూస్తాడు. ఆ సాలెపురుగు వల్ల జ్ఞానోదయం కలిగి, మళ్ళీ సైన్యాన్ని సమకూర్చుకుని రాజ్యాన్ని తిరిగిపొందుతాడు.

కెరటాలను చూసి జగదీష్‌కి చిత్రమైన ఆలోచన వచ్చింది.

మనిషి కొన్ని ప్రయత్నాలు చేసి అనుకున్నవి సాధించలేనప్పుడు నిరాశతో విసుగెత్తి విరమిస్తాడు.

ఈ కెరటాలను చూసి మనిషి ఎంత తెలుసుకోవచ్చు. అక్కడ తీరం పొడవునా పెద్దపెద్ద బండరాళ్ళు ఉన్నాయి. అప్పుడే ఒక పెద్దకెరటం వచ్చి పెద్ద పణుకురాయిని ఢీకొట్టింది. ఐరావతం యొక్క కుంభస్థలమే చిట్లిందా అన్నట్లు సూర్యాస్తమయపు ఎర్రని కిరణాలు ఆ తెల్లటి నీటి బిందువుల మీదపడి రక్తవర్ణం దాల్చాయి.

మరింత తమకంతో, మరింత కోపంతో మరింత బలాన్ని సమకూర్చుకుని రావాలని ఆ కెరటం వెనక్కి శిరోఘాతానికి జంకని గొర్రె పొట్టేలులా వెనక్కి జరిగింది. మరికాసేపటికి మరింత పెద్దదై ఆ కెరటం మళ్ళీ రాతిని ఢీకొట్టింది.

నీటి జల్లు ఎగిరివచ్చి ఆశ్చర్యంగా ఊహించుకుంటున్న జగదీష్ బట్టల్ని తడిపేసింది.

ఎంతకాలంనుంచి జరుగుతున్న పోరాటం. చెలియలికట్టని అధిగమించాలనే తపనలో, తమకంలో కోట్లాది సంవత్సరాల నుంచీ ఈ కడలి చేస్తున్న ప్రయత్నంతో పోలిస్తే మనిషి బతుకెంత, మనిషి ప్రయత్నాలెంత అనుకున్నాడు.

సత్సంకల్పంతో చేస్తున్న పనికి ఎన్నివిఘ్నాలు కలిగినా గమ్యంవేపు సాగిపోకుండా విరమించినా, విశ్రమించినా మేము సహించం, మేము క్షమించం అని అరుస్తున్నాయా అన్నట్లు సాగర తరంగాలు సందోహం చేస్తున్న హోరు వినిపిస్తోంది.

అప్పటికే మునిమాపు సంధ్య చీకట్లు అలముకోసాగాయి.

ఓ భావుకుడిలాగా మాటా పలుకూ లేకుండా సముద్రాన్నే చూస్తున్న జగదీష్‌ని చూశాడు. ఎలాంటి అవాంతరం కలిగించదలచుకోలేదు శ్రీనివాస్.

జగదీష్ ఊహల్లోనుంచి బయటికి వచ్చాడు.

"ఇక వెళదామా?" అన్నాడు.

"నీ ఇష్టం! కనీసం కాఫీ అయినా తాగుదామా" అని మళ్ళీ అడిగాడు.

"ఒద్దు" అదే సమాధానం చెప్పాడు జగదీష్.

అక్కడే ఓ కర్రలస్టేండు మీద నిప్పుల కుండమీద వెచ్చని వెరుశనగ పప్పువేయించి ఉప్పూ కారం ఉల్లిపాయలూ, ఉడక బెట్టిన శనగలూ అమ్ముతున్నాడొకతను.

"ఈ పిడత పప్పయినా తిందామా?" అని మళ్ళీ అడిగాడు.

"సరే" అన్నాడు. శ్రీనివాస్‌కి తినాలని ఉందేమో అనే అన్నాడుగాని తనకి ఏమీ తినాలని లేదు. సాయంత్రం తిన్న టిఫిను గొంతులోనే ఉంది.

శ్రీనివాస్ వేరుశనగ పప్పుకొన్నాడు. కాగితాన్ని గిలకల్లాగా చుట్టి వాటిల్లో వేరుశనగ పలుకులు వేసి ఇచ్చాడు. ఇద్దరూ చెరొకటీ తీసుకుని ఒకో పలుకు తింటూ పార్కు బయటికి వచ్చారు.

అప్పటికి ఆరున్నర కావస్తోంది. చీకటి పడింది. పగటి వెలుగు పోయినా పట్టపగల్లాగా వీధి దీపాల కాంతి చీకటిని పారదోలుతోంది.

స్కూటర్ని స్టార్ట్ చేశాడు శ్రీనివాస్.

కాస్త ముందుకు వెళ్ళగానే కాళికాలయం కనిపించింది. కొత్తగా నిర్మించిన ఆ టెంపుల్‌ని జగదీష్‌కి చూపించాలనుకున్నాడు.

జగదీష్‌కి దేవాలయాలు, మఠాలు, పూజలు మొదలైనవాటి మీద ఆసక్తి ఉండదు. కాని శ్రీనివాస్ అంతగా తీసుకువెళుతుంటే కాద




వలేకపోయాడు.

బీచ్ రోడ్డుకి రెండో వేపున తూర్పుక అభిము ఖంగా ఉంది ఆ కాళికాలయం.

స్కూటర్ రోడ్డుమీద పార్కు చేసి మెట్లెక్కి చెప్పులని వాటికి నిర్దేశించిన స్థలంలో విడిచి పెట్టారు.

ఆలయాన్ని నిశితంగా పరిశీలించాడు జగ దీష్. ఏదో కొత్తదనం కనిపించింది. ముఖ్యంగా ఆర్కిటెక్ట్ ఎవరోగానీ చాలా కళాత్మకంగా తీర్చి దిద్దాడు- అనుకున్నాడు.

"దీనిని ఎవరు కట్టించారు?" అడిగాడు.

"అదే నీకు చెప్పాలని లాక్కొచ్చాను. నువ్వు చెపితే నమ్మవు. ఈ ఆలయాన్ని చూస్తే ఎంత మతోన్మాదికైనా మతసహనం అబ్బుతుంది. ఈ



ఆలయ నిర్మాణానికి చాలా ప్లానింగ్ జరిగింది. దీనిలో విగ్రహప్రతిష్ట చేసింది ఓ ముస్లిమ్. దీని నిర్మాణ బాధ్యతలు ఆర్కిటెక్చర్ అంతా చేసింది ఓ క్రిష్టియన్ అంటే నమ్ముతావా?'' అన్నాడు.

జగదీష్ నిజంగానే ఆశ్చర్యపోయాడు.

''బాగుంది. నువ్వు చెపితే నమ్మకేం చేస్తాను. కాని ఇలాంటి నిర్మాణాలు ప్రతి పట్టణంలోనూ జరగాలి. మతం మీద నమ్మకంలేని ధనవంతులైన హిందువులు మసీదులు, చర్చిలు, ధనవంతులైన క్రైస్తువులు దేవాలయాలు, మసీదులు, ఇలాగే ధనవంతులైన ముస్లిములు దేవాలయాలు, చర్చి నిర్మాణానికి పూనుకోవాలి. మత దురహంకారుల తుప్పువదిలించి మతం మత్తు వదిలించి వాళ్ళ కళ్ళు తెరిపించాలి. మతాన్ని మనిషి సృష్టించాడని, అన్ని మతాలూ ఒక్కటేనని నిరూపించాలి'' అన్నాడు.

జగదీష్‌కి చాలా సంతోషం వేసింది. ఇలాంటి మహాత్ములు కూడా దేశంలోవున్నారు గదా అనిపించి వాళ్ళకి మనస్సులోనే అభినందనలు తెలిపాడు.

ఆలయ ద్వారంలోంచి చూశారు. కాళీ విగ్రహం జీవకళ ఉట్టిపడేలాగ కనిపించింది. రామకృష్ణ పరమహంస ఆరాధ్యదేవత కాళి.

పూజారి ఇద్దరికీ తీర్థం ఇచ్చాడు.

పక్కనే భక్తులు కూర్చోవడానికి ఆలయ ఆవరణలో బోలెడు స్థలంవుంది. అక్కడే ఓ సిమెంటు అరుగు మీద కూర్చున్నారు.

ఎదురుగా ఉత్తుంగ తరంగ కల్లోలిత బంగాళాఖాతం.

జగదీష్‌కి కాళికాలయాన్ని గురించిన మరికొన్ని విషయాలు తెలుసుకోవాలనిపించింది.

''ఈ ఆలయానికి సంబంధించిన విశేషాలింకా ఏవైనా వున్నాయా?'' అడిగాడు.

''ఉన్నాయి. ఈ ఆలయాన్ని ఒక్క ఇనుప ముక్కయినా వాడకుండా కట్టారు. ఆర్చిలు, గోపురం ఏది తీసుకున్నా కేవలం సిమెంటు ఇటుక రాయి, కంకరరాళ్ళు తప్పితే మరేమీ వాడలేదు. ఎంత వెతికినా ఒక్క మేకైనా నీకు కనిపించదు'' అని వివరించాడు శ్రీనివాస్.

ఆధునిక గృహనిర్మాణంలో స్టీలు ప్రధమపాత్ర వహిస్తున్నది. అలాంటిది ఒక్క ఇనప ముక్కయినా ఉపయోగించకుండా కట్టడం విచిత్రమే. కాని దానివలన ఎన్నో ఉపయోగాలున్నాయి. శ్రీనివాస్ ఏం చెబుతాడో చూద్దాం అనుకున్నాడు.

''ఒప్పుకుంటాను. దీనివలన నీకేమి అర్థమౌతోంది? ఎందుకని ఇలా నిర్మించారంటావు?'' ప్రశ్నించాడు జగదీష్.

''సముద్రపు ఉప్పుగాలికి ఉక్కు ఇనుము తుప్పుపట్టి ఆలయం కొంతకాలానికి శిథిలావస్థకి వచ్చే ప్రమాదం వుంది. అందుకే అలాగ నిర్మించారు'' అన్నాడు.

''నిజమే... నేనే ఆమధ్య ఏదో పత్రికలో చదివాను. ఢిల్లీలోను కుతుబ్‌మీనార్ దగ్గర ఓ స్తంభం వుందట. అది పదహారువందల సంవత్సరాలనాటిదని చరిత్ర చెబుతుంది. ఆ ఇనుప స్తంభం మీదనే ఓ సంస్కృత శాసనం వుంది. దాని ప్రకారం క్రీ॥శ॥ 375-413 సంవత్సరాల మధ్య కాలంలో రెండో చంద్రగుప్తుడు దానిని నిర్మించి వుంటాడని నమ్ముతున్నారు చరిత్రకారులు.

ఆ స్తంభం నిర్మాణం కూడా అంత తేలికకాదు. దాని బరువు ఆరు టన్నులు. పొడవు 24 అడుగులు. ఒకే పోతలో మూసపోశారు. మరి ఆ రోజుల్లో కూడా అంతంత మొత్తం లోహాన్ని కరిగించగల కొలిమి వుండేది అంటేనే మనకి ఆశ్చర్యం కలుగుతుంది.

అది నేటికీ చెక్కుచెదరలేదు. తుప్పు అనేది ఎరగదు. మరి అది ఏ మిశ్రమ లోహమో తెలియదు. విదేశీ యాత్రికులకు కూడా అదొక వింత. ఆ మధ్యనే జర్మనీకి చెందిన శాస్త్రజ్ఞుల బృందం వచ్చి ఆ మిశ్రమ లోహాన్ని పరిశోధించారు. ఎన్ని ఆధునిక యంత్రపరికరాలు వాడినా ఆ లోహ రహస్యం అంతుపట్టడంలేదట'' అని ఆగాడు.

శ్రీనివాస్‌కి జగదీష్ జ్ఞాపకశక్తికి ఆశ్చర్యం వేసింది. అలాంటివి ముఖ్యంగా శాస్త్రీయ విజ్ఞానానికి సంబంధించినవాటిని పత్రికల్లో తనూ చదువుతూనే వుంటాడు. కానీ ఇంత గొప్పగా చెప్పలేడు. అయినా ఇప్పుడు ఈ స్తంభాల గురించి ఎందుకు చెప్తున్నట్టు?




"ఇంతకీ నువ్వు చెప్పదలచుకున్నదేమిటి? అంతకాలం నుంచి ఆ స్తంభం వుండగా ఈ కాళికాలయానికి ఇనుము వాడితే తప్పేమిటి అనా?" అని సంశయం వచ్చి అడిగాడు.

"కాదు కాదు... పొరపడుతున్నావు. చివరిదాకా విను. అలాంటిదే మరో ఇనప స్తంభం కోణార్క్ దేవాలయ ఆవరణలోవుంది. ఆ స్తంభం కూడా దాదాపు వెయ్యేళ్ళనుంచి చెక్కు చెదరకుండా, ఏ తుప్పుపట్టకుండా వుంది. ఢిల్లీలోని ఆ స్తంభం సముద్రానికి దూరంగా వుందనుకోవచ్చు. కానీ కోణార్క్ దేవాలయం సముద్రాన్ని ఆనుకునివుంది. అయినా ఆ స్తంభం తుప్పుపట్టలేదు. 36 అడుగులఎత్తు 36 అంగుళాల మందం వున్న ఆ స్తంభాన్ని కూడా ఒకే పోతగా పోశారు. ఈ కోణార్క్ స్తంభాన్ని మొదటి నరసింహరాజు నిర్మించాడు. అక్కడి సముద్రం ఉప్పుగాలికి ఆలయపు గ్రానైట్ రాళ్ళయినా దెబ్బతిన్నాయిగాని ఆ స్తంభం మాత్రం తుప్పు ఎరగదు" అని వివరించసాగాడు.

ఇలాగే మరో గంట మాట్లాడేలాగున్న జగదీష్‌ని ఆపాలనుకున్నాడు.

"ఇంతకీ అసలు విషయానికి రా. స్తంభాలు స్తంభాలు... ఇంకా ఆ స్తంభాల మాట వదిలిపెట్టి ఈ కాళికాలయానికీ దానికీ సంబంధం ఏమిటి చెప్పు" అని అడిగాడు.

"నీకు బోరు కొడుతున్నట్లుంది. ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే కుతుబ్‌మినార్ దగ్గరి ఇనపస్తంభం, కోణార్క్‌లోని ఇనప స్తంభం ఏ మిశ్రమ లోహంతో చేశారో తెలుసుకోవడానికి ప్రపంచంలోని శాస్త్రజ్ఞులకి చేతకావడంలేదు. ఆ రహస్యం తెలుసుకుంటే ఇనుము మీద పెయింట్ పూసే అవసరం వుండదు..."

మధ్యలోనే శ్రీనివాస్ అందుకుని, "ప్రపంచంలో రోజుకి ఎన్ని లక్షల టన్నుల ఇనుము కట్టడాలకి వాడుతున్నారో, ఎన్నివేల టన్నుల పెయింట్ పూస్తున్నారో కూడా లెక్కలు చెప్పవుగదా కొంపతీసి" అడిగాడు భయపడుతూ.

"లేదు లేదు... భయపడకు. ఇంక ఎక్కువగా విసిగించను. రాను రాను ఇనుము లేనిది ఏ కట్టడమూ, భవన నిర్మాణమూ జరగదు. రానున్న తరాలలో ఇనుము లేకుండా ఏ కట్టడమైనా అసాధ్యం అనుకునే స్థితికి చేరుకుంటుంది ప్రపంచం. భారతీయుల సంస్కృతి ఓ పరాకాష్టకి చేరుకుని మళ్ళీ దెబ్బతిన్నదని ఆ స్తంభాలు నిరూపిస్తున్నాయి. అలాగే మరికొన్ని శతాబ్దాల తరవాత ఈ కాళికాలయాన్ని ఇనుములేకుండా ఎలా నిర్మించారా అని మళ్ళీ దేశదేశాలవారు వస్తారు" అని ముగించాడు.

"అబ్బా... బతికించావు. ఆ విషయం చెప్పడానికా, కోణార్క ఇనపస్తంభాలూ, మిశ్రమలోహము గురించి చెప్పావు? బాబోయ్! నీ వాచ్ బాగుందిరా అందామనుకున్నాను ఇందాక ఆ మాట అంటే స్విడ్జర్లాండ్ వాచీ పరిశ్రమలగురించి ఏకరువుపెట్టేలాగున్నావు. నేను ముందే చెప్పానుగదా ఉప్పుగాలికి ఇనుము తుప్పుపడుతుందని, అందుకే ఇలా ఇనుము వాడకుండా కట్టారని" అన్నాడు.

"ఏడిశావ్... బంగారంతో నిర్మిస్తేపోలా?" అన్నాడు జగదీష్.

"ఇంకానయం, దీనిని పూర్తిచెయ్యడానికి ఎంత ధనం ఖర్చయిందో, ఎంత కాలం పట్టిందో, ఎన్నితరంటాలు పడ్డారో కట్టినవారినడిగితే తెలుస్తుంది" అన్నాడు శ్రీనివాస్.

"ఏదియేమైనా ఒక మంచి పనిచేశార్రా, నిజంగా వాళ్లని అభినందించాలి" అన్నాడు జగదీష్ మెచ్చుకుంటూ.

శ్రీనివాస్ వాచీ చూసుకున్నాడు.

సాయంత్రం ఏడున్నర దాటిపోయింది.

మాటల్లో వాళ్లకి ఏమీతెలియలేదు.

"పద జగదీష్, ఇహ బయలుదేరుదాం. మా ఆవిడ ఎదురు చూస్తూవుంటుంది. ఏ సినిమాకో వెళ్దాం అనుకుంటుంది కూడాను" అన్నాడు.

"ఏం... నీకు మా చెల్లిఅంటే భయమా?" అన్నాడు జోక్‌గా.

"ఆ... భయమే! సినిమాకెళ్ళారనుకుని తను వేడివేడిగా తిని మనకు అడుగుబొడుగూ ఉంచుతుంది" అన్నాడు నవ్వుతూ.

స్కూటర్ బయలుదేరింది



జగదాంబ జంక్షన్ దగ్గర స్కూటర్ ఆపించి పళ్ళూ, స్వీట్లూ శ్రీనివాస్ వద్దని ఎంతవారిస్తున్నా కొన్నాడు జగదీష్. వెళ్ళేటప్పుడు చేతులు ఊపుకుంటూనే వెళ్ళాడు. ఒకచేతిలో బ్రీఫ్‌కేసు, మరో చేతిలో పొట్లం. చేతులు మార్చుకోవడానికి ఉండదు. ఇల్లు కనుక్కోవడం ఆలస్యమైతే మరింత బాధ అని అలాగే వెళ్ళిపోయాడు. శ్రీనివాస్ ఇద్దరు కొడుకుల్ని చూసి మనస్సు చివుక్కుమంది.

ఇల్లు చేరుకునేసరికి ఎనిమిది గంటలైంది. శ్రీనివాస్ ఇంట్లో అందరూ వెయిట్ చేస్తున్నారు.

వెంటనే కాళ్ళూచేతులు కడుక్కొని భోజనానికి కూర్చున్నారు. వంటకాలు ఎంతో రుచిగా ఉండడంచేత కాస్తఎక్కువగానే తిన్నాడు జగదీష్.

ఎంతచాలునని వారించినా "నిద్రలో అదే అరిగిపోతుందన్నయ్యా" అంటూ మరింత వడ్డించింది.

భుక్తాయాసం వచ్చింది. ఇద్దరూ సోఫాలో కూర్చున్నారు.

అప్పటికే టి.వి.లో చిత్రహార్ పూర్తై హిందీలో వార్తలు మొదలయ్యాయి.

విజ్యూల్ వచ్చింది. రాజీవ్‌గాంధీ ప్రత్యక్షమయ్యాడు.

జగదీష్‌కి అలిసినదానిమీద. అమితంగా తినడంచేత నిద్రవస్తున్నట్లనిపించింది.

అందరికీ "గుడ్‌నైట్" చెప్పేసి తనకోసం కేటాయించిన గదిలోకి వెళ్ళిపోయాడు.

పడుకొని ఆలోచనల్లోకి జారిపోయాడు.

సడెన్‌గా అమ్మానాన్నా జ్ఞాపకానికివచ్చారు. మనస్సు అదోలాగ అయిపోయింది.

ఉత్తరంరాసి తనదారినతాను వచ్చేశాడు. దేవుడిలాంటి నాన్న ఎంత బాధపడుతున్నారో! అమ్మమీద కోపంచేత నాన్నని కూడా వదిలి వచ్చేశాడు.

ఎందుకిలా చేశాడు తను? సమతని పెళ్ళి చేసుకోలేకపోతున్నాననే బాధతోనైతేకాదు. అంతకీ సమతని పెళ్ళి చేసుకోలేకపోతే బ్రహ్మచారిగానన్నా ఉండిపోగలడు-- మరెందుకిలాగ చేసినట్లు?

తను వాళ్ల రక్తం పంచుకుని పుట్టినవాడు కాదనే విషయం విన్నవెంటనే కలిగిన ఆవేదన.

ఆబాధలోనే ఇలా చేశాడు.

ఏ సమయంలోనూ తాను కన్నబిడ్డని కాననే అనుమానం రానివ్వలేదు. ప్రేమలో ఎలాంటి లోపంలేదు. తాను నిజంగానే వాళ్ళబిడ్డని కాకపోతే సాకినవాళ్లకి ఉండాలి, వాళ్ళకేలేనప్పుడు తనకెందుకుపట్టింపు!

చేసిన పొరపాటును సమర్థించుకోలేకపోయాడు. మరో రెండు రోజులు మౌనంగా ఉంటే పరిస్థితులు అవే సర్దుకునేవేమో తొందరపాటులో ఎంత తప్పుపనిచేశాడు.

ముందే తొందరపాటుమనిషి. తానలా ఉత్తరంరాసి ఎటో వెళ్ళిపోయానని మరెప్పటికీ రాననే భయంతో అమ్మ ఏ అఘాయిత్యమైనా చెయ్యదుగదా, నాన్న ఎన్ని యాతనలు పడుతున్నారో ఎక్కడెక్కడని వెతుకుతున్నారో అనుకుంటూఉంటే అతనికి గుండెల్లో విపరీతమైన బాధకలగసాగింది.

ఇప్పుడెలా!

నాన్నగారు తమ పెళ్ళికి తిరస్కరించనేలేదు. ఎలాగోలాగ అమ్మని ఒప్పించేవారు కూడాను.

విశ్వాసఘాతకుడిలాగ ఎంత పనిచేశాడు. నిజంగానే తానొక అనాథనైతే! ఏ దయలేని తల్లో ఏ పెంటమీదనో అక్రమంగా కనిపారేస్తే! పెంచారేమో.

అదే నిజమైతే తన ధర్మం ఏమిటి?

వాళ్లని కన్నబిడ్డకన్నా మిన్నగా చూసుకునే బాధ్యత తనకిలేదూ!

పొరపాటు చేశాడు.

నిజంగానే పొరపాటు చేశాడు.

ఏ అవాంఛనీయమైన సంఘటనా జరగకముందే పొరపాటుని సరిదిద్దుకోవాలి.

మొదట ఆ ఘోరమైన వాస్తవం విన్నప్పుడు జీవితం చాలించాలన్నంత విరక్తి కలిగింది. తను అపురూపంగా చూసుకుంటున్న వాళ్ళు తన వాళ్ళుకారు. తను అనుభవిస్తున్న ఆస్తి తనదికానేకాదు అన్న సత్యం తెలుసుకు




విశిష్ఠ సుగంధం
మైమరపించే తాజాదనం

క్రొత్త

ప్రేమ్

మీకోసమే




ఇప్పుడు అనువైన ఆకారంలో క్రొత్త పరిమళంతో వస్తోంది.

Imageads 2418 Tel

న్న వ్యక్తికి కలిగిన విరక్తి అది.

ఆత్మహత్య ఎలా చేసుకోవాలి? ఏది సులభమైన పద్ధతి?- అని కూడా ఆలోచించాడు. కాని తనలోని విజ్ఞత, దేవుడిలాంటి తండ్రి పెంపకంలోని క్రమశిక్షణ అడ్డంపడింది.

మనస్సు మార్చుకున్నాడు.

అలాంటి క్షణికావేశంలోనే కొంతమంది పొరపాటు చేస్తారు; బంగారంలాంటి బ్రతుకుని నాశనం చేసుకుంటారు.

బుర్రనిండా ఆలోచనలు.

ఎలాగో తెల్లవారితే చాలు భగవంతుడా! ఫ్లైట్‌లోనైనా వెళ్ళి వాళ్ళ పాదాలమీద పడాలి. క్షమించమని నాన్నగారిని వేడుకోవాలి- అనే నిశ్చయానికి వచ్చేశాడు.

అప్పుడు అతని మనస్సు శాంతించింది. ఎంతో ఉపశమనం కలిగింది. తేలికగా ఊపిరి పీల్చుకున్నాడు.

ఎప్పుడైతే ఓ నిర్ణయానికి వచ్చాడో కళ్ళు బరువెక్కాయి నిద్రముంచుకువచ్చింది.

హాయిగా నిద్రలోకి జారిపోయాడు.

నిద్రపోయేముందు అన్ని సమస్యలూ మదిలో మెదులుతాయి. ఈగల్లాగా ఊపిరి పీల్చుకోనివ్వకుండా ముసురుతాయి. చెవుల్లో దోమల్లాగా ఏవేవో రొదలుచేస్తాయి. ఆర్థిక సమస్యలతో సతమతమయ్యేవారికి మరీ నిద్రపట్టదు.

అప్పులూ, ఇంకా రానున్న పండుగలూ, ఖర్చులూ జ్ఞాపకం వస్తాయి. నిద్రపట్టదు. అప్పులవాళ్ళు మనస్సులో బెదిరిస్తారు. అప్పుడు రాబళ్ళు జ్ఞాపకం చేసుకుంటాడు. ఉన్న ఆస్తులు జ్ఞాపకం చేసుకుంటాడు. కొత్తగా అప్పివ్వగలవాడు మదిలో మెదులుతాడు- అభయహస్తమిస్తాడు. కాకపోతే ఆస్తులు అమ్మేస్తాం. రేపు మళ్ళీ కొనుక్కోవచ్చు- అని తెగిస్తాడు. గురకలు కొట్టి నిద్రపోతాడు.

జగదీష్ సమస్యకి పరిష్కారం తల్లిదండ్రుల దగ్గరికిపోవడం. అది స్ఫురించగానే హాయిగా నిద్రపట్టింది.

★ ★ ★

ఆ రోజు...

ఇరవైనాలుగు గంటలు.

జగదీష్ రాత్రే తిరిగి వచ్చేస్తాడనుకున్నాడు.

కాని తెల్లవారినా కొడుకు ఇంటికి రాకపోయేసరికి చలపతిరావుకి ఏంచెయ్యాలో తోచలేదు.

నిజంగానే జగదీష్ తమతో సంబంధాలు తెంచుకుని పారిపోతే మళ్ళీ వెనక్కుతేవడం తన తరంకాదు. తమకి కనిపించకూడదని నిర్ణయించుకుంటే వాడిని పట్టడం తనవల్ల అంతకన్నాకాదు.

జగదీష్ కోపం అంతా వాళ్ళ అమ్మమీదనే అని తెలుసును. తనమీద ఎలాంటి కోపమూ వుండటానికి అవకాశంలేదు. తనకుతానై సమతతో పెళ్ళికి నిరసన వ్యక్తంచెయ్యలేదు. వాళ్ళ అమ్మకి ఏదో షాక్‌ట్రీట్‌మెంటు ఇవ్వాలని వెళ్ళి వుంటాడు-

అని సరిపెట్టుకునేవాడే.

కాని అతని గుండెల్లో-

"చలపతిరావుగారికి" అనే సంబోధన మారుమోగుతోంది.

ఎప్పుడూ... 'నాన్నగారూ, నాన్నగారూ!' అని నోరారా పిలిచే జగదీష్ "చలపతిరావుగారూ" అనడం తను భరించగలననుకున్నాడా?

ఏదో జరిగింది.

తెలియనిదేదో, తన ఊహకందని పరిణామమేదో జరిగివుండాలి అనుకున్నాడు.

ఇటువంటి పరిస్థితులలో వూరికే వుండిపోవడానికి కుదరదు.

రేడియోవాళ్ళకి, దూరదర్శన్‌వాళ్ళకి తప్పిపోయాడు, మతిస్థిమితంలేదు అని ఇవ్వవచ్చును. కాని అలాగతను ఇవ్వడు.

ఇరవయ్యేళ్ళు, ముప్పయ్యేళ్ళు నిండినవాళ్ళ ఫొటోలువేసి "తప్పిపోయాడు" అనే ప్రకటనలు రోజూచూసి జగదీష్, తనూ నవ్వుకునేవారు.

"కావాలనే తప్పిపోయాడు అని వేస్తే బాగుండేదిరా జగ్గూ" అనేవాడు తను.

"అంతేకాదు నాన్నగారూ! పట్టుకోవడానికి ప్రయత్నించకండి. అరుస్తాడు కరుస్తాడు- వాడొక చిక్కడు దొరకడు అని కూడా రాయాలి" అనేవాడు.

ఇద్దరూ నవ్వుకునేవారు.





అలాంటి తన కొడుకు అలిగి వెళ్ళిపోయాడు.

తనూ "తప్పిపోయాడు" అని దూరదర్శన్‌లో ప్రకటించాలా? చూస్తే వాడేమనుకుంటాడు. నాన్నగారూ ఇంతేనా అనుకోడూ!

పాతికేళ్ళవాడు తప్పిపోతాడా ఎక్కడైనా? ఎడ్రసు మరిచిపోతాడా! 'మతిస్థిమితంలేదు' అని కూడా వేయించాలి. చూస్తే బాధపడడూ వాడికి మతిస్థిమితంలేక పోవడమా?

ఏంచెయ్యాలో చాలాసేపు అర్థంకాలేదు.

తెలిసిన చుట్టాలు. స్నేహితుల్లో ఫోనులున్న వాళ్ళందరికీ ఫోనుచేశాడు.

"జగదీష్‌గాని మీఇంటికి వచ్చాడా?" అని అడిగాడు అందర్నీ అంతే!

"లేదు" అనగానే కట్‌చేసేశాడు. మళ్ళీ తిరిగి ప్రశ్నించే అవకాశంవాళ్ళకివ్వలేదు.

ముఖ్యమైన పట్టణాలలో వున్న స్నేహితులకి "జగదీష్ టూర్‌లోవున్నాడు. మీ ఇంటికి గనక వస్తే త్వరగా వచ్చెయ్యమనండి" అని మాత్రమే టెలిగ్రామ్‌లు కొట్టాడు.

టెలిఫోన్లు వున్నవాళ్ళకి ట్రంక్‌కాల్స్ చేశాడు.

మరీ అడిగితే "ఏంలేదు... టూర్ వెళ్ళాడు. మీ ఇంటికి వచ్చాడేమో తెలుసుకుందామని" అని మాత్రం చెప్పి కట్‌చేశాడు.

సెక్రటేరియట్‌లో పదిగంటలనుంచీ పన్నెండు గంటలదాకా కాపుకాశాడు. టెలిఫోన్‌కాల్‌గాని లేక లీవ్‌లెటరు గానివస్తే చెప్పమన్నాడు. కాని అలాంటిదేమీ జరగలేదు.

ఎక్కడినుంచో తరవాత ఎప్పుడో లీవ్ లెటర్ పోస్టులో పంపుతాడని అర్థంచేసుకున్నాడు. ఉద్యోగం చెయ్యదలచుకుంటే ఎప్పుడైనా పట్టెయ్యవచ్చు. కాని పొరపాటున రిజైన్‌చేసేస్తేనే ప్రమాదం అనుకున్నాడు.

ఇంటికి వచ్చాడు.

చాలా నీరసంగా వుంది. గుక్కెడు మంచినీళ్ళయినా తాగలేదు.

భర్త వాలకంచూసి నిర్మలాదేవి చాలా బాధపడింది. అలాంటి స్థితిలో ఆయననెప్పుడూ చూడలేదామె. ఎలాంటి సమస్యనైనా తేలికగా తీసుకుంటాడని తెలుసు.

తండ్రీకొడుకులిద్దరూ ఒక్కటైపోయి చాలామార్లు తనని ఉడికించేవారు. కొడుకు తండ్రిని సమర్థించేవాడు. తండ్రెప్పుడూ కొడుకు పక్షమే. తను ఎన్నోమార్లు ఏకాకిగా మిగిలిపోయి బాధపడేది.

అలాంటి ముద్దులకొడుకు ఉత్తరం రాసిపడేసి వెళ్ళిపోయాడు. ఎలా తట్టుకోగలరు. ఎంతో బాధపడింది.

బయటికి ఏమిటన్నా అడతారు.

సూటిపోటి మాటలతో వేధిస్తారు.

అంతకన్నా వూరుకోవడమే నయం. ఏదైనా విశేషముంటే ఆయనే చెపుతారు అని వూరుకుంది.

మంచినీళ్ళు మాత్రం టీపాయ్‌మీదపెట్టింది.

భార్యమీద ఉదయం చాలాకోపం వచ్చింది చలపతిరావుకి. మధ్యాహ్నానికి కాస్త తగ్గింది.

జగదీష్ ఇంతపని చేస్తాడని ఊహించి వుండదుపాపం అనుకున్నాడు. పెంచిన మమకారం ఏ తల్లినైనా అలా చేస్తుంది.

అదీగాక ఎవరో కొత్తగా పరిచయం అయిన అమ్మాయిని తనకంటే అధికంగా కొడుకు భావించడాన్ని ఏ తల్లి సహించగలదు.

అందుకే వూరుకున్నాడు.

మంచినీళ్ళు తాగాడు.

"భోజనంపెట్టెయ్యమంటారా?" అడిగింది నిర్మలాదేవి భయంభయంగానే.

ప్రసన్నంగానే 'నాకు ఆకలిలేదు... నువ్వు తినెయ్యి' అన్నాడు.

నిర్మలాదేవి కూడా ఉదయంనుంచీ పచ్చి మంచినీళ్ళు తాగలేదు. కాని "నేను ఆకలికి ఆగలేక తినేశాను. మీరూ కాస్త తినండి" అని అబద్ధం చెప్పింది.

తల అడ్డంగావూపి మౌనంగా మళ్ళీ పడక గదిలోకి వెళ్ళి మంచంమీద పడుకున్నాడు చలపతిరావు. రెండు మూడు రోజుల్లో తప్పకుండా వచ్చేస్తాడనే నమ్మకంవుంది. కాని అప్పటిదాకా ఆగడం ఎలా?

కళ్ళుమూసుకుని ఆలోచనల్లోకి జారిపోయాడు.

ఆశ్చర్యం! ఎప్పుడూ చలపతిరావుకి కరె

క్టుగా ప్రైముకి ఆకలివేస్తుంది. మధ్యలో ఏమీ తినడు. హోటలు తిళ్ళు అసలే అలవాటులేదు. మరీ నీరసం అనిపిస్తే మధ్యలో టీతాగుతాడు— అంతే! అలాంటిది ఈరోజు అతనికి ఆకలివెయ్యడంలేదు.

మనస్సులో ఏదైనా దిగులు, బెంగ వున్నప్పుడు; పట్టరాని ఆనందం కలిగినప్పుడు ఆకలి చచ్చిపోతుందేమో అనుకున్నాడు.

నిర్మలాదేవికి ఆకలిగానే వుంది. కాని భర్త తిననప్పుడు తనూ తినకూడదనుకుంది. అసలు ఇంట్లో తుఫాను రావడానికి కారణం తనే అనే తలంపు ఆమెని క్షణక్షణం బాధపెట్టసాగింది.

అయినా బయటికి చెప్పలేదు. ఓ గ్లాసుడు మంచినీళ్ళు తాగి వేరే మంచంమీద మేనువాల్చింది.

కాని కళ్ళు మూతపడలేదు.

మాటిమాటికీ భర్తని గమనించసాగింది.

కళ్ళు మూసుకుని వెల్లకిలా పడుకునే వుండిపోయిన భర్తని చూసి ఎంతో బాధపడసాగింది.

ఇంట్లో మనుషులున్నట్లే లేదు.

ఎంత కళకళలాడిన ఇల్లు ఎలా మారిపోయింది? కులమేదైతేనేం, ఎంత అందమైన పిల్ల ఆ సమత. ఊరుకున్నాపోయేదిగదా— అని ఎంతో బాధపడసాగింది.

సాయంత్రానికైనా రాకపోతాడా అని కొడుకు రాకకోసం వెయ్యికళ్ళతో ఎదురు చూడసాగింది.

ఆశ నిరాశే అయింది.

చూస్తూ వుండగానే చీకట్లు ముసురుకున్నాయి. ఈ చీకట్లు ఇలాగే ఉండిపోతాయా, తమ బతుకులిక ఇంతేనా, తమ చీకటిమయమైన బతుకుల్లోకి వెలుగురేఖలా ఉదయించాడు జగదీష్. తమ బతుకుల్లో ఆశల జ్యోతులు వెలిగించాడు. వాడే తమకి ఓ యేడుగడ, పట్టుకర్ర అని మురిసిపోయారు.

అవన్నీ మరిచిపోయిందా తను.

భార్యాభర్తలిద్దరూ ఎవరి ఆలోచనల్లో వాళ్ళు వుండిపోయారు.





సాయంత్రం ఏడుగంటలు కొట్టింది గడియారం. లేచి ఎవరూ లైటు వెయ్యలేదు.

చలపతిరావు నీరసంగా లేచాడు. భార్యతో మాట్లాడటం ఇష్టంలేకపోయింది.

లేచి లైటు వేశాడు. మళ్ళీ వచ్చి మంచం మీద పడుకుండిపోయాడు.

నిర్మలాదేవి కూడా ఆశ్చర్యపోయింది.

చలపతిరావు వాక్‌కి వెళ్ళి ఇంటికి ఏడు గంటలకల్లా చేరుకుంటాడు. టి.వి. దగ్గర కూర్చుంటాడు.

ఎప్పుడూ వార్తలు మిస్ అవడు. ప్రాంతీయ వార్తలు దూరదర్శన్‌లో చూస్తాడు. మళ్ళీ హిందీవార్తలు చూస్తాడు. వెంటనే రేడియోలో ఇంగ్లీషు వార్తలు, మళ్ళీ దూరదర్శన్‌లో ఇంగ్లీషు న్యూస్— ఇదేపని.

నిర్మలాదేవికి ఒకోమారు చిరాకు కూడా పుడుతుంది. అంతలోనే ఏం పుట్టిమునిగిపోతుందనో అవే వార్తలు మాటిమాటికీ వినడం అనుకుంటుంది.

అలా అని పేపరు వదులుతారా అంటే అదీ వుండదు— ఈ చివరనుంచి ఆ చివరిదాకా చదవడమే.

అలాంటిది ఈరోజు పేపరు ముట్టలేదు. టీవీ చూడలేదు. అందుకే ఆశ్చర్యపోయింది.

లేచి కూర్చుంది.

"కాస్త భోజనం చెయ్యకూడదా? మీరేం భయపడనక్కరలేదు. మీ కొడుకెక్కడికీపోడు. రేపీపాటికి పరిగెత్తుకుంటూ రాకపోతే నన్నడగండి. ఈ తండ్రిని చూడకుండా వాడుండలేడులెండి" అని మెత్తబెట్టడానికి ప్రయత్నించింది.

"నేను తిననని చెప్పానా? నువ్వెందుకు ఇంకా కూర్చున్నావు— వెళ్ళి తిను" అన్నాడు సౌమ్యంగానే.

"సరేలెండి... ఇద్దరం పస్తులే పడుకుందాం. వాడొచ్చాకే ఎంగిలిపడతాం" అని కళ్ళనీళ్ళు తుడుచుకుంది.

చలపతిరావుకి కూడా కళ్ళు చెమర్చాయి.

అలా చాలాసేపు గడిచిపోయింది.

నిశ్శబ్దం విశృంఖల విహారం చేసింది. కళ్ళు మూసుకుని పడుకున్న ఇద్దరి మనోవీధుల్లో ఊహల దృశ్యాలు కనపడుతున్నాయి. ఏవో

ఊహించని భయాలు.

మౌనంగా వున్న వాళ్ళిద్దరూ ఉలిక్కిపడేలా పదిగంటలు కొట్టింది.

అయినా ఇద్దరిలో చలనం వచ్చినట్లే వచ్చి మళ్ళీ జడత్వం ఆవహించింది.

మరో అరగంట అయిందేమో!

మెట్లగది తడుతూ 'సాబ్... టెలిగ్రామ్' అని వినిపించింది.

చలపతిరావు పరుగులాంటి నడకతో మెట్ల గదిని చేరుకున్నాడు.

తలుపు తెరిచాడు. సంతకం పెట్టి టెలిగ్రామ్ తీసుకున్నాడు.

హాలులోని ట్యూబ్‌లైట్‌వేసి వెలుగులో టెలి



గ్రామ్‌ని తెరవడానికి భయం వేసింది.

ఎక్కడినుంచో ఎవరు ఇచ్చారోననే ఆరాటం.

టెలిగ్రామ్ విశాఖపట్నంనుంచని అర్ధమైంది.

తెరిచాడు - చదువుకున్నాడు - తేలిగ్గా వూపిరి పీల్చుకున్నాడు. శ్రీనివాస్ టెలిగ్రామ్ ఇచ్చాడు. ఫరవాలేదు - ఎక్కడో క్షేమంగానే వున్నాడు అని సంతోషించాడు.

నిర్మలాదేవి బెడ్‌రూమ్‌లోనుంచి బయటికి వచ్చి ఏవార్త వినవలసివస్తుందోనని భయంభయంగా ఎదురుచూడసాగింది.

వార్త చదవగానే - "నిర్మలా" అని పిలిచాడు.

అతని గొంతులోని ఆనందాన్ని చూసి జగదీష్‌నుంచే ఏదోవచ్చి వుంటుందని గ్రహించింది.

"అబ్బాయి విశాఖపట్నం చేరుకున్నాడోయ్. మన శ్రీనివాస్ దగ్గరికి చెక్కేశాడు. రేపే వెళ్ళి లాక్కొస్తాను" అని విషయం చెప్పాడు.

నిర్మలాదేవికి దిగులంతా మాయమైపోయింది. చేజేతులా చేసిన పొరపాటు. దేవుడా నువ్వున్నావు అనుకుంది.

"నాకు తెలుసునండీ. వాడు తప్పకుండా ఎక్కడో క్షేమంగా వుంటాడని తెలుసును. ఇకనైనా లేవండి. ఇప్పుడైనా కలిసి భోజనం చేద్దాం" అంది.

"ఏమిటంత తొందర. ఒకసారి మెక్కావు గదా. ఇంకా కడుపులో ఎలకలు పరిగెడుతున్నాయా?" అన్నాడు నవ్వుతూ.

"నయం... మీరు అలా చెపితే తింటారని మధ్యాహ్నం అలా అబద్ధం చెప్పాను, అయినా మీరు తినలేదు. మీలాగే నేనూ ఆకలితో మాడుతున్నాను" అంది.

"సరేలే... త్వరగా పెట్టు" అని బాత్‌రూమ్ వేపు పరుగుతీశాడు.

ఆ ఉదాసీనత ఎక్కడికి పోయిందో. మళ్ళీ చలాకీతనం భర్తలో కనిపించగానే తృప్తిగా అనిపించింది నిర్మలాదేవికి.

భోజనాలు పెట్టింది.

ఆపురావురుమంటూ ఇద్దరూ ఒకరికొకరు వడ్డించుకుని తిన్నారు.

చలపతిరావు ఉదయాన్నేలేచి సికింద్రాబాద్ నుంచి ఈస్టుకోస్టు పట్టుకుని విశాఖపట్నం చేరుకోవాలనుకున్నాడు.

శ్రీనివాస్ అడ్రసుకోసం వెతికాడు. అడ్రసు లున్న జగదీష్‌డైరీలో దొరికిందది.

ఓ కాగితంమీద నోట్ చేసుకుని జేబులో దాచుకున్నాడు.

బెడ్‌రూమ్‌లోకి వెళ్ళి మంచంమీద వెల్లకిలా పడుకుని నిశ్చింతగా నిద్రలోకి జారిపోయాడు.

నిర్మలాదేవి వంటింట్లో పనిపూర్తిచేసుకుని గదిలోకి వెళ్ళేసరికి చలపతిరావు గురకలు వినబడుతున్నాయి.

అబ్బాయి దగ్గరికి విశాఖపట్నం వెళతారని గ్రహించింది. ఆ విషయాలేమైనా చెపుతారేమోనని ఆదరాబాదరాగా వంటగదిలో పనులు ముగించుకుని వచ్చింది. కాని అప్పటికే నిద్రపోయారు.

నిద్రలేపితే కోప్పడతారనుకుని తనూ పక్కనే మెల్లగా పడుకుంది.

నిర్మలాదేవి చాలాసేపు ఆలోచించింది.

ఏగొడవా పెట్టకుండా ఇంటికి వచ్చెయ్యాలి దేవుడా. అబ్బాయి ఏపిల్లని చేసుకున్నా తనకనవసరం. తండ్రీకొడుకులిద్దరూ వాళ్ళిష్టమొచ్చినట్టు చేసుకోనియ్యి. నేను మధ్యకిరాను. మా ఇంటిదీపం వాడు. మళ్ళీ మా ఇంట్లో వెలుగు ప్రసరింపజెయ్యి. మాకు సుఖశాంతులు కలిగించు భగవంతుడా! అని మనస్సులోనే ప్రార్థించుకుంది.




జగదీష్‌కి వేకువజామున మెలకువ వచ్చింది. బెడ్‌లైట్ వెలుగులో చేతికున్న వాచ్




వేపు చూశాడు. ఐదుగంటలు చూపిస్తూంది.

ఎలాగైనా శ్రీనివాస్‌ని ఒప్పించి ఫ్లైట్‌లోనైనా హైదరాబాదు వెళ్ళిపోవాలి. అమ్మానాన్న బెంగ పెట్టుకుంటారు అనుకున్నాడు.

కళ్ళు మూసుకునే ఆలోచించసాగాడు. ప్రతి చిన్న అలికిడిని జగదీష్ చెవులు గుర్తిస్తున్నాయి. చిన్నపురుగు ఒకటి బెడ్‌లైట్ బల్బు చుట్టూ ఎగురుతోంది. సన్ననిదాని రెక్కల చప్పుడు కూడా వినిపిస్తూంది. మొట్టమొదట శ్రీనివాస్ అమ్మగారు లేస్తారని వూహించాడు.

అరగంటసేపు అటూఇటూ మంచంమీదనే పొర్లాడు. కాకులు బయటినుంచి అరుస్తున్నాయి. తెల్లగా తెల్లవారిపోయింది. చిత్రం-హైదరాబాదులో ఇంకా చీకటిగానే వుంటుంది.

జగదీష్ భావనల్లో తేలిపోయాడు.

ఇండియన్ స్టాండర్డు టైము ప్రకారం భారతీయులు వాళ్ళవాళ్ళ కార్యక్రమాలు నిర్వహించుకుంటారు. నిజానికి అక్షాంశరేఖల ప్రకారం చూసుకుంటే ఇటు అస్సాం నుంచి అటు గుజరాత్ దాకా సూర్యోదయ సూర్యాస్తమయ సమయాలలో ఎంతో తేడా వుంటుంది.

ఇక్కడ సూర్యోదయం అయిన వేళకి అక్కడ ఇంకా తెల్లవారకపోవచ్చును.

భూగోళం, దాని గమనాలూ తెలియనివారికి అంతసులువుగా అవగాహనకిరాదు.

ప్రపంచంలో ఎన్ని విచిత్రాలున్నాయి. ఎంత విజ్ఞానం వుంది.

నార్వేలో అర్ధరాత్రి సూర్యోదయం అవుతుందని చదివాడు. వెళ్ళి చూసినవారు ఆ సూర్యోదయాన్ని గురించి రాశారు. సూర్య బింబం ఎర్రగా ఉదయించి చాలా మెల్లగా బాణంబద్ధఆకారంలో ప్రయాణించి దిగంతంలోనే అస్తమిస్తాడట. సరియైన భూగోళ పరిజ్ఞానంలేనివారు నమ్మడమే కష్టం.

ధృవ ప్రాంతాలలో నివసించే ఎస్కిమోలకి ఆరునెలలు పగలు. ఆరునెలలు చీకటి.

ఇదో విచిత్ర ప్రపంచం.

దాంట్లో ఈ ఆలోచించే మనిషి.

ఏమిటో.

వంటగదిలోనుంచి చప్పుళ్ళు మొదలయ్యాయి. ఎవరో మేలుకున్నట్లుంది.

గదిలోనుంచి బయటికి వచ్చాడు.

శ్రీనివాస్ భార్య.

జగదీష్‌ని చూసింది. శ్రీనివాస్ కూడా మేలుకునే వున్నాడు.

"ఏవండీ... అన్నయ్య లేచారు. ఏంకావాలో చూడండి" అని పిలిచింది.

శ్రీనివాస్ బయటికి వచ్చాడు.

బనియన్ లుంగీతో వున్నాడు.

"గుడ్‌మార్నింగ్ రా జగదీష్" అని విష్ చేశాడు.

"గుడ్‌మార్నింగ్... ఈరోజు నాకోసమని నువ్వు త్వరగా మేలుకోలేదుగదా కొంపతీసి" అన్నాడు.

"లేదులేదు... ఒకోరోజు ఇంతకన్నా త్వరగా మేలుకుంటాను".

"అయితే ఫరవాలేదు"

"ఏం ఫరవాలేదు. రోజూ ఎనిమిది గంటలకు లేస్తే మాత్రం. నీకోసం ఒక్కరోజు ఆరు గంటలకి లేవలేనా?" అన్నాడు శ్రీనివాస్.

"సరేగాని... నేను రాత్రి ఓ నిశ్చయానికి వచ్చేశాన్రా! ఈరోజే ఎంత వీలైతే అంత తొందరగా, ఫ్లైట్‌లోనైనా సరే వెళ్ళిపోవాలి" అన్నాడు జగదీష్.

శ్రీనివాస్ అర్థంచేసుకున్నాడు. ఏదో తొందరపాటు వల్లనే ఇల్లు వదిలిపెట్టాడుగాని, కాస్త అప్పుడే ఆలోచిస్తే ఇలా చేసే వాడుకాదు- అని అనుకున్నాడు.

"ఏం... పెద్దకబుర్లు చెప్పావుగదా! ఒక్కరోజులోనే అమ్మానాన్నా జ్ఞాపకం వచ్చేశారా? లేకపోతే మీ హైదరాబాదుని ఎవరైనా భుజాన వేసుకుని ఎత్తుకుపోతారని భయమా?" జోక్‌గా అన్నాడు నవ్వుతూ.

"నాకు తెలుసు నువ్విలాగంటావని. నిజంగా నేను చాలా పొరపాటు చేశానేమో అనిపిస్తోంది. అమ్మానాన్నల కోసం ఎలాంటి త్యాగాలైనా చేద్దామని నాలోనేనే అనుకునేవాణ్ని. అలాంటిది ఇంత చిన్నవిషయానికి ఇల్లు విడిచిపెట్టి వాళ్ళని గాలికి వదిలివచ్చేశాను. వెంటనే వెళ్ళిపోవాలి. క్షమించి నన్ను త్వరగా వెళ్ళనియ్యి. మరోమారు కావాలంటే వచ్చి

ఎన్నిరోజులైనా వుంటాను'' అని బతిమాలసాగాడు.

జగదీష్‌లో పశ్చాత్తాపం, ఎంతో చెప్పలేని ఛాయలు కనిపించింది.

''రేపు వెళుదువుగాని లేరా, రావడం పోవడం అంతా నీయిష్టమే అనుకుంటున్నావా?''

''అలాగనకురా, బాబ్బాబు... మళ్ళీ వస్తానుఅంటున్నానుగా'' మరింత దీనంగా ముఖంపెట్టి అభ్యర్థించాడు.

''ఇంతకీ నీకెందుకింత తొందర- ఒక్కరోజులో ఏమౌతుందోయ్?'' ఏమీ భయంలేకుండా నిబ్బరంగా చెప్పాడు.

శ్రీనివాస్ ఏమీ తెలియనివాడిలా ఇలా మాట్లాడతాడేం.

''నీకు తెలియనిదేముంది. కోపంలో అమ్మ అలాగ మాట్లాడి వుంటుందేగాని నేను లేకపోతే మా అమ్మకి తోచదు. మళ్ళీ ఇంటి ముఖం చూడనని నిర్ధారణ చేసుకుంటే ఏదైనా అఘాయిత్యం చేస్తుందేమోనని భయంగా వుంది''

''పిచ్చినాయనా భయపడకు. నేను నిన్న సాయంత్రం వూడాపార్కులో వదిలి ఎక్కడికెళ్లాననుకున్నావ్? అభ్యంతరం చెపుతావేమోనని నీతో చెప్పలేదుగాని నేను టెలిగ్రాఫ్ ఆఫీసుకి వెళ్ళాను. జగదీష్ నా దగ్గర క్షేమంగానే వున్నాడు- అని టెలిగ్రామ్ కొట్టాను మీ నాన్నగారికి'' అని వివరించాడు.

శ్రీనివాస్ సమయస్ఫూర్తికి మనస్సులోనే ధన్యవాదాలు అర్పించాడు జగదీష్. శ్రీనివాస్ అంటే నాన్నగారికి మంచిగురి. ఆయన అంచనాని తారుమారు చెయ్యలేదు వీడు. తన విధిని నిర్వర్తించాడు అనుకున్నాడు.

ఏమీ సమాధానం రాకపోయేసరికి జగదీష్‌కి కోపం వచ్చిందేమోనని భయపడ్డాడు శ్రీనివాస్.

''చెప్పకుండా టెలిగ్రామ్ ఇచ్చినందుకు కోపం వస్తే క్షమించరా? మీ నాన్నగారికి, అమ్మకి నీ క్షేమం వెంటనే చేరడం అవసరం అనిపించింది. నువ్వు చేసింది పొరపాటనిపించింది. స్నేహితుడిగా ఆ పొరపాటుని సరిదిద్దడం నా కర్తవ్యంగా భావించాను. కోపం వస్తే నాలుగుతిట్టెయ్... ఫరవాలేదు'' అని అడక్కుండానే సంజాయిషీ చెప్పుకున్నాడు.

''నాకేమీ కోపం లేదురా, నువ్వు చాలా మంచి పనిచేశావు... థాంక్యూ వెరీమచ్. నేను భయపడుతున్నది మా అమ్మని గురించే. మా నాన్నగారికి నా టెంపర్‌మెంట్స్ గురించి నాకన్నా బాగా తెలుసును. రాత్రంతా ఎంతో బాధపడ్డాను. ఉదయానేలేచి వెళ్ళిపోవాలని నిర్ణయించుకున్నాను. నన్ను వెళ్ళిపోనియ్యి'' అన్నాడు.

''ఇంకా ఎందుకురా, నువ్వు నా దగ్గరున్నావని రాత్రేవాళ్ళకి తెలిసి వుంటుంది. వాళ్ళు హాయిగా వుంటారు. నువ్వు ఎలాగూ వచ్చావుగదా. అరకువేలీకి తీసుకువెళతాను. ఆ ప్రకృతి సౌందర్యాన్ని చూసి ఆనందించుదువుగాని'' అని ప్రోగ్రాం చెప్పాడు.

''బాబూ... ఈ సందర్భంలో నాకేవి చూసినా తలకెక్కవు. మనస్సంతా హైదరాబాదులోనే వుంది. ఈసారికి క్షమించు- మరోసారి వెళదాం''

జగదీష్‌కి ఎక్కడికీ వెళ్ళటం ఇష్టంలేదని శ్రీనివాస్ అర్థంచేసుకున్నాడు. ఏది చూడటానికైనా మనస్సుముఖ్యం. మనస్సు బాగాలేనప్పుడు ఏదిచూసినా వృథా. ఆనందం అనేది ముందు అంతరంగంలో నుంచి పుట్టుకురావాలి. బయటి ప్రపంచం దానిని ఉద్దీపింపజేస్తుందేగాని అంతరంగం విలపిస్తున్నప్పుడు దానిని ప్రేరేపించి ఆనందింపజెయ్యలేదు- అనుకున్నాడు.

''సరే... నీయిష్టం అలాగే వెళుదువుగాని. కాని నాకో భయం పట్టుకుంది. నువ్వు ఇలాగ అటువెళ్ళావోలేదో మీ నాన్న ఇటు వూడిపడవచ్చును. అందువేత ఈ ఒక్కరోజుకి ఆగు. రేపు సాయంత్రం గోదావరి రైలు ఎక్కించే పూచీ నాది. నేనూ నీతో వస్తాను'' అని వాగ్దానం చేశాడు.

''ఇంకా నయం. హేండ్‌కాఫ్స్ తగిలించి రైల్లో కూడా వుండి లాక్కెళుదువుగాని. ఏంబాబూ... నాకు దోవతెలియదా? ఇల్లు మరిచిపోయాననుకుంటున్నావా?'' అన్నాడు కొంచెం కోపాన్ని అభినయిస్తూ.




# కాసింత బిజ్ చేస్తుంది ఎన్నో పనులు
# నిజంగా బిజ్ తెస్తుంది ఎంతో పొదుపు




సూపర్ బిజ్. దీనితో
పాత్రల నిండా తళతళలు
నక్షత్రాల మిలమిలలు.
ఒక్క పాత్రలేమిటి?
బిజ్ అన్నిటా చూపుతుంది తన
చమత్కారం.
మీ ఇంటి నేలలు, టయిల్స్,
వాష్ బేసిన్, కిటికీ-తలుపుల
గాజు రెక్కలు—ఏమైనా సరే,
బిజ్ తో గొప్ప మెరుపులు.
మరి ఖర్చు ఎంత తక్కువంటే
మీకు ఆదాయే ఆదా!




గోద్రెజ్
సూపర్

**బిజ్**

తోమే పౌడర్

**పనితనం...వెల కంటే అధికం**

CLARION/B/GS/49/173/TEL

"సరేలేవోయ్... నేను మీ వూరు, మీ ఇంటికి రావడం ఇష్టంలేకపోతే అలాగే రానులే"

"అంతమాటనకురా- నువ్వు ఎల్లుండి బయలుదేరి రారాబాబూ! బేండు మేళాలతో నాంపల్లిస్టేషనుకి వచ్చి రిసీవ్ చేసుకుంటాను"

"అదేంకుదరదు. నీతో రావలసిందే. హైదరాబాదు నా ఇష్టమొచ్చినప్పుడు వస్తానోయ్- మీ ఊరేకావచ్చు అదిఆంధ్రరాష్ట్రానికే ముఖ్య పట్టణమోయ్" అన్నాడు హాస్యంగా.

"అలాగే రావయ్యాబాబూ! బేడీలు సంపాదించు. నన్నుప్పగించి మానాన్నగారి చేత నాలుగు మెడల్సు వేయించుకో. సరే... ఈరోజు కార్యక్రమం ఏమిటంటావు?" అని మామూలు స్థాయికి వచ్చి అన్నాడు.

దాంతో మరోరోజు ఆగడానికి నిశ్చయించు న్నట్లు అర్థమైంది.

"కాస్త ఆగు... కార్యక్రమం మొదలౌతుంది. ముందు టెలిఫోను చేసి నేను డ్యూటీకి రావడంలేదని ఆఫీసుకి తెలియజెయ్యాలి. తరవాత సంగతులు తరవాత చూసుకుందాం" అన్నాడు శ్రీనివాస్.

ఇంతలో శ్రీనివాస్ భార్య శారద- "మీకు కబుర్లతోటే కడుపునిండిపోతున్నట్లుంది. త్వరగా ముఖాలు కడుక్కొనిరండి. వేడివేడి పెసరట్లు కాల్చాను- చల్లారిపోతున్నాయి" అని వంటింట్లోనుంచి చెప్పింది.

బ్రష్, పేస్టు తీసుకుని బాత్‌రూమ్‌లోకి వెళ్ళిపోయాడు జగదీష్.

ఎనిమిది గంటలకి టిఫిను ముగించారు.

"శారదా.. మేము భోజనానికి రాకపోవచ్చు. మాకోసం చూడవద్దు" అని చెప్పాడు.

టిప్‌టాప్‌గా తయారై స్కూటర్‌మీద ఇద్దరూ బయలుదేరారు.

విశాఖపట్నంలోని ముఖ్యమైన ప్రదేశాలు చూపించాలనుకున్నాడు. హైదరాబాదులో లేని మంచిప్రదేశాలు ఏమున్నాయని ఆలోచించాడు.

ఇందిరా పార్కు చాలా విశాలమైనదే. కాని నెహ్రూ జూలాజికల్ పార్కులో వున్నన్ని జంతువులు లేవు.

బీచ్‌కి ఆ క్రితంరోజు సాయంత్రమే వెళ్ళారు. లైట్‌హౌస్ అందం రాత్రివేళే. సాయంత్రం వెళ్ళి చీకటిపడేదాకా వుండి అది తిరుగుతూ వుంటే చూడటం మంచిది.

బాగా ఆలోచించి సింహాచలం తీసుకువెళ్లాలనుకున్నాడు.

శ్రీనివాస్ స్కూటర్ నడుపుతూనే వెనుక కూర్చున్న జగదీష్‌కి తగులుతున్న ప్రదేశాలు వివరించసాగాడు.

కె. కాలనీ పోర్టుక్వార్టర్స్ నుంచి బయలుదేరి రైలుబ్రిడ్జిక్రింది నుంచి పైడిమాంబ గుడిని చేరుకున్నారు.

ఆ త్రోవ జగదీష్‌కి ఇదివరకే తెలుసు. కుడికి తిరిగితే జ్ఞానాపురం మీదుగా, చావుల మదుం కిందినుంచి పోతే వాల్తేరు వస్తుంది.

కాని శ్రీనివాస్ ఎడమవేపుకి తిప్పాడు.

"జగదీష్... మనరాష్ట్రంలో తిరుపతి తరవాత చెప్పుకోదగ్గ సింహాచలం కొండకి తీసుకు వెళుతున్నాను. ఆ వరాహన్రృశింహస్వామిని దర్శించి తరించు" అన్నాడు.

జగదీష్ సింహాచలం యాత్రాస్థలమని విన్నాడేకాని ఎప్పుడూ వెళ్ళలేదు. అతడికి యాత్రలంటే అంతఇష్టం వుండదు.

లోగడ శ్రీశైలం పిక్‌నిక్ వేసుకుని చాలామంది మిత్రులతో కలిసి వెళ్ళాడు. ఆశ్రీశైల మల్లిఖార్జునిని అందరూ భక్తిగా దర్శించుకున్నారు. జగదీష్ వాళ్ళకన్నా ఎక్కువగా ఆనందించాడు. అక్కడి వాతావరణం సుందరమైన ప్రకృతి, డామ్ ఎక్కువగా ఆకర్షించింది. అలాగే నాగార్జునసాగర్ డామ్. స్టీమర్‌మీదవెళ్ళి నాగార్జునకొండ దానిమీద మ్యూజియంచూసి తరించాననుకున్నాడు.అంతేగాని యాత్రచేసి దేవుళ్ళని దర్శించి తరించాలని ఎప్పుడూ అనుకోలేదు.

శ్రీనివాస్ అన్నదానికి నవ్వువచ్చింది.

మాట్లాడకుండా వూరుకున్నాడు. దానిపరమార్థంవేరు. యాత్రాస్థలాలను దర్శించిన ప్రజలకి వాటిని దర్శించనివారికన్నా ఎక్కువ లోకజ్ఞానం అబ్బుతుంది. విశాలదృక్పథం ఏర్పడుతుంది. అలాంటి జ్ఞానోపార్జన జరుగుతుందనే యాత్రలను పెద్దలు ఏర్పరచివుంటా




రని జగదీష్ విశ్వాసం.

స్కూటర్ ఆగింది.

ఏదో రైల్‌క్రాసింగు. రైలుగేటు మూసివుంది.

"జగదీష్... ఇది రామమూర్తి పంతులు పేట రైలుగేటు. ఈ ఎడంవేపు రోడ్డుమీద వెళ్ళామంటే గవరకంచరపాలెం వస్తుంది. ఈవెధవగేటు ఎప్పుడూ, ముఖ్యంగానేను ఎక్కడికైనా అర్జంటుగా పోతున్నప్పుడు మూసే వుంటుందిరా. నడిచేవాళ్ళు గేటుక్రిందినుంచి వంగి దూరిపోతారు. మనలాంటి వాహనం మీద పోయే వాళ్ళు, కార్లు, బస్సులూ ఆగిపోవలసిందే" అన్నాడు చిరాగ్గా.

"ఇక్కడొక ఓవర్‌బ్రిడ్జి కట్టించితే మంచిది" అని ఉచిత సలహా పారేశాడు జగదీష్.

"నిజమే... సింహాచలమే కాదు ఇంకా ఎన్నో వూళ్ళకు ఈరోడ్డుమీదనే పోవాలి. అయినా కార్పొరేషను ఈవిషయాన్ని గురించి ఎందుకాలోచించదో అర్థంకాదు" అన్నాడు.

"హైదరాబాదులో ఇలాంటి రైల్‌క్రాసింగులు ఎన్నోవున్నాయి. అక్కడంటే అన్నిటిమీదా నిర్మించడం కష్టం. కాని ఇక్కడ ఈఒక్కటీ చాలా ముఖ్యమైనదే"

ఇంతలో ఓట్రైన్ చెవులు అదిరేలాగ కూత వేసుకుంటూ అనకాపల్లి దిశగా వెళ్ళిపోయింది.

గేటు తెరుచుకుంది.

స్కూటరు ముందుకి దూసుకుపోయింది. వచ్చిన ప్రతిఊరునూ శ్రీనివాస్ వివరించాడు.

పరమేశ్వరి పిక్చర్‌ప్యాలెస్, మర్రిపాలెం, గోపాలపట్నం ఏవేవో చాలా తగిలాయి.

పెద్దవంకరతిరిగింది రోడ్డు. అక్కడ రెండు పాయలుగా చీలిపోయింది. కుడివేపుకిపోయే రోడ్డుని పట్టుకున్నాడు శ్రీనివాస్. రోడ్డుకి ఇరువేపులా కళాత్మకంగా నిర్మించిన పెద్దస్తంభాల మీద పెద్దఆర్చీమీద సింహాచలదేవస్థానం అనే బోర్డు రాసివుంది.

"ఆఎడమవేపు రోడ్డు పట్టుకుని వెళితే పెందుర్తి, కొత్తవలస, విజయనగరం, మాడుగుల వెళ్ళే రోడ్లు తగులుతాయి" అని వివరించాడు.

కుడివేపున పెద్దకొండ అదే సింహాచలం కొండ అని చెప్పాడు జగదీష్‌కి.

ఆకొండ బయలుదేరిన దగ్గరనుంచీ కుడివేపున కనిపిస్తూనే వుంది. దాని చుట్టూనే తిరుగుతున్నారు.

"ఈకొండచుట్టూ ఇంకా ఎంతదూరం తిరగాలిరా బాబూ" అన్నాడు జగదీష్.

"పిచ్చినాయనా స్కూటర్‌మీద తిరగడానికే ఇంత ఆయాసపడుతున్నావు. ఓ యాభైఏళ్ళు వెనక్కి వెళితే మనుషులు కాలినడకనే నడిచి పోయేవారు"

"బాబోయ్... దేవుడికన్నా ముందువాళ్ళ ఓపికకి పెట్టాలిరా బాబూ దండాలు" అన్నాడు జగదీష్.

స్కూటర్ కొండ దిగువనే వున్న అడివారం చేరుకుంది. అక్కడినుంచే కొండమీదికి ఎక్కడానికి మెట్లు వున్నాయి. స్కూటర్ ఆపాడు.

"పూర్వం ఎవ్వరైనా సరే నడిచిమెట్లెక్కి వెళ్ళేవారు. ఇప్పుడైతే బస్సులమీదకూడా వెళ్ళవచ్చును. స్కూటర్‌మీద కూడా పోవచ్చును. ఎలా వెళదాం" అనడిగాడు.

పచ్చని అడవిలో, దూరం చూపుననుసరిస్తున్నకొద్దీనీలంగా వున్న ఆ ప్రకృతి జగదీష్ మనస్సుని ఆకట్టుకుంది.

మరో ఆలోచన చెయ్యకుండా "నడిచే" అన్నాడు.

అక్కడే రోడ్డుపక్కన ఓవైన్‌షాపు వుంది. యాత్రాస్థలాలలో కూడా నిజంగా కావలసిన మందు దొరక్కపోయినా ఈ మందులు షాపులు బాగానే వుంటున్నాయి– అని అర్థం చేసుకున్నాడు జగదీష్.

ఆ వైన్‌షాపు ప్రొప్రయిటరు శ్రీనివాస్‌కి ఫ్రెండు. అతనికి చెప్పి స్కూటర్ కిందనే వైన్‌షాపు ఎదురుగా వదిలిపెట్టారు.

పెద్ద పెద్ద మర్రిచెట్లు.

అక్కడే కొబ్బరికాయులు, అరటిపళ్ళు, అగరవత్తులు అమ్మే ఎన్నో దుకాణాలున్నాయి.

కాస్త ముందుకి నడిచారు.

ఎదురుగా వెడల్పయిన మెట్లు.

తలపైకెత్తి చూశాడు జగదీష్.

కనుచూపుమేరదాకా కనిపిస్తూనే వున్నాయి. ఎక్కడో వంకరతిరిగి ఇంకా పైకి మరెటో పోతు న్నాయి. అబ్బా... ఈ మెట్లన్నీ ఎక్కాలాఅని భయం వేసింది. కాని మెట్లకి ఒకవైపు కొండ, మరోవైపు లోతైన లోయలు అతనిని ఆక ర్షించాయి.

ఇద్దరూ ఒకో మెట్టు ఎక్కసాగారు.

ఇరువైపులా పేరాచుట్‌వాల్‌లాంటి పెద్ద రాళ్లతో కట్టిన గట్లు ఆనుకుని, గుడ్డలు పరుచు కుని యాచకులు. ఆ గుడ్డలమీద అయిదేసి పైసలు, పదేసి పైసలు వున్నాయి.

దేశంయొక్క పేదరికం అంతా ఈ దేవాల యాల మెట్ల దగ్గరే కాపురమున్నట్లని పించింది. ప్రతి యాత్రికుడూ పది పైసలూ, అయిదు పైసలూ వేసి ఆ పేదరికాన్ని చావ కుండా పెంచుతున్నారు- అనుకున్నాడు జగ దీష్.

ఒక్కోమెట్టు ఎక్కుతుంటే ఆయాసం రాసా గింది. పది ఇరవైమెట్లు ఎక్కిన తరువాత చదునైన స్థలం వస్తుంది. దానిమీద నుంచునీ, మెల్లగా నడుస్తూ వుస్సురనుకుంటూ ఆయాసం తీర్చుకుంటున్నారు భక్తులు... కొంతమంది గుంపుగా.

"హరి హరీ నారాయణా ఆది నారాయణా కరుణించి మమ్మేలు కమలలోచనుడా"

అని పాడుకుంటూ మరీ నడుస్తున్నారు. కొందరు యువకులు గబాగబా మెట్లమీద పరుగెత్తుతున్నారు. కొందరు నడివయస్కులు, ముసలివారు పక్కనున్న గట్లమీద అలుపుతీ ర్చుకుంటున్నారు.

శ్రీనివాస్, జగదీష్ ఎక్కడా ఆగకుండా సగం దూరం ఎక్కారు.

జగదీష్ ఒగర్చుకుంటూ- "అబ్బా... అల సిపోయాన్రా! ఈ కుడివైపు గట్టుమీద కూర్చుందాం" అని వెళ్లి కూర్చున్నాడు.

గట్టు కిందికి ఒంగిచూశాడు.

కళ్లు తిరిగేటంత లోతున లోయ, రాళ్ళు, పెద్ద పెద్ద చెట్లు కనిపించాయి. దూరందాకా దృష్టిని సారించాడు. దూరంగా పొలాలు, చె ట్లు, వూళ్లూ బొమ్మరిళ్లలాగా కనిపిస్తున్నాయి. మెట్లకి అటూ ఇటూ చిట్టడివి.

ప్రకృతి సౌందర్యమంతా ఈ కొండలోయ ల్లోనే వుందేమో. ఈ సౌందర్యానికి మురి సిపోయే దేవుళ్లిక్కడ వెలిశారేమో!

గట్టుమీద లోయలవేపు ముఖంపెట్టి కూర్చుని "ఏమిటో అనుకున్నాన్రా శ్రీనివాస్... థాంక్స్ ఫర్ బ్రింగింగ్ మి హియర్. ఎంతో ఆహ్లాదకరమైన ప్రకృతి. నా విచారమంతా పటాపంచలైపోయిందిరా! ఆహా... ఎంత చల్ల నిగాలి. ఎంత హాయి అనిపిస్తున్నదో. ఇలాంటి గాలి పీలిస్తే వున్న జబ్బులన్నీ ఎగిరిపోతాయి" అని వాతావరణాన్ని మెచ్చుకోసాగాడు.

"నిజం చెప్పావు. ఈ సింహాచలం కొండ మీద సంజీవి తుప్పలున్నాయని అంటారు. అదే నిజమైతే ఈ గాలి పీల్చినవారికి జబ్బు లు నయంకాకేం చేస్తాయి"

"సంజీవి వున్నదని ఎలా చెప్పగలం?" అని ప్రశ్నించాడు జగదీష్.

"ఈ కొండమీద కట్టెలేరుకునేవారికి ఏ పుల్ల లు రక్కుకున్నా లేక కాళ్లకి రాళ్లు తగిలి కొట్టుకుపోయినా, చిన్న చిన్న గాయాలైనా కొండ దిగేసరికి నొప్పి వుండదట. మరునాటికే గాయాలు, మచ్చలు మాయమైపోతాయని ఇక్కడి జానపదులు చెబుతారు" అని తను చిన్నప్పట్నుంచీ విన్నది చెప్పాడు.

"అలాంటి కథలు నమ్మవచ్చునంటావా?" అనుమానంగా ప్రశ్నించాడు జగదీష్.

"నమ్మడం, నమ్మకపోవడం అనేది మన ఇష్టం. కొన్ని విషయాలకి నమ్మకం ముఖ్యం. నమ్మకపోతే ఏదీ లేదు. పురాణాలు రామాయణా నికి, ఈ సింహాచలం కొండకీ ముడిపెడుతు న్నాయి. రామాయణంలో లక్ష్మణుడికి- రావణు డి కొడుకు ఇంద్రజిత్తుకి యుద్ధం జరుగు తుంది. ఇంద్రజిత్తు శరఘాతానికి లక్ష్మణుడు మూర్ఛిల్లిపోతాడు. సంజీవి పుడకలు తెమ్మని హనుమంతుణ్ని జాంబవంతుడు పంపుతా డు- అంతవరకు తెలుసుగదా. ఈ పూర్వాద్రి పర్వతాలమీదినుంచే సంజీవిపుడక ఏదో తెలి యక పర్వతాన్నే లేపుకుపోయాడట హను మంతుడు. ఈ పర్వతశ్రేణుల మీదనే ము ఖ్యంగా సింహాచల కొండలమీదనే సంజీవి వున్నదని పురాణాలు చెబుతున్నాయి"

జగదీష్‌కి మరింత ఆశ్చర్యం, ఆసక్తి కలి






గింది కొండమీద. మరోమారు ఆ చిట్టడవుల వేపు చూశాడు. కిందిదాకా పరికించాడు. కింద అడవిలోయాగానే పెద్ద పెద్ద చెట్లు. అందుకే అడవివారం అన్నారేమో ఆ వూరిని. అది కాస్తా అడివారం అయికూర్చుంది అనుకున్నాడు.

"సంజీవి పుడకలు నిజంగా వుంటే ఇంత కాలం వూరుకుంటారా ఎవరైనా! ఈపాటికి తెలుసుకోరా? శ్రీనివాస్?" ప్రశ్నించాడు.

"ఎందుకూ నువ్వు ప్రయత్నిస్తావా? కాకులకి ఆ సంజీవి పుడకలు తెలుసునట. అవి పుల్లలతో గూళ్ళు పెట్టుకునేటప్పుడు ఒక

సంజీవి పుల్లని కూడా గూటిలో పెడుతుందట. తను పొదిగిన పసికూనలు అటూ ఇటూ కదిలినప్పుడు ఆ ఎర్రని కండలకు గాయాలైతే అది మందుగా పనిచేస్తుందని, అవి బతుకుతాయని అలా పెడుతుందట'' అన్నాడు.

''అయితే ఇంకేం అడవంతా తిరగకుండా కాకిగూళ్లు గాలిస్తే దొరికిపోతుందన్నమాట''

''ఆ! ఇక్కడ ఓ కాకిగూడుని నువ్వు తీసుకో. ఆదివారం అమావాస్యరోజున అర్ధరాత్రి వివస్త్రుడవై మొలతాడు కూడా పీకేసి తూర్పుదిశగా పారే నిర్మలమైన నీటిలో వదులు. అందులో గనక సంజీవిపుడకే వుంటే అది ఎదురీదుతుందట. దానిని ముట్టుకోవడానికి ప్రయత్నిస్తే వన్నాగమై బుసలుకొడుతుందిట. ధైర్యంచేసి చేజిక్కించుకుంటే సంజీవి పుడక దొరికినట్లే. ఏం ప్రయత్నిస్తావా? అలా ఓ వందగూళ్లు, వంద ఆదివారాలు అమావాస్యరోజుల్లో ప్రయత్నిస్తే ఒక్కదాంట్లోనైనా సంజీవిపుడక వుండకపోదు. ఉద్యోగం సద్యోగం మానేసి ఆ పని చెయ్యరాదూ. భిషక్ రత్న బిరుదాంకితుడవై ఆబాల గోపాలాన్ని జరాతాడితపీడిత జనాన్ని ఆదుకోవచ్చును'' అని కాస్త వ్యంగ్యాన్ని జోడిస్తూ చెప్పాడు శ్రీనివాస్.

''బాబోయ్ అంతపని నావల్లగాదు. మనం వచ్చినపని చూసుకుందాము. ఈ మన రామాయణంలో ఆ పుడకలవేట వద్దు'' అనేశాడు.

ఇద్దరూ నవ్వుకుంటూ మళ్ళీ బయలుదేరారు.

వాళ్ళ అలసట తీరడమేకాదు. ఎంతో బలంచేకూరినట్టయింది.

ఒకోమెట్టూ ఎక్కసాగారు. ఎంత ఎక్కినా తరగడంలేదు. బరువుమోసేవాడికి గమ్యం చేరువవుతున్నకొద్దీ ఆ బరువు పెరుగుతున్నట్లుంటుంది. అలాగే రానురాను ఆమెట్లు మరింత ఎత్తుగా ఏటవాలుపెరిగిపోయింది.

పూర్వపురోజుల్లోనే ఇంత పెద్దకొండ ఎక్కడానికి ఈ మెట్లు ఎలాగనిర్మించారో. ప్రజల్ని పన్నులకోసం పీడించి దండించినా ఆనాటి రాజులు కొన్నయినా మంచిపనులే చేశారు అనుకున్నాడు.

ముందుగా హనుమంతుడి గుడి తగిలింది.

అక్కడే ఆకాశధార.

నిజంగానే పేరుకితగ్గట్టు ఎంతో ఎత్తునుంచి దిగజారుతుంది.

చాలామంది భక్తులు. ఆ ధారకింద స్నానం చేస్తున్నారు. ఆ తడిసిన బట్టలతో మళ్ళీ హనుమంతుణ్ని దర్శనం చేసుకొని హరిహరినారాయణ కీర్తనలు పాడుకుంటూ ముందుకి సాగిపోతున్నారు.

''ఏరా... నువ్వూ ఆకాశధారస్నానం చేస్తావా?'' అడిగాడు శ్రీనివాస్.

''ఒద్దుబాబూ... ఇలాగే చూసి ఆనందించనియ్యి. తడిసిగడగడా వణికేకన్న ఇలా చూడటంలోనే హాయివుందినాకు'' అనేశాడు.

శ్రీనివాస్ కూడా స్నానం చెయ్యలేదు.

ఎలాగైతేనేం మెట్లన్నీ ఎక్కి ఒక సమతల ప్రదేశాన్ని చేరుకున్నారు. చుట్టూ కొండలు ఏపుగా ఎదిగిన చెట్లు. ఒకవేపు బంగారుశిఖరంలో వరాహనృసింహస్వామి ఆలయం. మరోవైపు కొత్తగా నిర్మించిన హైపవర్ ట్రాన్స్‌మిటర్ ఏంటెనాటవర్ కనిపించాయి. సనాతన, అధునాతన నిర్మాణాలు తలలెత్తి నింగిని చుంబిస్తున్నాయి.

కొండమీద కూడా మామిడిచెట్లు, ముఖ్యంగా సంపంగి చెట్లు ఏపుగా పెరిగివున్నాయి. సంపంగి పువ్వు సుగంధ సౌరభం ముక్కుపుటాలను తాకుతూంది.

దేవాలయంపైన నిర్మించిన బంగారు గోపురంపై ఉదయభానుని అరుణకిరణాలు పడి దానిసోయాగాలను ద్విగుణీకృతం చేస్తున్నాయి

ఆలయం చేరుకున్నారు.

చెప్పులు విడిచి లోన ప్రవేశించారు. గుడిలోన చుట్టూ విశాలమైన ప్రాంగణం. భక్తులు ఆ ప్రాంగణంలో తిరుగుతున్నారు.

అబ్బ ఎలాంటి రాతికట్టడం. ఎంత శిల్పచాతుర్యం. ఈ శిల్పుల జీవితం ధన్యంకదా. కనులున్నవారు చూసి తరించవలసింది ఆ శిల్పుల కళాకౌశలం. దక్షిణాదినగల యాత్రాస్థలాలలో ఎంత శిల్పసంపద. రామప్ప దేవాలయం చూశాడు తను.




"రాలలోపల పూలు పూసిన రామమందిర లీల"

"ఈ నల్లనిరాలలో ఏ కన్నులు దాగెనో, ఈ బండల మాటున ఏ గుండెలు మ్రోగెనో' అనే గేయాలు మదిలోమార్మోగాయి.

గర్భగుడిలోని వరాహనృసింహమూర్తిని దర్శించుకున్నారు. దేవుడిమేను పూర్తిగా గంధంపూసి వుంది. గంధం ఇలువుకి మాత్రమే విగ్రహదర్శనం అవుతుందని శ్రీని వాస్ చెప్పారు.

పురోహితుడు తీర్థం ఇచ్చాడు. మంత్రాలు వల్లిస్తూ శఠగోపం తలలమీదపెట్టాడు.

శ్రీనివాస్ వరహనృసింహమూర్తిని మనస్సు లోనే ధ్యానించుకున్నాడు.

జగదీష్ చేతులు అసంకల్పితంగా లేచిపో యాయి. దండంపెట్టాడు.

ప్రసాదం కొన్నాడు శ్రీనివాస్.

ఇద్దరూ ఆలయం చుట్టూ తిరిగారు. ఆలయం వెనక నృసింహావతారం చెక్కబడి వుంది. ద్వారం మీద హిరణ్యకశిపుణ్ణి ఉగ్రనర సింహమూర్తి పేగులు చీల్చిన దృశ్యం అది.

ఇద్దరూ ఆలయంలోనుంచి మెట్లు దిగివ చ్చారు. చెప్పులు వేసుకుని కొంత దూరం నడిచి అనువైనచోట కూర్చున్నారు. ప్రసాదం కళ్ళకద్దుకుని తిన్నారు.

అక్కడ చూపించవలసినవి ఇంకా చాలావు న్నాయి. పుట్టుదార అదీ చూపించాలనుకున్నా డు శ్రీనివాస్.

కానీ, జగదీష్ ఆసక్తికనవరచలేదు.

"ఏరా జగదీష్... వెళ్ళడం కూడా మెట్లమీ దినుంచే దిగివెళదామా?" అడిగాడు.

"వద్దు... బస్సులో పోదాం" అన్నాడు.

నరే... అని కొండమీది బస్‌స్టాప్ దగ్గరికి నడిచారు. బస్ రెడిగావుంది.

కాసేపట్లోనే బయలుదేరింది. మలుపులు తిప్పుకుంటూ కొండ దింపుకు వచ్చింది.

అడివారంలో దిగారు.

రాజుగారు ఎంతవద్దంటున్నా వినకుండా రెండు కూల్‌డ్రింక్స్ ఫ్రిజ్‌లోనుంచి తీసియి చ్చారు.

తాగారు. అలసటతీరి ఎంతోహాయి అని పించింది.

సెలవుతీసుకుని బయలుదేరారు.

శ్రీనివాస్‌కి జగదీష్‌ని ఏదైనా పిక్చర్‌కి తీసు కువెళ్ళాలని వుంది.

ఇంటికి వెళ్ళి భోజనం చేసి వెళ్ళాలాలేక ఏదైనా హొటల్‌లో భోజనం చెయ్యాలా అని ఆలోచిస్తూ స్కూటర్ నడుపుతున్నాడు.

"హల్లో... శ్రీనూ" అంటూ స్కూటర్‌కి అడ్డం వచ్చాడోవ్యక్తి.

"హల్లో విజయ్... ఏమిటిసంగతి! ఈవేళ సెలవుపెట్టావా?"

"ఊ... మానాన్నగారికి ఒంట్లో బాగాలేదు. డాక్టరుగారికి చూపించాలని పెట్టాను. నౌ హి ఈజ్ ఆల్‌రైట్' అన్నాడు.

శ్రీనివాస్ "మీట్ మై ఫ్రండ్ జగదీష్. హైదరాబాదులో వుంటాడు. జగదీష్... హి ఈజ్ మిస్టర్ విజయకుమార్— మై బెస్ట్ ఫ్రెండ్. కోరమండల్‌లో ఉద్యోగం" అని ఇద్దరి కీ పరిచయాలు చేశాడు.

"శ్రీనూ... ఇల్లు కట్టిన తరువాత ఎప్పుడూ రాలేదు. ఈరోజు నిన్ను వదలను— కమాన్' అని బలవంతంచేశాడు.

విజయకుమార్ శ్రీనివాస్ బాల్యస్నేహితు డు. విశాఖపట్టణం సిటీలోకి ఆదివారంరోజు అప్పుడప్పుడూ వస్తూవుంటాడు. వీలున్నప్పుడ ల్లా శ్రీనివాస్ ఇంటికి వెళుతూ వుంటాడు.

విజయకుమార్ నాన్నగారు ఇంజనీరుగా పనిచేసి ఆమధ్యనే రిటైరయ్యారు. కాంట్రాక్టర్ల దగ్గర ఏనాడూ లంచాలు తీసుకోలేదు. కాని వర్కుమాత్రం గట్టిగా వుండాలని పట్టుబట్టేవా డు. అందుకే రిటైరయ్యేదాకా ఓ ఇల్లయినా కట్టించుకోలేకపోయాడు. ఎప్పుడో ఓ కూతురి పెళ్ళిచేశాడు— అంతే! రిటైరవగా వచ్చిన డబ్బుతో వరాహనృశింహమూర్తి పాదాలచెంతనే అడివారంలో ఓ చిన్న ఇల్లు కట్టించుకున్నాడు.

విజయకుమార్‌కి ఆ సింహాద్రిఅప్పడు దయవల్లే ఉద్యోగం దొరికిందంటారాయన. ఇల్లు కట్టిన తరవాత కొడుకు పెళ్ళిచేశాడు. హాయిగా రోజులు గడిచిపోతున్నాయి.

శ్రీనివాస్ జగదీష్ ముఖంలోకి చూశాడు.

కొత్తవాళ్ళతో అంత తేలికగా కలవడు జగ

దీప్. ఇళ్ళకి వెళ్ళడం అసలే ఇష్టంవుండదు. అందుకే ఏమంటాడోనని ముఖంలోకి చూశాడు.

విషయం అర్థంచేసుకున్నాడు విజయకుమార్.

"రండిసర్.... శ్రీను, నేను ఒకటే. తనువులు వేరైనా మనసొకటే...సారీ-- చిన్న సవరణ... మా మనస్సులు ఒక్కలాంటివే" అని జగదీప్‌ని ప్రత్యేకంగా ఆహ్వానించాడు.

జగదీప్‌కి అతని నడవడిక నచ్చింది.

వెళ్ళక తప్పలేదు.

రోడ్డు పక్కనేవుంది ఇల్లు.

ఇల్లు చిన్నదైనా చుట్టూ విశాలమైన స్థలం. పూలమొక్కలూ అవీ వేశారు.

వెళుతూనే వరండా

నాలుగు కేన్ ఛైర్లు,వాటిమీద కుషన్‌సీట్లు వున్నాయి. మధ్య టీపాయ్. ఎంతో పరిశుభ్రంగా వున్నాయి.

శ్రీనివాస్‌కి వాళ్ళింటిలో అందరితోటీ పరిచయం వుంది. తనే లోనికి వెళ్ళిపోయాడు.

"నమస్కారంసార్" అని మంచంమీద పడుకున్న విజయకుమార్ నాన్నగారిని పలకరించాడు.

బయటి వరండాలోనే కూర్చుండిపోయాడు జగదీప్.

"ఫరవాలేదు-- రండి జగదీప్‌గారూ! మా ఇంట్లో ఘోషా సిస్టంలేదు" అని లోనికి ఆహ్వానించాడు.

ఇల్లంతా చూపించాడు.

బెడ్‌రూమ్‌లో రెండు మంచాలు. నీట్‌గా బెడ్‌షీట్లు పరిచివున్నాయి. శుభ్రమైన దిండ్లు-- వాటిమీద తొడిగిన గలీబులు.

ఒక టేబుల్, రెండు కుర్చీలు వున్నాయి. వెనకవేపున పెద్దహాలు. ఆ హాలుని ఆనుకుని ఒకవేపున మరో చిన్న బెడ్‌రూమ్. మరోవేపున కిచెన్ వున్నాయి.

వెనక పెరడువుంది. ఎత్తయిన ప్రహరీ కట్టించారు. ఆ ప్రహరీని ఆనుకునే బాత్‌రూమ్, టాయ్‌లెట్ కట్టించారు.

పెరట్లో కూరగాయలు కూడా పండిస్తున్నారు. వంగ, చిక్కుడుపాదు, ఓ జామ చెట్టుకూడా వున్నాయి.

జగదీప్‌కి ఇల్లు నచ్చింది. సిటీకి దూరంగా వుంటే ఇదే అడ్వాంటేజ్. తక్కువఖరీదుతో పెద్ద స్థలం కొనుక్కోవచ్చును. ఇల్లు చిన్నదైనా మొక్కామోదూ పెంచుకోవచ్చును. చిన్నస్థలంలో లంకంత ఇల్లు కట్టించి ఉన్న డబ్బంతా ఇంటిమీద పెట్టి అద్దెలకి మనుషుల్ని వెతుక్కుంటే బాధపడేకన్నా సరిపడ్డంత ఇల్లు వుండటానికి కట్టించుకుంటేనే మంచిది అనిపించింది.

సెలవురోజున శుభ్రంగా తినేమూడ్‌లో వుంటాడు విజయకుమార్. విజయకుమార్ అమ్మగారు లోపలిగదిలో వంటచేస్తున్నారు.

ఆకలి కలిగించే చక్కని వాసన వేస్తున్నాయి వంటగదిలోంచి.

జగదీప్‌ని అందరికీ పరిచయం చేశాడు విజయకుమార్.

ఆ మాటా ఈ మాటతో అరగంట అయిపోయింది.

అప్పటికే ఒంటిగంట కాబోతోంది.

వచ్చిన వెంటనే వాళ్ళమ్మకి ఏదో పురమాయించాడు విజయకుమార్.

ఏ కాఫీనో టీయో ట్రేలో వస్తుందని ఎదురు చూశారు.

కాని ఒక్కమారే భోజనానికి పిలుపువచ్చింది.

జగదీప్ ఇబ్బందిగా ఫీలయ్యాడు. ఆయాచితంగా ఎవ్వరింట్లోనూ గెస్టుగా భోజనం చేయడం ఇష్టం వుండదు. వాళ్ళు చేసుకున్న దాంట్లోనుంచి గెస్టుకిపెట్టి వాళ్ళు సర్దుకుంటారు. ముందుగా ఆహ్వానిస్తే ఆ సంగతి వేరు.

శ్రీనివాస్‌కీ ఇష్టంలేదు.

కాని విజయకుమార్ ఇలాంటి అవకాశంకోసమే ఎదురుచూస్తున్నాడులావుంది. భల్లూకం పట్టుపట్టాడు.

"మరోసారి వస్తానులేవోయ్-- ఇంట్లో మా ఆవిడ చూస్తూ వుంటుంది. జగదీప్‌కూడా వున్నాడు. అని చెప్పి చూశాడు.

"ఏం... జగదీప్ వుంటే యేం?" అన్నాడు.

ఇంతలో విజయకుమార్ అమ్మగారు బయ




టిక వచ్చారు.

"రండి బాబూ! డైనింగ్‌టేబుల్‌మీద అన్నీ నర్దేశాం. మావాడు వస్తూనే మరికొంచెం అన్నం వండమన్నాడు– వండేశాం. మాకేం ఇబ్బంది లేదు... రండి రండి" అని తొందరచేసింది.

తప్పలేదు.

అయిష్టంగానే భోజనానికి లేచినా ఇష్టంగానే తిన్నారు. విజయకుమార్ పొళ్ళు, పచ్చళ్ళు వడ్డించి నెయ్యి పోసేస్తూ మిత్రులిద్దరిచేతా బాగా తినిపించాడు.

చేతులు కడుక్కుని లేచారు.

టవల్ అందించింది విజయకుమార్ తల్లి.

"మొత్తానికి భలే పనిచేశావోయ్" అన్నాడు శ్రీనివాస్.

భుక్తాయాసం తీరేదాకా కూర్చుని బయలుదేరి వెళ్ళిపోదాం అనుకున్నారు.

వక్కపొడి డబ్బా వచ్చింది.

జగదీష్‌కి భోజనం తర్వాత వక్కపొడి అలవాటు. ప్రాణం లేచివచ్చినట్లయింది. ముగ్గురూ రెండేసి వక్కపలుకులు వేసుకున్నారు.

లోకాభిరామాయణం మొదలైంది.

రాజకీయాలు, సినిమాలు– ఇంకా ఎన్నో విషయాలు దొర్లాయి.

చూస్తూ చూస్తూ వుండగానే సాయంత్రం నాలుగు గంటలైంది.

మళ్ళీ లైట్‌గా టిఫిన్, టీ చేసి వంపించారు.

ఆడవాళ్ళ శ్రమ అర్థంకాదు. వాళ్ళది అంతులేని గృహపరిశ్రమ. ఏ పరిశ్రమ మూతపడినా పడుతుందేమోగాని ఇది మూతపడదు. నోరూ– కడుపూ వున్నంతకాలం నోరు మూసుకుని పనిచెయ్యాల్సిందే. మళ్ళీ అంట్లు తోముకుని రాత్రికి వంట చేసుకుంటారు– పాపం, అనుకున్నాడు జగదీష్.

అందరిదగ్గరా సెలవు తీసుకుని బయలుదేరారు.

స్కూటర్ మళ్ళీ బయలుదేరింది.

"జగదీష్... ఏదైనా సినిమాకెళదాం" అన్నాడు.

"ఎందుకులెద్దూ– వెధవసినిమాలు. తెలుగు సినిమాలన్నిటికీ ఒకటే కథ. ఆ కథనే మార్చి మార్చి తీస్తారు. కథతో నంబంధం లేకుండా పాటలు, డాన్సులకోసం డాన్సులు, ఫైట్స్‌వుండాలిగాబట్టి ఫైట్స్, బాబోయ్– చాలాసార్లు దొరికిపోయాను. ఈమారు దొరకదలచుకోలేదు" అన్నాడు భయంగా.

"ఎవ్వరు చెప్పినా ఇదేమాట. అయినా నిర్మాతలు అలాంటి సినిమాలే తీస్తున్నారు. ఒకపక్కన ఫ్లాప్ అవుతూనే వున్నాయి. అయినా చేతులు కాల్చుకుంటున్నారు పాపం" అన్నాడు జాలిగా శ్రీనివాస్.

"అందుకే ఇంటికిపోదాం" అన్నాడు జగదీష్.

జగదీష్ ఏ కారణంగానైతేనేం వచ్చాడు. ఈ ట్రిప్ జ్ఞాపకం వుండిపోవాలి. మళ్ళీ ఎప్పుడు వస్తాడో. ఇంట్లో కూర్చుని ఏంచెయ్యాలి.

"సరే... తెలుగు సినిమాలకో దండం. ఏదైనా ఇంగ్లీషు సినిమాకి వెళదాం పద" అన్నాడు.

ఇక తప్పదని "సరే" అని ఒప్పుకున్నాడు.

"పద– లీలామహల్ చూద్దాం" అని అటు వెళ్ళారు.

సినిమా మొదలైంది. అంతే! వాళ్ళని వాళ్ళు మరిచిపోయారు.

ఆ సినిమాలో ఓ ట్రక్కు, ఓ కారు నటించాయని చెప్పవచ్చును. ఎంత సస్పెన్స్, ఎంత థ్రిల్!

అంత మంచి సినిమా మళ్ళీ చూడలేం అనుకున్నారిద్దరూ.

ఇంటికి బయలుదేరారు.

"అలాంటి సినిమా మన తెలుగువాళ్ళు తియ్యగలరా?" అడిగాడు శ్రీనివాస్.

"తియ్యగలరు" అన్నాడు జగదీష్.

ఆశ్చర్యంగా నోరు వెళ్ళబెట్టాడు శ్రీనివాస్.

"ఎప్పుడని అడగవేంరా?" అని ప్రశ్నించాడు మళ్ళీ.

"ఎప్పుడూ?" అడిగాడు.

"ఏడు జన్మలెత్తిన తరవాత" అని సమాధానం చెప్పాడు జగదీష్.

"కరెక్ట్... నీ రీజనింగు బాగుంది. అప్పటికి మన తెలుగు ప్రేక్షకులు కూడా కళ్ళు తెరుస్తారు. సాహిత్యంలోనూ మార్పులు వస్తాయి. దౌర్జన్యాలు ప్రతీకారం, పగ–ద్వేషం తప్పితే ఏముంది ఈనాటి సాహిత్యంలో మాత్రం" అని తన అభిప్రాయం చెప్పాడు.

ఇల్లు చేరుకునేసరికి తొమ్మిది గంటలయింది.

ముఖం, కాళ్ళూ చేతులూ కడుక్కుని భోజనానికి కూర్చున్నారు.

అంతలోనే గేటు చప్పుడయింది.

"ఇంజనీర్ శ్రీనివాస్ ఇల్లు ఇదేనా?" అడుగుతున్నారెవరో రోడ్డుమీదివారిని. డైనింగ్ టేబుల్‌మీద జగదీష్ సరసన కూర్చున్న శ్రీనివాస్ చెవులకి నిశ్శబ్దాన్ని చీల్చుకుని వచ్చి వినిపించాయి.

బయటికి వెళ్ళాడు.

వీధి దీపాల వెలుగులో ఎవరో ఆటోవాడికి డబ్బులిస్తున్నారు.

వెనక్కి తిరిగాడా వ్యక్తి.

చలపతిరావుగారు!

శ్రీనివాస్‌కి కాసేపు నోరు పెగలలేదు ఆశ్చర్యంతో– మాట తడబడింది. ఆ మరునాటి ఉదయం గోదావరిలో దిగవచ్చుననుకున్నాడు.

సంతోషంగా "నమస్కారం... రండి రండి" అని లోనికి ఆహ్వానించాడు.

ఎవరో ఫ్రెండ్ వచ్చివుంటాడనుకున్న జగదీష్‌కు కాసేపట్లో శ్రీనివాస్‌తో మాట్లాడుతున్న నాన్నగారి గొంతు వినిపించింది. గుండె లయ తప్పినట్లయింది.

అనుకోని సంఘటన!!

తనేవెళ్ళి క్షమాపణ చెప్పుకోవాలనుకున్నాడు.

నాన్నగారిని వెళ్ళి ఆశ్చర్యంలో ముంచుదాం అనుకున్నాడు. కాని తననే ఎంతో ఆశ్చర్యంలో ముంచేశారు.

తియ్యని నాన్నగొంతు.

గబగబా బయటికి వచ్చాడు.

వరండా వెలుగులో తనకి ఊపిరిపోసిన దేవుడు.

"నాన్నా..." తలవంచుకునే పలకరించాడు.

చలపతిరావుగారు కొడుకుని చూసి చిరునవ్వునవ్వారు.

"కాళ్ళు కడుక్కునిరండి" అని బాత్‌రూమ్ చూపించాడు శ్రీనివాస్.

ముఖప్రక్షాళనం చేసుకుని కాళ్ళుకడుక్కుని వచ్చారు.

"రండి... కలిసే భోజనం చేద్దాం. నేనూ, మీ జగదీష్ ఇప్పుడే సింహాచలం వెళ్ళి, సినిమా చూసి ఇల్లు చేరుకున్నాం. భోజనాలకి ఇలా కూర్చున్నామో లేదో మీరు వచ్చారు" అన్నాడు.

"శారదా... మామయ్యగారికి కూడా వడ్డించెయ్యి" అజ్ఞజారీచేశాడు.

ముగ్గురూ భోజనం పూర్తిచేశారు.

చేతులు కడుక్కున్నారు.

హాల్లో కూర్చున్నారు.

"ఎన్ని గంటలకి బయలుదేరారు అంకుల్?" అడిగాడు శ్రీనివాస్.

"నీవిచ్చిన టెలిగ్రామ్ నిన్నరాత్రి పదిన్నర ప్రాంతంలో అందిందోయ్! అప్పటిదాకా వీళ్ళమ్మా, నేనూ పచ్చిమంచినీళ్ళు కూడా ముట్టుకోలేదు. నిజంగా నువ్వు మా ప్రాణాలు కాపాడావనుకో. ఇద్దరం సంతోషించాం. నిన్న మధ్యాహ్నం వండిందే తిన్నాం. ఉదయమే ఈస్ట్‌కోస్టులో బయలుదేరి వచ్చాను" అని ముగించారు.

జగదీష్ ఖిన్నవదనంతో నాన్న చెప్పింది విన్నాడు. ఎంతో పశ్చాత్తాపపడ్డాడు. తాను నిజంగా మూర్ఖుడు. తల్లిదండ్రులను పస్తుపెట్టిన దుర్మార్గుడు– అనుకున్నాడు.

"అసలేం జరిగిందంకుల్! వీడికెందుకింత కోపంవచ్చిందనుకుంటున్నారు?" అడిగాడు.

"ఏంలేదు– వడ్లగింజలో బియ్యపుగింజ. మూడురోజులక్రితం వీడో అమ్మాయిని తీసుకువచ్చాడు. మాకు పరిచయంచేశాడు. ఆ పిల్లది మా కులంకాదని ఆ పిల్లేచెప్పింది. ఆ పిల్లని చేసుకుంటానన్నాడు. నాకు కులాలపట్టింపు లేకపోయినా మీ అత్తకుంటుందిగదా! ఆమె




విశ్లేదు అంది. విడు గదిలోకి పోయి తలుపు లు బిడాయించుకున్నాడు. తెల్లారే ఓ ఉత్తరం ముక్కరాసి ఇలాగ వచ్చేశాడు. ఎదిరించి, బెదిరించి అనుకున్నది సాధించాలిగాని ఇలా పిరికివాడిలాగా పరిగెత్తుకొచ్చేస్తారా ఎవరైనా... నువ్వేచెప్పు శ్రీనివాస్?'' అని జరిగింది మూడు ముక్కల్లో చెప్పారు చలపతిరావుగారు.

శ్రీనివాస్‌కి అసలు విషయం అర్థమైంది. ఆరాత్రి తమ మాటల్ని కొడుకు విన్నాడనే విషయం చలపతిరావుకి, నిర్మలాదేవికి తెలియదని వెల్లడైంది. అది వారి కుటుంబవిషయం. వాళ్ళే తేల్చుకుంటారు. తాను మధ్యలో కలిగించుకోకూడదు. తండ్రీకొడుకుల్ని మళ్ళీ కలపాలనుకున్నాడు— కలిపాడు... అంతే! తన బాధ్యత తీరింది అనుకున్నాడు.

అప్పటికింకా వడ్డన పూర్తికాలేదు.

శ్రీనివాస్ లేచాడు. జగదీష్‌ని బయటికి పిలిచాడు. వాకిట్లోకి లాక్కెళ్ళాడు.

జగదీష్ వాళ్ళమ్మ మీదా, తనమీదా ఏవో అబద్ధాలు కల్పించి చెప్పివుంటాడని మందలించడానికి తీసుకువెళ్ళివుంటాడని అనుకున్నాడు చలపతిరావు.

ఇద్దరూ కాస్తదూరంగా నడిచివెళ్ళారు.

''ఒరే జగదీష్... ఆ రాత్రి మీ అమ్మానాన్నా అనుకున్న మాటలు నువ్వు విన్నట్లు వాళ్ళకి తెలియదు. దయచేసి ఆ విషయాలేవీ ఇక్కడ ఎత్తకు. మీ ఇంటికి వెళ్ళిన తరవాత ఏకాంతంలో మీలో మీరు తేల్చుకోండి. మా ఇంట్లో కూడా నేనెవ్వరికీ చెప్పలేదు... చెప్పదలుచుకోలేదు. ఈ రహస్యం నాలో దాచుకుంటాను'' అన్నాడు.

శ్రీనివాస్ వ్యక్తిత్వానికి మనస్సులోనే జోహార్లు అర్పించాడు జగదీష్. ఇలాంటి ఒక మిత్రుడుంటే చాలు— జీవితం ధన్యమైనట్లే, బతుకు పండినట్లే అనుకున్నాడు. నిజానికి ఇక్కడ తనకి ఆవిషయం ఎత్తాలని లేదు. శ్రీను పొరపాటున నోరు జారతాడేమోనని భయపడ్డాడు. అలాగే నాన్న ముఖం మీద ''జగదీష్ మీ కడుపున పుట్టలేదటగదా అనడిగితే'' ఆయన భరించగలరా— చిన్నబుచ్చుకోరూ?

''థాంక్సురా శ్రీనూ! నువ్వు చెప్పినట్లే చేస్తాను. ఈ రహస్యం నీలోనే దాచుకో. అసలు సంగతి నీకు తరవాత మనం కలుసుకున్నప్పుడు చెబుతాను'' అన్నాడు.

ఇద్దరూ లోనికి వెళ్ళారు.

''ఏమిటి... స్నేహితులిద్దరూ గుసగుసలాడుకుంటున్నారు? మామీద మావాడేమన్నా చాడీలు చెప్పాడా?'' అడిగారు చలపతిరావుగారు.

''అలాంటిదేమీ లేదంకుల్! ఇక్కడికి వచ్చిన తరువాత తన పొరపాటు తెలుసుకున్నాడు జగదీష్! వీడికి చెప్పకుండానే మీకు టెలిగ్రామ్ ఇచ్చాననుకోండి. కాని ఈరోజు ఉదయం వీడంతటవీడే మీ దగ్గరికి వచ్చెయ్యాలనుకున్నాడు నేనే ఆపాను. క్షమించమంటున్నాడు'' అని చెప్పాడు.

''ఇందులో క్షమించరానంత తప్పువాడేమీ చెయ్యలేదు. ఇష్టమైన అమ్మాయిని ప్రేమించడం తప్పెలాగవుతుంది. కాని నా కొడుకైవుండికూడా పరిస్థితులను ఎదుర్కోకుండా ఇలా పారిపోయిరావడం మాత్రం నాకు నచ్చలేదు— అంతే'' అన్నాడు.

జగదీష్ అందుకున్నాడు.

''పొరపాటే... నన్ను క్షమించండి నాన్నా! ఇక మీద ఇలాంటి పొరపాటు జరగదు. చూడండి... అమ్మని ఎలా ఒప్పిస్తానో, నమతని ఎలా పెళ్ళి చేసుకుంటానో'' అన్నాడు.

''ఆ... అలాగుండాలి. నేను దేన్నైనా క్షమిస్తానుగాని పిరికితనాన్ని క్షమించను'' అని కొడుకు వీపు నిమిరాడు.

భోజనాలు ముగించారు.

''టి.వి. వెయ్యమంటారా?'' అడిగాడు శ్రీనివాస్

''వద్దు... వార్తలు కూడా అయిపోయివుంటాయి— పడుకుందాం'' అన్నాడు.

''శ్రీనూ... మమ్మల్ని పొద్దున్నే ఏఫ్లైట్‌లోనైనా హైదరాబాదు పంపించెయ్యాలయ్యా'' చెప్పారు.

''ఎందుకంకుల్... మా ఇల్లు, మా విశాఖపట్నం మీకు నచ్చలేదా?'' అన్నాడు నిష్ఠూరంగా.

''అంతమాటనకు. మరోసారి అందరం వస్తాం. మీ అత్త మేమిద్దరం కంటపడేవరకూ భయపడుతూనే వుంటుంది'' అన్నాడు దిగు

లుగా.

"అత్తయ్యను కూడా మీతో తీసుకురావల సింది. సరేలెండి... రేపు గోదావరిలో ఎక్కించే స్తాను" అని ఒప్పుకున్నాడు.

ఆ రాత్రి జగదీష్, చలపతిరావు ఒక గదిలో చెరోమంచంమీదా నిద్రపోయారు.

మరునాడు శ్రీనివాస్ స్కూటర్‌మీద చలప తిరావుగారికి విశాఖపట్నం అంతా తిప్పి చూ పించాడు.

జగదీష్ ఇంట్లోనే వుండిపోయాడు. పత్రిక లు చదివాడు. టివిలో క్రికెట్ మ్యాచ్ చూశాడు.

ఎలాగైతేనేం మధ్యాహ్నం భోజనాలు అవీ చేసి కాస్సేపు విశ్రాంతితీసుకునే సరికి మూడు గంటలైంది.

గోదావరి పట్టుకోవడానికి బయలుదేరారు.

ఇంట్లో శ్రీనివాస్ అమ్మ దగ్గర, శ్రీనివాస్ భార్య శారద దగ్గరా సెలవుతీసుకుని బయలు దేరారు.

బస్సులో వాల్తేరు చేరుకున్నారు.

రిజర్వేషను దొరకలేదు.

జనరల్ కంపార్టుమెంటులోనే ఎక్కారు. కూర్చోవడానికి ఇద్దరికీ స్థలం దొరికింది.

"బెర్తుకి ప్రయత్నించండి. తరవాత దొరు కుతుంది" అని చెప్పాడు శ్రీనివాస్.

గోదావరి కూత కూసి బయలుదేరింది– శ్రీనివాస్ చేతులూపుతూ వుండిపోయాడు.




**జ**గదీష్, చలపతిరావు గోదావరి దిగి వాళ్ళ ఇల్లు చేరుకున్నారు.

నిర్మలాదేవికి కొడుకురావడం ఎంతో సంతోషం కలిగించింది. కాని అది వ్యక్తం కానివ్వలేదు. బింకంగా ఉలుకూపలుకూ లేకుండా వూరుకుంది.

కోపం ఇంకా తగ్గలేదు. అదే మెల్లగా తగ్గిపో తుందని సరిపెట్టుకుని "అమ్మా" అని ఎంతో ప్రేమగా పిలిచాడు.

కాని, ముభావంగా చూసిందామె.

టిఫిన్ చేసిపెట్టింది. అమ్మచేతి టిఫిను కడుపునిండా తిన్నాడు. కాఫీలు కానిచ్చారు.

చలపతిరావు అంతా గమనిస్తూనే వున్నా డు. ఏ సాయంత్రానికో మళ్ళీ చిలికిచిలికి గాలివానవచ్చే ప్రమాదాన్ని ఊహించాడా యన.

సాక్షీభూతంగా వూరుకున్నాడు.

జగదీష్ తయారై స్కూటరు మీద ఆఫీసుకి వెళ్ళిపోయాడు.

సాయంత్రం మళ్ళీ యధావిధిగా ఇల్లుచేరు కున్నాడు.

అమ్మచేతి టిఫిను తిని, టీ తాగాడు.

మాట్లాడకుండా తన గదిలోకి వెళ్ళి పడుకు న్నాడు. తల్లి ప్రేమ అంతా నటనలాగే అని పించింది.

తను చలపతిరావుకీ– నిర్మలకీ పుట్టిన వాడుకాడు అనుకుంటే కడుపులో తీరని ఆవే దన, గుండెల్లో అగ్నిపర్వతాలు బద్దలౌతు న్నాయి.

ఇంక ఈ ఆవేదనని భరించలేడు. వెంటనే ఈ రహస్యాన్ని ఛేదించాలి. లేకపోతే తను ప్రశాంతంగా జీవించలేడు. ఇలాంటి జీవితం వృధా అనే నిశ్చయానికి వచ్చేశాడు.

రాత్రి భోజనాలయ్యాయి.

అప్పుడే నిర్మలాదేవి వాళ్ళ బెడ్‌రూమ్‌లోకి వెళ్ళిపోయింది.

"అమ్మా..." అనీ వెంటపడ్డాడు. అడిగె య్యాలి– ఎలా మొదలుపెట్టాలో అర్థంకాలే దు.

"నువ్వు ఇంకా ఆ అమ్మాయినే పెళ్ళిచేసుకో దలచుకుంటే నన్ను అమ్మా అని పిలవకు" అని పడకగదిలోకివెళ్ళి మంచంమీద వాలిపో యిందామె.

ఆ వెనకే జగదీష్ మెల్లగా నడిచివెళ్ళాడు.

చలపతిరావు ఆశ్చర్యంగా కొడుకుని గమ







నించాడు. కొడుకులో పరివర్తన వచ్చిందా! వాళ్ళమ్మ చెప్పినట్లు చెయ్యదలచుకున్నాడా అనుకున్నాడు.

డబుల్ కాట్ పక్కనే నుంచుని ఎంతో సౌమ్యంగా, "అమ్మా! నాకింక పెళ్ళెందుకమ్మా! అక్రమంగా పుట్టిన నీకొడుక్కి అంత అదృష్టమా— నాకే పెళ్ళీవద్దమ్మా! నాకు ఆఫీ సొద్దు! బతుకువద్దు— కన్న నీచేతుల్తోనే కాస్త విషం ఇచ్చి చంపి పుణ్యం కట్టుకో అమ్మా" అన్నాడు ఎంతో విరక్తిగా.

కళ్ళనిండా నీళ్ళతో అక్కడున్న ఓ కుర్చీ మీద కూలబడిపోయాడు జగదీష్.

నిర్మలాదేవి మొదట ఆశ్చర్యపోయింది. తరవాత నిశ్చేష్ఠురాలైంది. జరగరానిదేదో జరిగిపోయింది. ఈ ప్రళయాన్ని ఇంక ఆపడం కష్టం. ఈ సమస్యని ఎలా ఎదుర్కోవాలి?

అక్రమంగా పుట్టిన నీ కొడుక్కి అంటాడేమిటి?

దిగ్గున లేచింది.

"జగ్గూ... నువ్వు విన్నావా బాబూ! ఆరోజు రాత్రి నా మాటలు విన్నావా నాయనా? అదంతా అబద్ధంరా... పాపిష్టిదాన్ని– మీనాన్న ఎంత చెబుతున్నా వినక నువ్వు నిద్రపోతున్నావనుకుని, మీ నాన్నని బెదిరిద్దామని అలా వాగాను" అని వెక్కివెక్కి ఏడవసాగింది.

చలపతిరావు స్థాణువైపోయాడు.

అబ్బాయి వినేశాడా? ఓ భగవాన్... ఇంకేంచెయ్యాలి? అపురూపంగా పెంచుకున్న పెరటి వృక్షానికి చీడపురుగుపట్టినట్లయింది. ఇప్పుడెలా? ఇంత బడబానలాన్ని ఇంత నరకయాతనని వీడిన్నిరోజులూ ఎలా భరించాడు?

పుత్రవాత్సల్యం పెల్లుబుకగా "బాబూ... జగదీష్" అని గట్టిగా కౌగలించుకున్నాడు. కన్నీరు వరదలైపారింది.

అలాగే ఓనిముషం వదలకుండా వుండిపోయాడు.

తండ్రీకొడుకులను ఆ స్థితిలో చూసిన నిర్మలకి దుఃఖం మరింత పెల్లుబికింది. మంచంమీద బోర్లాపడుకుని కుళ్ళికుళ్ళి ఏడ్చింది.

చలపతిరావు దుఃఖాన్ని దిగమింగుకున్నాడు.

"బాబూ జగదీష్... నువ్వు విన్నదంతా తప్పు. ఏదో కోపంమీద మీ అమ్మ అలా అనేసిందిగాని దానిలో నిజంలేదు. నామాట నమ్ము. పుట్టిన దగ్గర్నుంచీ నీమీదే ఎన్నో ఆశలుపెట్టుకుని పెంచాము. ఏనాడైనా మా ప్రేమలో మోసం కనిపించిందా? దానిమాటలు నమ్మకురా" అని ప్రాధేయపడుతుంటే అతని గొంతు వణికింది.

జగదీష్ కాస్త తేరుకున్నాడు.... "డాడీ నన్నింకా మభ్యపెట్టే ప్రయత్నం చెయ్యకండి. నేను మీ కొడుకుని కాను. నిజం చెప్పండి నాన్నా... నా జన్మరహస్యం చెప్పండి– వెంటనే చెప్పండి– వెంటనే చెప్పండి" అని గట్టిగా తండ్రిని కౌగలించుకుని ఏడవసాగాడు.

హృదయవిదారకమైన సన్నివేశం అది. తండ్రీకొడుకుల ఇద్దరి హృదయాలలోనూ అగ్నిపర్వతాలు బద్దలయ్యాయి.

చలపతిరావు మనసు లేతచిగురుటాకులా వణికిపోయింది. నువ్వు నా కొడుకువి కావు అని తను చెప్పగలడా?

ఏ తండ్రయినా తనకన్నా ప్రేమగా పెంచగలడా?

జగదీష్ తన కొడుకుకాదు– సప్తసముద్రాలూ గాలించి సాధించిన మణిపూస. భూగర్భం అంతా తవ్వి వెలికితీసిన జాతిరత్నం. కష్టపడి దానికి నగిషీలుదిద్ది అమూల్యమైన వజ్రంగా మార్చాడు. ఇప్పుడు వదులుకోగలడా? జగదీష్ తననికాదని వెళ్ళిపోతే బతకగలడా?

జగదీష్ హృదయ కుహరంలోకూడా అలాంటి సంచలనమే బయలుదేరింది. చలపతిరావు తనకి తండ్రికాడా. తండ్రికి మారురూపం అనుకున్నాడే. ఈ కన్నతండ్రిని వదులుకోగలడా. అయినా తను నిజంతెలుసుకోవాలి! అంతే... తిరుగులేదు.

"చెప్పండి... వెంటనే చెప్పండి. వెంటనే నేను తేరుకోవాలంటే చెప్పండి" అని మరింత బలవంతం చేశాడు.

"లేదు బాబూ! నువ్వు నా కొడుకువే. నా మాటనమ్ము" అని గాఢంగా కౌగిలించుకున్నాడు.

"నాన్నా... ఇలాంటి తీపితీపి మాటలతో నన్ను మభ్యపెట్టలేరు. వెంటనే చెప్పండి. లేదా రేపు తెల్లవారేసరికి నా శవాన్ని ఏ రైలుపట్టాల మీదో ముక్కలుముక్కలుగా చూస్తారు" అని బెదిరించాడు.

జగదీష్ మామూలు మనిషిలా లేడు. ఉగ్ర నరసింహమూర్తిలాగా కనిపించాడు. కన్నులు ఎర్రని కణికల్లా వున్నాయి.

చలపతిరావే భయపడ్డాడు.

నిర్మల మంచంమీద బోర్లాపడుకుని వున్నా జరుగుతున్నదంతా గ్రహిస్తూనే వుంది. ఆ రహస్యం చెప్పక తప్పదా! ఆ విషయం బాబుకి




తెలిసిన తరవాత ఇంకా బతికివుండగలదా? ఛీ... ఎంతపనిచేసింది తను. అనవసరంగా నోటికివచ్చినట్లు ఆనాడు వాగింది. దేవుడి లాంటి ఆయనమాట విన్నదా— పాపం, ఎంత వారించారు.

మరింత భోరున ఏడ్వసాగిందామె.

చలపతిరావుకి భార్యమీద ఎన్నడూ రానంత కోపం వచ్చింది. భార్యమీద ఎన్నడూ చెయ్యిచేసుకోలేదు. కోపం కట్టలుతెంచుకుంది.

చేయివేసి బలంగా అటుతిరిగి పడుకున్న భార్య వీపుమీద ఒక్కదెబ్బ వేశాడు. కోపం తీరలేదు. అమాంతం జుత్తుపట్టుకుని నిర్మలని లేపాడు.

"దుర్మార్గురాలా.... ఇప్పుడు నీ కళ్ళు చల్లబడ్డాయా? ఇప్పుడిక చెప్పు— వాడి జన్మరహస్యం అంత చెప్పు" అన్నాడు.

జగదీష్ తండ్రిని అమాంతం పొదివి పట్టుకున్నాడు. తల్లి జుట్టుని చలపతిరావు పట్టులో నుంచి విడదీశాడు. భల్లూకంలా పట్టిన తండ్రి బలానికి ఆశ్చర్యంవేసింది.

"వదల్రా జగ్గూ... దీన్ని బతకనియ్యగూడదు— రాక్షసి" అని రంకెవేశాడు చలపతిరావు.

నిర్మల కొడుకుని చూస్తూ "నన్నేం చేసినా పాపంలేదు. నన్ను చంపెయ్యనియ్యరా జగదీష్! నేను మాటతప్పాను. నా పాపానికి నిష్కృతిలేదు" అంటూ రెండుచేతులతో నెత్తి బాదుకోసాగింది.

"అమ్మా... మీ ఇద్దరూ ఈ ఏడుపులు కట్టిపెట్టండి. మరోగంటలో నా గదికివచ్చి జరిగింది చెప్పకపోతే శాశ్వతంగా ఈ ఇల్లు వదిలి పెట్టి వెళ్ళిపోతాను. తరవాత ఈ లోకాన్నే విడిచిపెట్టేస్తాను. చెప్పకపోయారో నామీద ఒట్టే" అని చివాలున తన గదిలోకి వెళ్ళిపోయాడు.

చలపతిరావు, నిర్మల ఇద్దరూ అక్కడ మిగిలిపోయారు. ఇద్దరున్నా ఒంటరితనం వాళ్ళని బాధించింది. అలా ఓ పావుగంట ఎవరికివారు మౌనంగా వుండిపోయారు.

జగదీష్ లేకపోతే వాళ్ళకి బతుకేదీ! గమ్యమేదీ! వాళ్ళకి సంధానకర్త ఆ ఒకేఒక్క గారాల కొడుకు. మరి వాడే వాళ్ళనుంచి దూరమైతే మిగిలేది వాళ్ళకి ఒంటరితనమే.... ఏకాంతమే.... శూన్యమే!

చలపతిరావు ముందుగా షాక్‌నుంచి తేరుకున్నాడు. నిర్మల భర్తవేపు దీనంగా చూసింది.

చలపతిరావు హృదయం ఆర్ద్రతతో నిండిపోయింది. జాలిగా భార్యని చూశాడు. తనలాగే ఇప్పుడు ఏకాకి. తనతోటే కష్టాలూ సుఖాలూ పంచుకుని ఇంతకాలం జీవించింది. బతికినా చచ్చినా ఒకరికొకరు.

"నిర్మలా! జరిగిందంతా చెప్పేస్తాను. వాడి పట్టుదల తెలియందికాదు. నువ్వు ముఖం కడుక్కో" అన్నాడు.

ఆమె మౌనంగా తల వూపింది.

మరో అర్ధగంటలో ఇద్దరూ జగదీష్ గదిలో వున్నారు. జగదీష్ అలికిడికి ఆలోచనలు తెగిపోగానే కళ్ళుతెరిచి చూశాడు. మంచంమీది నుంచి మెల్లగా లేచాడు.

"నిర్మలా... నువ్వెళ్ళి కాఫీ కలుపుకురా. జరిగింది చెప్పేద్దాం. తరవాత నీటముంచినా, పాలముంచినా వాడిదే భారం" అని చెప్పాడు.

నిర్మల వంటగదిలోకి వెళ్ళిపోయింది.

చలపతిరావు గొంతు సవరించుకున్నాడు.

"ఒరే జగదీష్... జరిగిందంతా చెబుతాను. కాని నువ్వు మనసు పాడుచేసుకోవద్దు. నువ్వు కాకపోతే మాకెవరున్నారురా! నువ్వు మమ్మల్ని కాదని ఎటో వెళ్ళిపోతే ఇదంతా మాకెందుకురా! శ్రద్ధగా విను" అని మొదలు పెట్టాడు.

ఇంతలో పాలు వేడిచేసి ఇన్‌స్టెంటు కాఫీపొడి కలిపి తీసుకువచ్చింది నిర్మలాదేవి.

కాఫీలు తాగారు.

నిర్మల అక్కడ వుండలేకపోయింది. కాఫీకప్పులు తీసుకుని మళ్ళీ వంటగదిలోకి వెళ్ళిపోయింది. చలపతిరావు ఆమె స్థితిని అర్థంచేసుకున్నాడు.

చలపతిరావు జరిగిన గతాన్ని ఎక్కడ మొదలుపెట్టాలా అని కాసేపు ఆలోచించాడు. అతని మస్తిష్కంలో అలనాటి జ్ఞాపకాల పొరలు అరలు అరలుగా తెరుచుకున్నాయి. స్మృతిపథంలో ఆనాటి సంభాషణలు, దృశ్యాలు మెదలసాగాయి.

నెమ్మదిగా కొడుక్కి చెప్పసాగాడు:

"సరిగ్గా ముప్పైఏళ్ళ క్రితం మీ అమ్మా, నేనూ పెళ్ళిచేసుకున్నాం. అప్పటికే నా ఇంజినీరింగు పూర్తయింది. జూనియర్ ఇంజినీరుగా ప్రభుత్వోద్యోగంలో చేరాను.

హైదరాబాదులో కాపురంపెట్టాం. పెళ్లయిన ఏడాదికే మీ అమ్మ గర్భవతి అయింది. పురుటికి తీసుకుని వెళ్లడానికి మీ అమ్మమ్మ వచ్చింది. నాకు అలాంటి ఆచారాలమీద నమ్మకం లేదు. హాయిగా అన్ని సౌకర్యాలున్న పట్టణంలో పురుడు పోసుకోక ఎక్కడో పల్లెటూరు పురిటికి పంపడమేమిటి? ఆమాటే చెప్పాను. కాని ఆమె ఎంతో బతిమాలి తీసుకుని వెళ్ళింది.

తర్వాత మగపిల్లవాడు పుట్టినట్లు టెలిగ్రామ్ వచ్చింది. ఎంతో సంతోషించాను. బాబుకి అయిదోనెల రాగానే వెళ్ళి తీసుకువచ్చాను. మా ఆనందానికి అవధుల్లేకపోయాయి.

అలా ఏడాది గిర్రున తిరిగిపోయింది.

బాబుకి పుట్టినరోజు పండుగ ఎంతో సంతోషంగా చేశాము. ఆరోజే వాడు మాకంటికి కళకళలాడుతూ కనిపించాడు. తరవాత అన్నీ జబ్బులే. రెండోపుట్టిన రోజుని చూడనేలేదువాడు. కాళ్ళూ చేతులూ వణకడం, ఆయాసం— మొదలైన లక్షణాలు కనిపించాయి. ఎన్ని మందులువాడినా తగ్గలేదు. చివరికి వాడు మాకు దక్కకుండాపోయాడు.

చుట్టాలూ, స్నేహితులూ వచ్చారు. మమ్మల్ని ఎంతో ఓదార్చారు. మీ అమ్మని ఊరడించడం కష్టమైంది. దాని బాధని మరిపించడానికి మీ అమ్మమ్మ వాళ్లవూరు తీసుకువెళ్ళింది. నేనూ చాలా దిగజారిపోయాను. పుట్టినపాపాయి పోయిన ఇల్లు చీకట్లో దీపం ఆరిపోయిన తరవాత దీపం బుడ్డిలాంటిది. ఆ పిల్లల్ని పోగొట్టుకున్న తల్లిదండ్రులు ప్రాణాలు పోయిన తరవాత శవాల్లాగా మారిపోతారు. ఆకలిదప్పులు వుండవు.

వెళ్ళి మీఅమ్మని తీసుకువచ్చాను.

మరో మూడునెలలు గడిచాయి.

మీ అమ్మ మళ్ళీ గర్భవతి అయింది.

మా కష్టాలు, బాధలు మరిచిపోయాం.

నేను మంచి స్పెషలిస్టులకి చూపించాను. గర్భవతులకి ఇవ్వవలసిన మంచిఆహారం, మందులూ, టానిక్‌లూ వాడించాను. వారం వారం ఓ తెలిసిన లేడీ డాక్టరువచ్చి ఆరోగ్యం పరీక్షించేది. నెలలు నిండాయి.

మీ అమ్మమ్మ మళ్ళీ పురుడుకి తీసుకువెళతానని రాసింది. పురిటికి పంపించననీ, ఆమెనేవచ్చి పురుడుపోసి వెళ్లమనీ ఉత్తరం రాశాను. ఆమె వచ్చింది.

గవర్నమెంటు హాస్పిటల్‌లోనే పురుడుపోయించాను. మళ్ళీ అబ్బాయే పుట్టాడు.

జగదీష్ తండ్రిచెప్పేది శ్రద్ధగా వినసాగాడు.

రెండోమారు పుట్టింది తనేనా— అని పించిందతడికి. ఉత్కంఠని ఆపుకోలేకపోయాడు.

"ఆ రెండోమారు పుట్టింది నేనేనా?" అని అడిగేశాడు.

"కాదురా! అలాఅయితే ఇంకేం. చివరిదాకా విను. రెండోమారు చాలా ఆరోగ్యంగా నిజంగానే పండంటి బంగారువన్నెలో పుట్టాడు.

వాడిని అల్లారుముద్దుగా పెంచాము ఏలోటూ రానివ్వలేదు.

అయిదోనెల అన్నప్రాసన చేయించాము.

సంపూర్ణాహారమైనపాలు,పళ్లరసం, ఆరోగ్యానికి టానిక్‌లు.

చక్కగా గునగునలాడుతూ పెరిగాడు.

గతాన్ని మరిచిపోయాం

మొదటి పుట్టినరోజు జరిగింది.

ఆపుట్టిన రోజుకి నాతోపాటు ఇంటరుదాకా చదివిన నాస్నేహితుడు డాక్టర్ మదన్‌మోహన్ని కూడా పిలిచాము. ఫొటోలుతీయించి అందంగా ఆల్బమ్‌లో అంటించాము.

మరోమూడు నెలలువాడితో కూడా సరదాగా ఆడుకున్నాము. అంతే— నువ్వు చెపితే నమ్మవురా జగ్గూ... ఆ రెండోవాడికీ మొదటిఅబ్బాయిలాగే కాళ్ళూ చేతులూ వణకడం, నీరసం— అచ్చం మొదటివాడికి వచ్చిన జబ్బే వచ్చింది.

ఎంత విషాదం మాజీవితంలో చవిచూశామో నీకేం తెలుసురా అబ్బాయ్! ఎలాంటి గుండెగాయాలను నువ్వు మాకు మాన్పావురా" అనిచెపుతూ వుంటే చలపతిరావుకి కళ్ళు చె




ప్రవేశ పెడుతున్నారు

# రీఫిల్ ప్యాక్‌లో సెరిలాక్ వీట్




# ఆదా చేయండి రు.1.50 ప్రతి ప్యాక్ పైన

ఇప్పుడు సెరిలాక్ వీట్ రీఫిల్ ప్యాక్‌లలో లభిస్తోంది. మీ పాపాయికి సెరిలాక్ లాభాలన్నింటినీ అందించండి. ప్రతి ప్యాక్ పైన రు. 1.50 ఆదాచేయండి.

4 నెలల నుంచి మీ పాపాయికి పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి. దీనిని సెరిలాక్ లాభంతో ప్రారంభించండి!

ప్రతిసారి తినిపించే సెరిలాక్ మోతాదులో పోషక పదార్థాలన్నీ ఉన్నాయి. పాపాయిలకు సెరిలాక్ రుచి భలే ఇష్టం. దానిలో పాలు పంచదార ఉన్నాయి. దానిని ముందుగా కాచిన నీటిలో కలిపితే చాలు. ఇప్పుడు సెరిలాక్ లాభాలు అన్నీ కూడా తక్కువ ధరకే లభిస్తున్నాయి.

తయారు చేయడంలో పరిశుభ్రతను పాటించేందుకు, మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకు, ప్యాక్ పైన ఉన్న సూచనలను జాగ్రత్తగా పాటించండి.

ఉచితం !
సెరిలాక్ బేబీ కేర్ బుక్
ఈ చిరునామాకు వ్రాయండి:
సెరిలాక్, పోస్టుబాక్స్ నం. 3
న్యూ ఢిల్లీ 110 008

## మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం

R K SWAMY/FSL/5072 TEL

మర్యాయి.

జగదీష్ హృదయం బరువెక్కింది.

"చెప్పండి" అని తొందరచేశాడు.

"ఎప్పుడైతే రెండోవాడికి కూడా కాళ్ళు చేతులూ వణకడం మొదలుపెట్టాయో మేం భయపడిపోయాం. మొదటివాడికి జరిగిన చేదుఅనుభవాన్ని మరిచిపోగలమా. వెంటనే నా ఫ్రెండు డాక్టర్ మదన్‌ని ఫోన్‌చేసి పిలిచాను. వాడువెంటనే కారులో వచ్చాడు.

స్వయంగా వాడికారులోనే మమ్మల్ని క్లినిక్‌కి తీసుకువెళ్లాడు. అన్ని పరీక్షలూచేశాడు. పిల్లవాడిరక్తం, మూత్రం ఒకటేమిటీ అన్ని పరీక్షలూ జాగ్రత్తగా నిర్వహించాడు. కాని ఫలితం లేకపోయింది.

వాడూ నీరసించి నీరసించి చనిపోయాడు. చిత్రమైన కేసు గనక వాడిని పోస్టుమార్టంకి పంపాడు. అప్పట్లో ఎవరైనావాడి ప్రాణాలు కాపాడగలిగితే మాప్రాణాలను కూడా తృణప్రాయంగా పెట్టేవాళ్లం.

కాని జగదీష్... మనిషిఎంత విర్రవీగినా చివరికి ఒకదానికి లొంగిపోకతప్పదు. దానికి తరతమ/భేదాలులేవు. ఎవర్నీ కనికరించదు– అదే మృత్యుదేవత. ఆ చావుని ఎవ్వరూ తప్పించుకోలేరు.

వాడినికూడా భూమాతకి అప్పగించేశాము.

మీ అమ్మా, నేనూ పిల్లల్ని కనీపోగొట్టుకున్న గొడ్డువాళ్లమయ్యాం. జీవితంలో ఆశలేదు. ఎందుకు జీవించాలి. ఎందుకు సంపాదించాలి. జీవితంమీద విరక్తి ఆ పిల్లలువారి చేష్టలు, వారాడిన వచ్చీరాని మాటలు జ్ఞాపకంవచ్చి మీ అమ్మ నాగుండెలమీదపడి "ఏమండీ... నేను బతకలేనండీ" అని రోదించేది.

నేను మాత్రం ఏమి చెయ్యగలను.నాలోని బాధను నాలోనే అణచుకుని మొండిధైర్యంతో మీ అమ్మని మాత్రం ఓదార్చేవాడిని. అలా ఓ నెలరోజులు గడిచిపోయాయి.

డాక్టర్ మదన్ ఒకటిరెండుమార్లు వచ్చి మమ్మల్ని మందలించాడు. "మీకేం మతిపోయిందా? మీరేమైనా ముసలివాళ్ళా ముతకవాళ్ళా– మళ్ళీ బోలెడుమంది పిల్లలుపుడతారు" అని ధైర్యం చెప్పేవాడు.

ఓరోజు...

ఆరోజు జరిగిన సంగతులు ఈనాటికి కూడా నా కళ్లకి కట్టినట్లు కనిపిస్తున్నాయి.

సరిగ్గా ఇరవైఅయిదు సంవత్సరాల క్రితం మీ అమ్మా, నేనూ ఒంటరిగా హాలులో కూర్చుని దిగాలుగా వున్నాము.

ప్రకృతి ఎంతో ప్రశాంతంగా వుంది.

ఆదివారం వుదయం అందరూ సరదాగా గడిపేరోజు.

చల్లనిగాలి వీస్తోంది.

సూర్యకిరణాలు మంచుతెరలను జయించలేకపోతున్నాయి. ఎండలేదు. చల్లగా వుంది వాతావరణం.

ఆనందంగాని, మనశ్శాంతిగాని ముందు మనిషికి అంతరంగంలోనుంచి పుట్టాలి. బయటి ప్రకృతి దానికి వుద్దీపనకారిగానే పనిచేస్తుంది.

మాకు మనసులో అంధకారం.

దిగాలుగా కూర్చున్నాం.

అప్పుడే బయట కారుహారన్ వినిపించింది. డాక్టర్ మదన్‌మోహన్ వచ్చాడు.

నేను ఎదురెళ్లి– "రా మదన్ రా!" అని ఆహ్వానించాను.

"రండన్నయ్యా!" అని నిర్మల కూడా ఎంతో ఆప్యాయంగా పలకరించింది.

డాక్టరు వచ్చి సోఫాలో కూర్చున్నాడు.

"చలపతీ... నేను మీకొక సంగతి ముఖ్యంగా నీకొక సంగతి చెప్పాలని వచ్చాన్రా" అన్నాడు.

"చెప్పు... దానికేం" అన్నాన్నేను.

"కాని అది మీకంత సంతోషదాయకమైన విషయం కాదు" అని సంశయిస్తూ చెప్పాడు.

"దేని గురించి?" అన్నాను.

"అదే– పోయిన మీ అబ్బాయిని గురించి పోస్టుమార్టమ్ రిపోర్టు వచ్చింది" అని చెప్పాడు.

"నిండా మునిగిన మాకు చలేమిటి? చెప్పు" అని ప్రోత్సహించాను.

డాక్టర్ మదన్ మీ అమ్మతో– "చెల్లెమ్మగా




రూ... మీరు ఆ వంటగదిలోకి వెళ్లండి. నేను చలపతికే ఈ విషయం చెప్పాలి– మీరు వినకూడదు'' అని చెప్పాడు.

అలాగే అని చెప్పి మీ అమ్మ లోనికి వెళ్లిపోయింది.

డాక్టరు వూపిరి గట్టిగా పీల్చుకున్నాడు. నిరుత్సాహంగా నిట్టూర్చాడు. ఏదో బాధాకరమైన విషయమే అనుకున్నాను.

''సారీరా చలపతీ.... ఇందరం డాక్టర్ల ముండి మీ అబ్బాయి ప్రాణాలను కాపాడలేకపోయాం'' అన్నాడు.

''సరేలే... మా ఖర్మ అలావుంటే దానికి నువ్వేం చేస్తావు. ఎవరు మాత్రం ఏంచెయ్యగలరు'' అన్నాను బాధగా నిట్టూరుస్తూ.

''మీ అబ్బాయి పోస్టుమార్టంలో ఓ విషయం బయటపడింది. ఆ వ్యాధిని మా వైద్యపరిభాషలో 'వెంట్రిక్యులర్ డీజనరేషన్' అనంటారు. ఈ వ్యాధి వచ్చినవారు ఎక్కువ కాలం బతకరు. మీ మొదటి అబ్బాయి కూడా ఇలాగేకదూ పోయాడు'' అని నన్నడిగాడు.

''నీకు తెలియనిదేముంది. ఇలాగే రెండోఏటే కాళ్లూచేతులూ వణకసాగాయి. నీరసించిపోయి చివరికి చనిపోయాడు'' అని వివరించాను.

''సరే విను.... ఈ జబ్బుని మామూలుగా విల్సన్స్ డిసీజ్ అంటారు. విల్సన్ అనే ఆయన ఈ జబ్బుని మొదట కనిపెట్టాడు. ఈ జబ్బు వచ్చిన పిల్లలు ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా పదేళ్లకన్నా ఎక్కువకాలం బతకరు. ఈ రోగం తల్లిదండ్రుల జీన్సులలోని లోపంవల్ల పిల్లలకు వస్తుంది. పిత్తాశయంలో రాగి జమఅవుతుంది– చనిపోతారు. ఆ పిత్తాశయంలో పేరుకున్న రాగిని మాటిమాటికి తీసేయడం ద్వారా మరికొంతకాలం బతికేలాగా చెయ్యగలిగినా ఏకేసులోనూ పదేళ్లు దాటి బతికినవాళ్లు లేరు'' అని ఆ జబ్బుని గురించి వివరించి చెప్పాడు మదన్.

జగదీష్ తండ్రి చెబుతున్నది ఏకాగ్రతతో వింటున్నాడు.

శూన్యంలోకి చూస్తూ గతాన్ని కళ్లకి కట్టేలా వూసగుచ్చినట్లు చెప్పుకుపోతున్నాడు తండ్రి.

చలపతిరావు చెప్పడం ఆపినప్పుడల్లా నిశ్శబ్దం. ఆ ఇంట్లో అసలు మనుషులున్నట్లే లేదు.

చలపతిరావు మళ్లీ గొంతు సవరించుకున్నాడు.

''జగదీష్... నీకో సంగతి చెప్పలేదు. రెండోవాడు పుట్టగానే నేను వేసక్టమీ ఆపరేషన్ చేయించుకున్నాను.

అదే డాక్టరు మదన్‌తో చెప్పాను''

''ఎందుకు మదన్ అవన్నీ... నువ్వు కనమన్నా మళ్లీ పిల్లల్ని కనకుండా నేను వేసక్టమీ చేయించుకున్నానుగదా'' అని చెప్పాను.

వాడు– ''వేసక్టమీ ఆపరేషనుదేముంది లేవోయ్. మళ్లీ ఆపరేషన్‌చేసి రివర్స్‌చేసి మళ్లీ పిల్లలు పుట్టేలాగా చెయ్యవచ్చును. కానీ నీ వీర్యకణాలలోని జెనెటిక్ ప్రాబ్లమ్‌ని, లోపాలను సవరించలేంగా'' అన్నాడు.

నేను తట్టుకోలేకపోయాను. డాక్టరుమీద కోపం వచ్చింది. అలాంటి వెధవ విషయాలు చెప్పడానికి పనికట్టుకుని రావాలా? అనుకున్నాను.

''అయితే ఏంచెయ్యమంటావు... గంగలో దూకమంటవా? లేక ఉరేసుకు చావమంటావా? ఈ సంగతి చెప్పడానికేనా పనికట్టుకు వచ్చావు?'' అనేశాను చిరాగ్గా.

పాపం వాడెంతో చిన్నబుచ్చుకున్నాడు.

''క్షమించరా చలపతీ... నీకు కోపం తెప్పించాను. నిన్ను బాధపెట్టడానికే అయితే ఇంతదూరం రావడం ఎందుకు. దీనికి ఒక మార్గాంతరం వుంది, అది చెప్పడానికే వచ్చాను'' అన్నాడు.

నాకు అదొక ఆశాజ్యోతిలాగా అనిపించింది. అంధకారంలో మగ్గిపోతున్న మీ అమ్మని మళ్లీ మనిషిని చెయ్యాలంటే మాకు పిల్లలు పుట్టాలి అంతే! వేరే మార్గంలేదు''

నేను ఎంతో ప్రాధేయపడుతూ– ''అదేమిటో, ఆ మార్గాంతరం ఏమిటో చెప్పి పుణ్యం కట్టుకోరా మదన్'' అని బతిమాలాను.

''కాని నీవు దానికి ఒప్పుకొంటావో లేదో నువ్వు నా చిన్ననాటి స్నేహితుడివి, ఆదర్శవాదివి గనక చెప్పగలుగుతున్నాను'' అన్నాడు జంకుతూనే.

''చెప్పు ఏమిటది... ఏం చెయ్యాలి. చంపక

త్వరగా చెప్పరా మదన్' అని తొందరచేశాను.

"ముందుగా కృత్రిమ గర్భధారణ విషయంలో నీ అభిప్రాయం చెప్పు?" అన్నాడు.

వాడు చెప్పేదేమిటో నాకు అర్థమైంది.

"ఏమిటీ... ఆర్టిఫిషియల్ ఇన్‌సెమినేషన్ గురించేనా నువ్వు చెప్పేది? ఆ సంగతి తెలిస్తే సంఘంలో మా పరువేమౌతుంది?" అన్నాను బెంగగా.

"ఒరే... స్టుపిడ్ లా మాట్లాడకు. కాలేజి డిబేటుల్లో ఎలా మాట్లాడేవాడివో మరిచిపోయావా? సంఘంలో విప్లవాత్మకమైన మార్పులు రావాలంటే యువతరం ఈ సాంప్రదాయపు సంకెళ్ళను తొలగించాలి. మారుతున్న ప్రపంచంలో మనమూ మారాలి అని తెగ అరిచేవాడివిగదరా- మరిచిపోయావా! ఇదేనా నీ ఆదర్శం? తనదాకావస్తే- అనే సూత్రం నీకు వర్తించనియ్యకురా! ఏది సంఘం? ఎవరు సంఘం? పాపం సంఘం, సంఘం అని అందరూ సంఘాన్ని నిందిస్తారుగాని నిజానికి సంఘం అన్ని మార్పులకూ తలొగ్గి ఆమోదించింది... ఆమోదించక తప్పలేదు. కొన్నిటిని తరవాత తనే ఆహ్వానించింది. మనం భయపడితే భయపెట్టి, ఎదురు తిరిగితే భయపడిపోయే మనస్సు లాంటిదిసంఘం.

"ఏం? ఈ సంఘం నీకు పిల్లల్ని కని ఇస్తుందా? ఒకవేళ ఎవరైనా వాళ్ళ పిల్లల్ని దత్తతకి ఇచ్చినా నీ ఆస్తి, అంతస్తూ చూసి ఇస్తారు. తరవాత దానిని కాజేసే ఎత్తులు వేస్తారు. లేదు... ఏ అనాథశరణాలయం నుంచో ఓ పిల్లాడిని తెచ్చుకుని పెంచుకుంటావే అనుకుందాం. ఆ పిల్లాడికి మీ అంత ప్రేమ వుండదు. ఈ పద్ధతిలో అయితే నీ భార్యరక్తం పంచుకుని పుట్టినందువల్ల నీ భార్యకీ, నీ ఆమోదంతోనే గర్భం దాల్చడం వలన నీకూ ఆ పాపాయి మీద ప్రేమ వుంటుంది... ఆలోచించు.

"మరో మాట- మళ్ళీ సంఘం మాటకి వద్దాం. ఎవ్వరికైనా తెలుస్తుందనే భయం మీకు అక్కరలేదు. నీకూ, నాకూ, చెల్లాయికి తప్ప మూడో కంటివాడికి తెలియకుండా ఈ పని పూర్తిచేసేద్దాం" అని వివరించాడు.

నాకేదో భయం. ఏదో తప్పుచేస్తున్నాననే భావన. మీ అమ్మ ఒప్పుకోదనే బెంగ.

అదే అన్నాను- "మా నిర్మల దీనికి ఒప్పుకుంటుందోలేదో" అని.

డాక్టరు అనునయంగా- "అదేరా... అదే నువ్వు చెయ్యవలసింది. నువ్వు సరిగ్గా వివరించి చెపితే చెల్లాయి అర్థంచేసుకుంటుంది. మీ పిల్లాడిలో ఆ రోగం చూసిన తరవాత చాలా బాధపడ్డాన్రా! పాపం చీమకి కూడా హాని చెయ్యని చలపతికా ఈ ఘోరం! ఇదెలాంటి న్యాయం అనుకున్నాను.

"స్నేహితుడిగా నీ మేలుకోరి ఈ నిర్ణయానికి వచ్చాను. ఇలాంటి సమస్య ఎందరికో వుంటుంది. అందరికీ చెప్పగలనా చెప్పు? అసలు మనమధ్యగల సన్నిహితత్వం వల్లనే గాని మరొకరికి ఇలా చెప్పగలనా? చెల్లాయికి చెప్పు. ఒప్పించు. ఆమెకి తెలియనివ్వకుండా మనం చెయ్యవచ్చును. కాని నాకది ఇష్టంలేదు"

"మీ చెల్లాయి కాస్త పురాతనసంప్రదాయాలు గలది. పాపం అంటుందేమో" అన్నాను.

డాక్టరు మళ్ళీ అందుకున్నాడు- "నిజానికి ఇందులో పాపం ఏమీ కనిపించడంలేదు. నా దృష్టిలో ఇదీ ఒక రోగమే. సపోజ్- మీ ఆవిడకి ఓ జబ్బు వచ్చింది. ఆమెకి రక్తంకావాలి. నీ రక్తం పనికిరాలేదు. మరొకరి రక్తం ఎక్కించి ప్రాణాలు కాపాడటంలేదా! ఓ ఇంజక్షనులాగే దీనినీ చేస్తాం- అంతే! నిన్ను కన్విన్సు చెయ్యడానికే తప్ప నాకిందులో తప్పు అసలు కనిపించడమేలేదు. మనదేశంలో ఇలా తగలడిందిగాని విదేశాలలో బ్లడ్‌బేంకు, ఐ బేంకుల్లాగే స్పెర్మ్ బేంకులు కూడా వున్నాయి. ఆరోగ్యవంతులు మేధావుల వీర్యకణాలని లిక్విడ్‌నైట్రోజన్‌లో గడ్డకట్టించి ఉంచుతారు. కావలసిన స్త్రీలు వుపయోగించుకుంటున్నారు కూడాను" అని చెప్పాడు.

ఇది థీరిటెకల్‌గా నాకూ తెలిసిన విషయమే. కాని ఆచరణలో పెట్టడం సాధ్యమేనా అని ఆలోచించాను. చివరికి మీ అమ్మని ఒప్పించాలనే నిర్ణయానికి వచ్చాను.

"సరేలే మదన్! మా ఆవిణ్ని ఎలాగైనా ఒప్పిస్తాను. ఈ నెలరోజులుగా చూస్తున్నాను. ఇల్లు ఎంత వెలవెలపోయిందో నాకు తెలును




ను. ఆవిడ ముఖంలో కళాకాంతులు లేకుండా పోయాయి. ఈ పద్ధతిలోనైనా మళ్ళీ పిల్లలు పుడితే, మళ్ళీ ఆరోగ్యవంతమైన ఓ పాపాయి ఇంట్లో తిరుగులాడుతూ వుంటే మా కష్టాలను మరచిపోతాం" అన్నాను.

"ఒకే... దట్ఈజ్ గుడ్! కీప్ ఇట్ అప్" అని లేచాడు.

నేనిక వెళ్ళివస్తాను. చాలా పనులున్నాయి– అని వెళ్ళిపోబోయాడు.

"కూర్చో" అని మదన్ని ఆపి మీ డాక్టరన్నయ్య వెళ్ళిపోతున్నాడు అని కేకేశాను, నిర్మలని.



ట్రేలో ఉప్మాప్లేట్లు, కాఫీలతో బయటికి వచ్చిందామె.

కాఫీ మాత్రమే తాగాడు మదన్.

"చలపతీ! చెప్పినవన్నీ జ్ఞాపకం వున్నా యిగా! నువ్వు చెప్పేకబురు కోసం ఎదురుచూ స్తూవుంటాను" అని గబగబా వెళ్ళిపోయాడు.

గుమ్మందాకా మదన్‌ని సాగనంపాను.

కారు స్టార్టయి మరుక్షణంలో దూసుకుపో యింది.

హాలులో మీ అమ్మ నా కోసం ఆత్రుతగా ఎదురుచూస్తోంది.

"ఏమిటండీ... డాక్టరన్నయ్య నన్ను వంటగ దిలోకి పంపి అంతసేపు మాట్లాడాడు— మన బాబు గురించేనా?"

"అవునే... మన బాబు గురించే. నేను వేసక్టమీ ఆపరేషను చేయించుకున్నాను. నీకు జ్ఞాపకం వుందా?" అనడిగాను.

"అవునూ" అంది.

"అదే అడిగాడు. మళ్ళీ పిల్లలు పుట్టేలా నాకు ఆపరేషను చేస్తానన్నాడు. ఎందుకులేరా, ఇంక ఈ పిల్లల సరదా తీరిపోయింది. వద్దు అనేశాను. ఏం నిర్మలా, మనం పిల్లలు లేకుండా... బతకలేమంటావా?" అనడిగాను.

మీ అమ్మముఖంలో ఎంతో నిరాశ, దీనత్వం. కళ్ళు ఆ మాటలతోటే నిండుకున్నాయి. కా సేపు మాట్లాడలేకపోయింది.

తరవాత ఎంతో బాధగా— "ఎంత మాట న్నారండీ... పిల్లలు లేని ఇల్లు దేవుడు లేని కోవెలండీ! పిల్లలులేని బతుకు ఎడారి. పిల్ల లు లేకుండా ఎలా బతకగలం అనుకున్నా రండీ! నా మనస్సు తెలుసుగనుకే డాక్టరన్న య్య అలా అడిగి వుంటారు. మీరేమో పిల్లలే వద్దు అనేశారు. నాకు పిల్లలు కావాలండీ" అని గొడవచేసింది.

అప్పుడు ఉన్నమాట చెప్పాను.

"నా మనస్సులోని మాటా అదేనే. కాని మనకి పుట్టినపిల్ల ఎన్నిజాగ్రత్తలు తీసుకున్నా ఎక్కువ కాలం బతకరట. అదే జబ్బుతో పుడ తారట" ఎంతో బాధగా చెప్పాను.

"అయ్యో భగవంతుడా... ఏజన్మలో చేసుకు న్న పాపమో ఈ జన్మలో మనకిలాగైంది. అయితే మనం ఇలా మోడువారిన జీవితాలు గడపవలసిందేనా? మన ఇల్లు పిల్లాపాపలతో కళకళలాడే అదృష్టమే లేదా?" అని ఎంతో వాపోయింది.

అదే అదనని మెల్లగా- "ఉంది... మార్గాంతరం వుంది. కాని... కాని దానికి నువ్వు ఒప్పుకోవు" అన్నాను.

తృటిలో సమాధానం చెప్పింది.

"ఒప్పుకుంటానండీ... దేనికైనా ఒప్పు కుంటాను- మీరు మరో పెళ్లి చేసుకోవడానికైనా సరే! మీ పిల్లలు నాకుకావాలండీ" ఎంతో దయనీయంగా అంది.

"కాని కాని నిర్మలా... నేను ఏ స్త్రీద్వారా సంతానాన్ని కన్నా ఇలాంటి పిల్లలే పుడతా రట" ఆవేదనగా చెప్పాను.

"అయితే... ఇంకేం మార్గాంతరం వుందో చెప్పండి. దేనికైనా నేనుసిద్ధమే" అని చె ప్పింది ఖచ్చితంగా.

"మనకి ఆరోగ్యమైన పిల్లలు పుట్టాలంటే ఒక్కటే మార్గాంతరం వుందని మదన్ చెప్పా డు"

"దయచేసి అదేదో చెప్పి పుణ్యంకట్టు కోండి. మనకి ఆరోగ్యమైన పిల్లలు ఎలాపుడతా రో చెప్పండి" తొందర చేసింది.

"కాని దానికి నువ్వు ఒప్పుకుంటావోలేదో" సంశయంగా అన్నాను.

"ఒప్పుకుంటానంటున్నానుగదండీ- ఎన్ని మార్లు చెప్పాలి" అని చిరాకుపడింది. అదేదో పుత్రకామేష్టియజ్ఞంలాంటిదనుకుంది.

నేను భయపడుతూనే చెప్పాను-

"మదన్ నువ్వు ఒప్పుకుంటే రేపు అతని క్లినిక్‌కి తీసుకురమ్మన్నాడు. ఎవరో ఆరోగ్య వంతుడి వీర్యకణాలను నీలోకి ప్రవేశపెడతా డట" అన్నాను.

అంతే!

పిడుగుపాటుకి అదిరినట్లు అదిరిపో యింది. తరవాత తోకతొక్కిన తాచులాగా లేచింది.

నాకే భయంవేసింది. ఎంత గొడవచేసినా భరించకతప్పదు. రోకటిలో తలపెట్టిన తర




పిలాగా ముఖంపెట్టి ఊరుకున్నాను.

"ఏంచెప్పారు... మరోసారి చెప్పండి. ఆ డాక్టరే ఈ మాట చెప్పాడా! నేను దగ్గరున్నాను కాదు. మళ్ళీ ఈ గడపతొక్కకుండా చేద్దును. అందుకేనా నువ్వొప్పుకోవు కానీ నువ్వొప్పుకోవు అని పాటపాడుతున్నారు" అంది. నిర్మలని అప్పుడు చూడాలి భద్రకాళిలాగా కనిపించింది.

తలవంచుకున్నాను- తప్పు చేసినవాడిలా.

మెల్లగా అన్నాను- "నిజమే నిర్మలా... డాక్టరు మదన్ మనమేలు కోరే ఈ సూచనచేశాడు. తరవాత నీ ఇష్టం"

"ఆయన మీతో చెప్పినా వినిఊరుకోవడానికి మీకు సిగ్గువెయ్యలేదటండీ! ఛీఛీ... ఎంత నీతిమాలినపని, ఎంతసిగ్గుమాలిన పని. భారత దేశంలో పుట్టిన ఏ హిందూస్త్రీ అయినా ఇలాంటి నికృష్టపు పని చెయ్యడానికి ఒప్పుకుంటుందా?" అంది కోపంగా.

"నువ్వింతలా ఎందుకు వ్యతిరేకిస్తున్నావో నాకర్థం కావడంలేదు. ఇందులో తప్పేముంది. ఒళ్ళు కొవ్వి కామంతో కళ్ళు పొరలు కమ్మి నువ్వీ తప్పుచేస్తావా? ఆరోగ్యవంతుడైన వ్యక్తి వీర్యకణాలను ఉపయోగించుకుంటాము. ఆ దాత ఎవడో మనకి తెలియనే తెలియదు. విదేశాలలో స్పెర్మ్ బేంకులు కూడా వుంటాయట. దీన్లో తప్పేముంది" నచ్చచెప్పే ప్రయత్నం చేశాను.

"మీరు లక్ష చెప్పండి, నాప్రాణం పోయినానరే నేనీపాపపు పనికి ఒప్పుకోను. ఏం... దేశంగొడ్డుపోయిందా? ఏ అనాథశరణాలయంనుంచో ఓ అనాథ బాలుణ్ని తెచ్చి పెంచుకుందాము. అంతేగాని ఇదేంపని. ఎవరికైనా తెలిస్తే మన కింక పరువుంటుందా?" అని వాదించింది.

నాకూ పట్టుదల పెరిగింది. ఒప్పించగలనన్నే ధైర్యం వచ్చింది. సంఘం, నలుగురికీ తెలుస్తుందనే భయమే అయితే లొంగదియ్యవచ్చును అని అనుకున్నాను.

గొంతు సవరించుకుని- "నిర్మలా... నేను చెప్పేది కూడా శ్రద్ధగా విను. నేను అనాథశరణాలయాలనుంచి తెచ్చిన పిల్లల్ని పెంచను. నీకడుపున నీరక్తం పంచుకుని పుట్టిన పిల్లలే నాకు కావాలి. నాకు నీకడుపున పుట్టిన పిల్లలు మాత్రమే కావాలి" అన్నాను ఆవేదనగా.

మీ అమ్మ కళ్ళలో నీళ్ళు సుళ్ళు తిరిగాయి. మాట్లాడబోయింది. గొంతు పెగలలేదు. కాసేపు అలాగే వుండిపోయింది. దుఃఖాన్ని దిగమింగుకుని-

"కాని ఇలాంటి పాపం భారతదేశంలో పుట్టిన ఓ స్త్రీగా ఎలా చెయ్యమంటారండీ! నేనెలా ఈ నీతిమాలిన పనిని చెయ్యగలను" అంది భయంగా.

"చెయ్యాలి నిర్మలా... నువ్వు తప్పకుండా చేసితీరాలి. నువ్వు ఒప్పుకుంటావాలేదా చెప్పు?" అని నిలదీశాను.

"ఒప్పుకోను, ఒప్పుకోను, ఒప్పుకోను... ముమ్మాటికీ ఒప్పుకోను. పిల్లలు లేకుండా ఇలాగే వుండిపోదాంలెండి" అని వెక్కివెక్కి ఏడవసాగింది.

నేను విజృంభించాను.

"నువ్వు ఒప్పుకోవాలి. నాకు పిల్లలు కావాలి. ఈ మోడువారిన గొడ్డుబోతుజీవితం నాకొద్దు. నిర్మలా... మీలాంటి స్త్రీలు ఈనాడు భర్తమాటకి ఎదురు చెపుతున్నారుగానీ పురాణస్త్రీలు భర్తమాటకి ఎదురుచెప్పారా? భర్త అనుమతితో దేవుళ్ళని ప్రార్థించి పిల్లల్ని కనలేదా? నువ్వేచెప్పు... ఇందులో తప్పేముంది చెప్పు. మరో మాట చెపుతున్నాను. నా సంతోషంకోసం నువ్వీ పనికి ఒప్పుకో నిర్మలా! నువ్వు నా మాటకాదన్నప్పుడు నేనూ నీకు దక్కను. నన్ను మరిచిపోవాలి- గుర్తుంచుకో" అని బెదిరించాను.

మీ అమ్మ భయపడిపోయింది.

"అంత మాటనకండి... మీరేలేనప్పుడు నాకీజీవితం ఎందుకు. సరే... అలాగేకానివ్వండి- మీకోసం, మీ సంతోషంకోసం ఈ నీతిమాలినపనికి ఒప్పుకుంటున్నానండీ! రేపే డాక్టర్ మదన్ క్లినిక్కి వెళదాం" అని లేచి వెళ్ళి పోయింది.

నాకెంతో సంతోషం అయింది.

భర్తకోసం మీ అమ్మచేసిన త్యాగం అది. నేను ఆ సంతోషాతిరేకంలో మీ అమ్మన్ని ఆ హాల్లోనే గాఢంగా కౌగలించుకున్నాను.



"చాలా సంతోషం నిర్మలా... నువ్వేం దిగులుపడకు. డాక్టర్ మదన్ నా బాల్యస్నేహితుడు. నలుగురికీ తెలుస్తుందనే భయం నీకు వద్దు. మదన్ ఈ విషయం మన ముగ్గురికీ తప్ప నాలుగోకంటివాటికి తెలియకుండా జాగ్రత్త పడతానన్నాడు'' అని ధైర్యం చెప్పాను.

"మనం ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా ఇలాంటివి దాగవు. ఎప్పటికైనా బయటికి వస్తాయి. అయినా తప్పు చెయ్యకనేపోవాలి. తప్పుచేసిన తరవాత శిక్షకి జంకడం ఎందుకు? నాకా భయం లేదులెండి'' అంది నిబ్బరంగా.

"ఎలా తెలుస్తుందంటావు? డాక్టరూ, నువ్వూ, నేనూ. మన ముగ్గురికే ఈ రహస్యం తెలుస్తుంది. మన ముగ్గురిలో ఎవరో ఒకరు చెపితేనే కదా తెలిసేది. కాదంటావా?'' అన్నాను.

"కాలం తెచ్చే మార్పులు మనం వూహించలేము. కర్ణుడి జన్మరహస్యం దాగిందా? సూర్యభగవానుడికితప్ప మరొకరికి ఆ రహస్యం తెలుసునా? పరిస్థితుల ప్రభావానికి లొంగి కుంతే తననోటితో తాను చెప్పిందా లేదా?'' అని అంది.

ఇప్పుడు నాకనిపిస్తుంది. మీ అమ్మ వాక్శుద్ధి ఎలాంటిదో మరి అదే నిజమై కూర్చుంది.

నేను వెంటనే అందుకున్నాను-- "నిర్మలా...సమయానికి స్ఫురించింది. ఎట్టి పరిస్థితుల్లోనూ పుట్టబోయే బిడ్డకి ఈ రహస్యం తెలియనివ్వకూడదు. తెలిస్తే నామీద ఒట్టే-- జాగ్రత్త'' అని ఒట్టు వేయించాను.

"అలాగే అంది''

ఆవెంటనే మరునాడు క్లినిక్‌కు వస్తున్నట్లూ, మీ అమ్మ ఒప్పుకున్నట్లూ మదన్‌కి ఫోనుచేశాను. వాడు కావలసిన ఏర్పాట్లన్నీ చేశాడు.

మరునాడే మేము మదన్ క్లినిక్‌కి వెళ్ళాం.

మీ అమ్మకి కృత్రిమగర్భదారణ జరిగింది.

నువ్వు పుట్టావు.

ఈ పాతికేళ్ళూ నిన్ను పువ్వుల్లో పెట్టుకుని పెంచాము.

ఈనాడు నీకీరహస్యం ఇలా చెప్పవలసివస్తుందని కలలో కూడా అనుకోలేదు. కాలవైపరీత్యం చూడు. ఏనాడూ మేము తరవాత నీ జన్మాన్ని గురించి అనుకోలేదు. పూర్తిగా మరిచిపోయాం. కాని చూశావా ఈ వింత.

నిన్నటి రాత్రే మొదటిసారిగా నీమీద కోపంతో నువ్వు వర్ణాంతర వివాహం చేసుకుంటున్నావనే దుగ్ధతో ఈ రహస్యం బయటికి వచ్చింది. అదీ నువ్వు నిద్రపోతున్నావన్న దృష్టితోనే! కాని నువ్వు వినేశావు.

ఇది బాబూ నీ జన్మరహస్యం అని సోఫాలో చేరగిలబడిపోయాడు, చలపతిరావు.




జగదీష్ సోఫాకి ఆనుకుని సంభ్రమాశ్చర్యాలతో తండ్రి చెప్పినదంతా విన్నాడు.

కళ్ళు నీళ్ళతో నిండుకున్నాయి.

మెల్లగా లేచాడు.

అమ్మని వెంటనే చూడాలి అనుకున్నాడు. గదివేపు రెండడుగులు వేశాడు.

చలపతిరావుకి కొడుకు ఆంతర్యం అర్థంకాలేదు.

"బాబూ మమ్మల్ని పరాయివాళ్ళని చెయ్యకు. నేను నీ తండ్రిని కాను అనుకోకు. మీ అమ్మని క్షమించు జగదీష్'' అని బావురుమన్నాడు.

జగదీష్ గుండె కలుక్కుమంది. గుండెల మీద ఆడించిన తండ్రి ఏలోటూ తనకి తెలియనివ్వని తండ్రి. చెపితేనేగాని తను తెలుసుకోలేకపోయాడు. కన్నతండ్రి ఇంకెలావుంటాడు. నిజానికి తను, శాస్త్రీయంగా ఆలోచిస్తే అతనికి పుట్టినవాడు కానేకాడు. అయినా ఎంత ప్రేమగా పెంచాడు.

వెనక్కి గిరుక్కున తిరిగాడు.

చేతులు రెండూ చాచి గాఢంగా తండ్రిని

# లైఫ్‌బాయ్ ఎక్కడో ఆరోగ్యం అక్కడ




## లైఫ్‌బాయ్

**మురికిలోని క్రిములను వదలగొడుతుంది**

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

LINTAS L 98 1611 TL

కౌగిలించుకుని– "నాన్నా... నేను మీ కొడుకుని నాన్నా! ముమ్మాటికీ మీ కొడుకుని. నన్ను క్షమించండి నాన్నా. మిమ్మల్ని బాధపెట్టాను" అని ఏడ్చాడు జగదీష్.

"బాబూ జగదీష్.... మీ అమ్మ మనసు నీకు తెలియదురా. నీ జన్మ రహస్యం నీకు తెలిసిపోయినందుకు ఎంత బాధపడుతున్నదో. మీ అమ్మని ఎలా ఊరడిస్తావో. సిగ్గుతో నీకు ముఖం చూపించలేక ఎంత కుమిలిపోతున్నదో. వెళ్ళి మీ అమ్మని ఓదార్చునాయనా" అన్నాడు.

మెల్లగా కౌగిలి వదిలి నిర్మలాదేవి పడుకున్న పడకగదిలోకి మెల్లగా ప్రవేశించాడు.

మంచంమీద బోర్లాపడుకుని వెక్కివెక్కి ఏడుస్తుంది.

"అమ్మా" అని పిలిచాడు.

తల ఎత్తి చూసింది.
జగదీష్ కళ్ళలో కోటి సూర్యప్రభాకాంతి. ఆ పిలుపులో వెయ్యి వేణువులనాదం. మాతృత్వం పురివిప్పి మయూరనాట్యం చేసింది.

అంతలో తను చేసిన పొరపాటు మదిలో మెదిలింది. మళ్ళీ తలగడలో ముఖం దాచుకుని దుఃఖం పెల్లుబికిరావడంతో మరింత గట్టిగా ఏడవసాగింది.

జగదీష్ హృదయం మాతృప్రేమతో ద్రవించింది. తొమ్మిదినెలలూ మోసి, పాలిచ్చి పెంచిన తల్లి. అంత చెయ్యరాని నేరమేం చేసిందని ఇంత బాధపడుతున్నది. తన మనసు తెలియదా. తనని అంత సంకుచితభావాలు గలవాడుగా ఎలా వూహించింది.

తలఎత్తి తన ముఖంలోకి చూడలేకపోతున్నదంటే అమ్మ హృదయం ఎంత క్షోభిస్తున్నదో.

"అమ్మా! ఊరుకో అమ్మా... నాన్న అంతా చెప్పారు. దీన్లో నీ తప్పేముందమ్మా. తప్పుచేసినదాన్లా ఎందుకమ్మా అలా ఏడుస్తావు" అని ఓదార్చాడు.

అయినా కొడుకు ముఖం చూడలేకపోయింది.

"అమ్మా... నువ్వూరుకోకపోతే నామీద ఒట్టే" అన్నాడు.

దుఃఖాన్ని దిగమింగుకునే ప్రయత్నం చేసింది.

మెల్లిగా లేచింది. కొంగుతో కళ్ళు తుడుచుకుంది.

జగదీష్ మళ్ళీ ఓదార్పుగా అన్నాడు–

"అమ్మా... నువ్వింక ఏడవటానికి వీలులేదు. తప్పుచేసినవాళ్ళు ఏడవాలిగానీ నువ్వేం తప్పుచేశావు?".

జేబులోనుంచి రుమాలుతీసి ఉబికివస్తున్న అమ్మ కన్నీళ్ళు తుడిచాడు.

తల్లి పక్కనే మంచంమీద కూర్చున్నాడు.

అప్పుడే మెల్లగా చలపతిరావు ఆ గదిలోకి ప్రవేశించాడు. ఎంతో దీనవదనంతో దిగాలుగా కనిపిస్తున్న భార్యని చూడగానే కడుపులో దేవినట్లయింది. ఎంతోబాధ కలిగింది. ఏనాడూ భార్యమీద చెయ్యి చేసుకోని తను గట్టిగానే కొట్టాడు. తనుచేసిన పొరపాటుకి ఆమెకు శిక్షపడింది. ఆమె ఎంత వద్దని వారించినా ఆనాడు బలవంతంగా ఒప్పించాడు. మరో గత్యంతరం లేక వప్పుకుంది.

మెల్లగా కుర్చీమీద కూర్చున్నాడు.

జగదీష్‌కి తను ఎంత పొరపాటు చేసిందీ అర్థమైంది. తన పుట్టుక సంగతి తెలియక ప్రేమలోపడి అందరికీ ద్రోహంచేశాడు. తనకా అర్హతలేదు. అందరిలాంటి తల్లిదండ్రులు కారు తన తల్లిదండ్రులు. తను అందరిలాంటి కొడుకు అంతకన్నా కాదు. ఎన్నో ఆశలు తనమీదే పెట్టుకుని కనిపెంచారు. వాళ్ళ ఆశలు అడియాశలు చేసే హక్కు తనకి లేదు. అమ్మనీ, నాన్ననీ సంతోషపెట్టాలి. అప్పుడే తన జీవితం ధన్యమౌతుంది. ఇలాంటి తల్లిదండ్రులకోసం ఎన్ని త్యాగాలు చేసినా తక్కువే.

అమ్మకి తాను చేసిన పని తప్పు అనే అపోహలో వుంది. ఆ అపోహని తొలగించాలి- అనుకున్నాడు.

"అమ్మా... నేను చెప్పేది శ్రద్ధగా విన. నువ్వు చేసింది నాదృష్టిలో తప్పుకాదు. పాపం, నీతిమాలిన పని అంతకన్నా కాదు. భర్త సంతోషంకోసం భర్త అనుమతితో చేసిన పని ఏ స్త్రీ చేసినా తప్పుకాదు. పురాణాలమీద నకు నమ్మకం లేదు. కాని నీకోసం పురాణాల ఉదాహరణ తీసుకుంటున్నాను. మన పురాణాల్లో కూడా ఆ విషయం స్పష్టంగా వుంది. ప్రతి




మహాపతివ్రత కాదా? కుంతి ఇల్లాలు కాదా? మాద్రి పవిత్రురాలు కాదా? ఆనాటి సమాజం వారిని ఎందుకు హర్షించింది?

కుంతి, మాద్రుల విషయమే తీసుకుందాం. పాండురాజు శాపగ్రస్తుడు. భార్యలను ముట్టుకుంటేనే చనిపోతాడు. కాని వంశం నిలబడాలి. అటువంటి పరిస్థితిలో వేరే గత్యంతరంలేక పాండురాజు అనుమతితో ఇష్టదేవతలను ప్రార్థించి వారి పొందుతోనో లేక వరాలతోనో పిల్లలను కనలేదా? వారిని సంఘం వెలివేసిందా. కుంతిని కులట అని ఎవరైనా అనగలరా! అనలేరు ఎందుకు ఆమె తన భర్త అజ్ఞమేరకే అలా పిల్లలను కన్నది. మాద్రి కూడా అంతే! తన కారణంగా మరణించిన భర్తతో చితి ఎక్కిన ఆమె పతివ్రత కాదా!

చలపతిరావుకు కొడుకు మేధావి అని తెలుసును. కాని తన ఎదుటే ఆ తెలివిని ప్రదర్శించవలసిన అవసరం అతడికెప్పుడూ రాలేదు. ఎన్ని ఉదాహరణలు ఇస్తున్నాడు 'పుత్రోత్సాహము మనమున పెల్లుబికగా కొడుకునే చూస్తూ వుండిపోయాడు చలపతిరావు.

నిర్మలకి వున్న దిగులు తీరిపోయింది. కొడుకు తనని సరిగ్గానే అర్థంచేసుకున్నాడని మనసులోనే ధన్యవాదాలు అర్పించుకుంది.

మళ్ళీ జగదీష్ అందుకున్నాడు– "అమ్మా... చితి అనగానే జ్ఞాపకం వచ్చింది. మన హిందూసమాజంలో వున్నన్ని సాంఘికదురాచారాలు మరో సమాజంలో లేవు. అవి రానురాను మారుతూ వస్తున్నాయి. ఇది ధర్మం, ఇది అధర్మం అని గిరిగీసి చెప్పగలమా! ఇది చట్టసమ్మతం, ఇది చట్టసమ్మతంకాదు అని చెప్పలేము. మారుతున్న సమాజాన్నిబట్టి అవీ మారుతూ వుంటాయి. ఒక మతంలోవున్న ధర్మం మరో మతంలో అధర్మం. ఒక మతంలో గల ఆచారం మరో మతంలో దురాచారంగా పరిగణింపబడుతున్నది. మరి అందరూ మనుమలే. ఇందాక చెప్పిన సతీసహగమనాన్నే తీసుకుందాం. మాద్రిని ఆనాటి సమాజం పతివ్రత అంది. ఈనాడైతే ఆమెని చితి ఎక్కనిచ్చేవారా? ఎక్కడుంది అంతరం? మారిన మనుమల్లో కాదా?

రాజా రామమోహనరాయ్, బెంటింగ్‌దొరలు సతీసహగమనాన్ని నేరంగా పరిగణించి చట్టంచేశారు. అప్పుడు హిందూసమాజమంతా ఏకమై వ్యతిరేకించినా తరవాత వాళ్ళలో మార్పు వచ్చింది. ఈనాడు సతీసహగమనం తప్పే అని అందరూ అంటారు. ఆనాడు భర్తతో చితి ఎక్కని స్త్రీ కులట. ఈనాడు 'సతి' చట్టవ్యతిరేకమైన నేరం.

కొంతమంది కాలాతీతవ్యక్తులు పుడతారు. వాళ్ళు సాంఘిక దురాచారాలను తూర్పారబట్టి జనవాహినీ ప్రవాహాన్ని దారిమళ్ళిస్తారు. వాళ్ళ ఆలోచనలు అధునాతనంగా వుంటాయి. వాళ్ళు జీవితానికి ఓ కొత్త భాష్యం చెప్పి కొత్త వరవడి దిద్ది నూతనమార్గాలు పట్టిస్తారు.

"బాల్యవివాహాలు ఆగిపోయాయి. విధవా వివాహాలు చేసుకోవడానికి ఆదర్శయువకులు ముందుకు వస్తున్నారు. ఓ పదేళ్ళక్రితం గర్భవిచ్ఛేదం చెయ్యడానికి ఏ డాక్టరూ ఒప్పుకునేవాడు కాదు. ఈనాడు ప్రతి హాస్పిటల్‌లోనూ చట్టసమ్మతంగానే భ్రూణహత్యలు జరుగుతున్నాయి. దేన్నీ ఇది తప్పు అని గిరిగీసి చెప్పలేం. ఈనాటి తప్పు రేపు ఒప్పు కావచ్చును. ప్రతి పనీ ఎక్కడో మొదలుకావాలి. ఈనాడు అమ్మచేసింది లోకానికి తప్పుగా కనిపించవచ్చును. ఈమె ఎంత నీతిమాలిన పనికి ఒప్పుకుంది అని ఎవరైనా అనవచ్చును. కాని రేపటి మనుమలు దీనిని తప్పుగా భావించరు. స్త్రీకి తల్లి అయ్యే హక్కువుంది. ఆ హక్కుని ఎవ్వరూ కాదనలేరు. భర్త అశక్తుడు, వ్యాధిగ్రస్తుడు అయినప్పుడు ఇలా కృత్రిమగర్భధారణ పొంది పిల్లల్ని కనడంలో తప్పులేదు. మరో స్త్రీకి గర్భాశయంలో వ్యాధివలన పిండోత్పత్తిని సాధించలేనప్పుడు ఆమె భర్త వీర్యకణాలు టెస్ట్‌ట్యూబులో పిండోత్పత్తిని సాధించి గర్భాశయంలో ప్రవేశపెట్టి పిల్లల్ని కనేలాగ ఇప్పుడు డాక్టర్లు చేస్తున్నారు. అలా చేయడం ధర్మమే. పిల్లలు లేని సంసారంలో సంపూర్ణత్వం లోపిస్తుంది.

అమ్మా... అందుచేత పిల్లలకోసం డాడీ ఆమోదంతోనయినా ఆయన బలవంతంచేతనయినా నువ్వు నన్ను కనడంలో తప్పులేదమ్మా. ఈనాటి మనుమల సంగతి నీకెందుకమ్మా? రేపటి మనుమలు సంతానంకోసం శాస్త్రీ

యమైన పద్ధతులను తప్పకుండా ఆమోదిస్తారు. ఆరోగ్యమైన పిల్లలు కావాలి అనే దంపతులు నేడు హైబ్రీడ్ విత్తనాలకోసం వెళ్ళే రైతుల లాగా ప్రభుత్వం స్థాపించిన ఆర్టిఫిషియల్ ఇన్‌సెమినేషన్ సెంటర్లకు వెళతారు. ఆరోగ్యవంతులైన పిల్లల్ని కంటారు. రానున్న తరాలలో సెక్సుకీ, పిల్లల్ని కనడానికీ ఎలాంటి సంబంధంవుండదు. అదంతా ఎందుకు- నేను నీ కొడుకుని, నువ్వు నా తల్లివి. లోకంతో మనకేం పనమ్మా?'' అని నిర్మల అనుమానాలన్నిటినీ పటాపంచలు చేశాడు.

''బాబూ... జగదీష్!'' అని అక్కునజేర్చుకుంది కొడుకుని.

''అమ్మా...'' అని తల్లిని కౌగిలించుకున్నాడు జగదీష్.

చలపతిరావు కళ్ళు చెమర్చాయి. మనస్సులో అలముకున్న మేఘాలు జగదీష్ మాటల జంఝూమారుతానికి చెల్లాచెదురుగా ఎగిరిపోయాయి. తుఫాను తాకిడి తగ్గిన ప్రశాంతసాగరంలా మనస్సు తేలికైంది. మబ్బులు తొలగిన ఆకాశంలా హృదయం నిర్మలమైంది.

నిజం తెలిస్తే కొడుకు ఎక్కడ దూరమౌతాడో, ఎక్కడ మనస్సు విరక్తి చేసుకుంటాడో అని నిర్మలా చలపతిరావు కూడా అనుకున్నారు. చిత్తశుద్ధితో చేసిన కార్యాలకి ఎప్పుడూ ఎలాంటి అవాంతరం రాదని చలపతిరావు అర్థంచేసుకున్నాడు?

కాని తన గురించి ఏమనుకుంటున్నాడు.

నిర్మల జగదీష్ కన్నతల్లి అనడంలో సందేహం లేదు. కాని తాను అతనికి తండ్రిస్థానంలో వున్నాడా!

''నాయనా జగదీష్... నేను నీతండ్రినికాను అనే శంక నీకు కలగడంలేదు గదా'' అన్నాడు- యధాలాపంగా అడిగినా గొంతు వణికింది.

''మీరలా ఎందుకనుకున్నారు డాడీ! అంకురం సంకల్పంతో మొదలౌతుంది. మీ సంకల్పంలేకపోతే నేను పుట్టేవాడినా? నాటకుండా విత్తనం మొలకెత్తుతుందా! మీ సంరక్షణలో మీ పెరటిలో పెరిగిన మొక్కని నేను. మీరు నాకు జీవితాన్ని ప్రసాదించారు. నా జీవితంలో సాధించే ఫలాలు మీవే. నేను నిజంగా మీ కొడుకుని డాడీ! మీ భావాలే నాలోనూ జీర్ణించుకున్నాయి. అందుకనేనేమో ఎవ్వరూ చెయ్యలేని పనులు చెయ్యాలనే కోరిక.

డాడీ! మనిషి పుట్టుకతోనే ఏదీ నేర్చుకోడు. తల్లిదండ్రులపెంపకంలోనే దొంగగానో, దొరగానో మారతాడు. బాధ్యతారహితంగా పిల్లల్ని కనేసి రోడ్లమీద అశ్రద్ధగా వదిలేసేవాడే తండ్రి అనుకుంటే- తండ్రి అనే పవిత్రపదానికి అర్థంలేదు.

పిల్లల బాగుకోసం అహోరాత్రాలూ శ్రమించి వాళ్లని క్రమశిక్షణతో పెంచి ప్రయోజకుణ్నిచేసిన వాడే తండ్రి. అవన్నీ మీరు నాకు చేశారు. మీరే నా తండ్రి దైవం- అన్నీను.

పుట్టిన శిశువుని చిన్నప్పుడే తల్లిదండ్రుల నుంచి విడదీసి పెద్దయిన తరవాత నీ తల్లిదండ్రుల్ని గుర్తించు అని వెయ్యిమందిని చూపిస్తే తన తల్లిదండ్రుల్ని ఆ పెద్దయిన శిశువు గుర్తించగలడా- ఎప్పుడూ గుర్తుపట్టలేడు. తల్లి ఎవర్ని తన తండ్రిగా పరిచయం చేస్తుందో అతడే తండ్రి అని పిల్లలు నమ్ముతారు- నేనూ అంతే. మనిషికి అతీంద్రియశక్తులులేవు. ఆత్మీయత, అనుబంధం, సహవాసం వల్లనే ఏర్పడతాయి. గట్టిపునాదులమీద అవి పెరుగుతాయి. ఇప్పుడిక ముల్లోకాలూ ఏకమై ఈయన మీ తండ్రికాదు అన్నా నాకనవసరం. నా ప్రేమ నాఫీలింగ్ నాకు ముఖ్యం, మీరు ఇంక ఎలాంటి శంకా, దిగులూ పెట్టుకోకండి నాన్నా!''

అని తల్లివేపు చూశాడు జగదీష్.

''అమ్మా... ఇప్పుడు నీకో ముఖ్యమైన విషయం చెప్పాలి. నేను నలిగిన బాటనే మందలో గొర్రెలా నడిచిపోయేరకాన్ని కాదు. సరియైన కొత్తమార్గాన్ని ఎన్నుకోగల ధైర్యం నాకుంది. నాకు పున్నామ నరకంమీద నమ్మకంలేదు. కాని ''అపుత్రస్యగతిర్నాస్తి'' అని నన్ను కనిపెంచారు. ఇంతవాణ్నిచేశారు. అందరి కొడుకులకన్నా కొడుకుగా నా బాధ్యత ఎక్కువైంది. నాకు అప్పుడు నా పుట్టుక రహస్యం తెలియక నమతని ప్రేమించాను. సరే...

 

ఇంక నమతని మరచిపోతాను. మీరు ఎలా చెపితే అలాగే చేస్తానమ్మా! నన్ను క్షమించమ్మా''

చలపతిరావు నిర్విణ్ణుడయ్యాడు.

నిర్మలకి దుఃఖంవచ్చింది.

ఏమిటీ కట్టుబాట్లు? కులాలేమిటి? గోత్రాలేమిటి? ఇవన్నీ మనిషి సృష్టించిన అడ్డుగోడలు కావూ? తను ప్రాణసమానంగా ప్రేమించిన కొడుకుని వదులుకుని మరో ఎల్లయ్యనో, పుల్లయ్యనో కొడుకుగా చూసుకోమంటే చూసుకోగలదా తను? ఆ ప్రేమ వస్తుందా? ఆ వాత్సల్యం



పెళ్ళిబుకుతుందా? ఏడాదినుంచి ఒకరొన్కరు అర్థంచేసుకుని ప్రేమించుకున్న జంటని విడదియ్యడం ఏమిధర్మం. కులం అనే ఒక్క అర్హతను ఆధారంచేసుకుని మనసుకి నచ్చని పిల్లని తెచ్చి పెళ్ళిచేస్తే తన కొడుకు సుఖపడతాడా?

ఒద్దు... ఖుమ్మాటికీ అలా జరగవద్దు.

"నువ్వు చేసింది తప్పుకాదురా జగదీష్... తప్పుచేసింది నేను. మూర్ఖత్వంలో ఈ కులాలు, మతాలు, మూఢనమ్మకాలు జీర్ణించుకుపోయి ఇంత పనిచేశాను. నువ్వు మనసులేని మనువు చేసుకుంటే మేము సహించగలమా? నేను బతకగలనా. ఒద్దు బాబూ... వద్దు. పిల్లని చూశాము. ఎంతో బుద్ధిమంతురాలు, మీ నాన్నగారి సంగతి నీకు తెలుసునుగదా- కట్నాలు కానుకలకు వ్యతిరేకి. అలాంటప్పుడు నీకు నచ్చిన సంబంధం చేసుకోవడంలో తప్పేముంది? సమతనే చేసుకో' అంది.

చలపతిరావు గుండెల్లోనుంచి పెద్దబరువు దిగిపోయినట్లయింది. నిర్మలలోనేనా ఇంత పరివర్తన!

జగదీష్‌కి సమత గుణగణాలు తెలుసును కాని తల్లిదండ్రులు కూడా అర్థం చేసుకోవాలి- ఆమెను కోడలుగా ప్రేమించాలి. ఆమె కోడలుగా రావడంకన్నా ఏంకావాలి. అనుకోవాలి. అంతేగాని ఇదుగో కోడల్ని తెచ్చాను అని వాళ్ళకి ప్రశ్నించే చాన్సయినా లేకుండా చెయ్యదలచుకోలేదు. అందుకే-

"అమ్మా... నువ్వొప్పుకున్నావుగదా ఇంకేం అనిచంకలు గుద్దుకుని రేపే పెళ్ళిచేసుకుంటాననుకోకు. సమతని కేవలం పరిచయం చేశాను. అంతే! నేను ఆ అమ్మాయిని ప్రేమించాను గనక ఆ అమ్మాయి నాకు బాగానే వుంటుంది. కాని మీకు కోడలుగా మన ఇంట్లో మసలగలుగుతుందో లేదో మీరూ చూసుకోవాలా వద్దా. మీకు మరో కొడుకున్నాడు గనకనా తరవాత మరో మంచి కోడలుని తెచ్చుకోవడానికి. ఇది పెళ్ళి. బొమ్మలాటకాదు. ఎలాంటి రిస్కూ తీసుకోవద్దు. అన్నివిధాలా మీకు నచ్చిన తరవాతనే వాళ్ళ పెద్దవాళ్ళతో మాట్లాడుదురుగాని. నాకిప్పుడు పెళ్ళికేమీ తొందరలేదు" అన్నాడు.

"లేదురా జగదీష్... నువ్వు నమ్ముతావోలేదో గాని ఆ అమ్మాయిని చూడగానే నాకు మంచి అభిప్రాయం ఏర్పడింది. మెరుపు తీగలా వుందిరా. ఆ అమ్మాయి నా కంటికి నచ్చిందనే కులం అడిగాను. లేకపోతే వచ్చిన ప్రతివారినీ మీకులం ఏమిటి అని అడుగుతున్నానా? అన్నం వుడికిందో లేదో తెలుసుకోవడానికి మొత్తం అన్నం తినాలా- ఓ మెతుకు చూస్తే చాలదూ! పిల్ల మంచిదిరా. ఇంతదూరం ఎలాగూ వచ్చాము. ఇప్పుడే పెళ్ళికి ఒప్పుకోరా" అంది నిర్మల.

చలపతిరావుకి ఆ ధోరణి చూస్తే నవ్వొచ్చింది. జగదీష్ కూడా నవ్వసాగాడు. ఆ ఇంట్లో కారు చీకట్లు కమ్మిన ఛాయలు ఇప్పుడు కనిపించడంలేదు. వాళ్ళ నవ్వుల కిలకిలారావాలతో ప్రకృతే పరవశించింది.

జగదీష్ మాత్రం అంత తేలిగ్గా ఒప్పుకోదలచుకోలేదు. సమత సహకారం తనకి వుంటుంది. ఆమె ఎంతకాలమైనా తనకోసం ఆగి ఎలాంటి పరీక్షలోనైనా నెగ్గుతుందనే నమ్మకం వుంది. ఇంతకాలం సమతకీ తనకీ మధ్య నడిచింది కేవలం తియ్యని స్నేహమే. ఇప్పుడు ప్రేమలో పడ్డారు. ఇలా కొంతకాలం అమలిన శృంగారంలోని మాధుర్యాన్ని కూడా అనుభవించాలి. ఒక్కమారు శారీరికమైన సుఖం పొందితే ఈ థ్రిల్ వుండదు. ఈలోగా వస్తూపోతో వుండటంతో సమతని అమ్మానాన్నా బాగా అర్థం చేసుకుంటారు అనుకున్నాడు.

"అమ్మా... నేనెప్పుడైనా పెళ్ళి చెయ్యండి, పెళ్ళి చెయ్యండి అని మిమ్మల్ని అడిగానా? మీరింత త్వరగా నిర్ణయం తీసుకుని పెళ్ళి చెయ్యాలనుకున్నా నేను చేసుకోను. కొంత గడువివ్వండి. ఈలోగా మీరిద్దరూ సమత గుణగణాలను పరీక్షించుకొండి" అన్నాడు.

"నువ్వు తొందర పడుతున్నావని ఎవరన్నారురా! నాకే తొందరగా వుంది. ఈ ఏడాదితో నీకు పాతిక సంవత్సరాలు నిండుతాయి. పెళ్ళికి సరియైన ఈడు. మాకేమీ నీ ప్రియురాలిని పరీక్షించాలనే కోరికలేదు. మాకిష్టమేనని ఎన్ని మార్లు చెప్పాలి" అంది కాస్త చికాకు పడుతున్నట్లు.

చలపతిరావుకి కూడా కొడుక్కి పెళ్ళిచెయ్యాలని రిటైరైన దగ్గర్నుంచీ వుంది. ఓ మనుమడో

మనుమరాలో పుడితే వాళ్ళతో హాయిగా కాలక్షేపం అయిపోతుందనే ఆశ. కాని అతనికి ఒకరి అభిమతానికి వ్యతిరేకంగా ఏపని చేయించడం ఇష్టం వుండదు. కొడుకు అభిమతం తెలిసిపోయింది గనక ఇంక బలవంతం చెయ్యడం బాగుండదు. అయినా ఏదో చిన్న పరీక్ష నిజంగానే పెట్టి ఆ సమతతోటే పెళ్ళిచెయ్యాలని అనుకున్నాడు.

"సరేలేవే... మనకేం తొందర, పెళ్ళి చేసుకునేది వాడు. వాడికిష్టమైనప్పుడే చేసుకుంటాడు" అని సంభాషణ అంతటితో ఆపేశాడు.

ఆ వ్యవహారం అంతటితో పూర్తయింది. మళ్ళీ ఎవరిపనుల్లోవాళ్ళు నిమగ్నమయ్యారు.

ఆరోజు రాత్రే సమతకి ఎలాంటి పరీక్ష పెట్టాలా అని చలపతిరావు తీవ్రంగా ఆలోచించాడు. ఉద్యోగం చేస్తోంది గదా! ఆ అమ్మాయి సంసారపక్షమైనదేనా? ఆమె తెలివితేటలు ఎలాంటివి? ఆలోచిస్తూనే నిద్రపోయాడు.

మరునాడు సమత వాళ్ళ చిన్నాన్న ఎడ్రసు జగదీష్‌నే అడుగుదామనుకున్నాడు. కాని అలా చేస్తే సమతని జగదీష్ ఎలర్ట్ చేసే అవకాశం వుందని ఆ ప్రయత్నం విరమించుకున్నాడు.

కొడుకు ఆఫీసుకి వెళ్ళగానే అతడి బెడ్‌రూమ్‌లో ప్రవేశించాడు. భార్యకి కూడా తన ప్రయత్నం చెప్పలేదు. జగదీష్‌కి కొన్ని మంచి అలవాట్లున్నాయి. కొత్తగా పరిచయమైన వారి ఎడ్రసులు డైరీలో అల్ఫబెటికల్ ఆర్డర్‌లో తప్పకుండా రాస్తాడు.

వెతికి ఎడ్రసు నోట్ చేసుకున్నాడు.




ఆ రోజు సాయంత్రం నాలుగు గంటలకే చలపతిరావు వాకింగుకని బయలుదేరాడు. భార్యతో- "నిర్మలా... కాస్త ఆలస్యమైనా కంగారు పడకండి. ఈరోజు రామకృష్ణమఠంలో ఓ స్పీచ్ వుంది- విని వస్తాను. అబ్బాయీ, నువ్వూ భోజనం చేసెయ్యండి" అని చెప్పి మరీ బయలుదేరాడు.

ముందుగా టాంక్‌బండ్ దాకా నడిచివెళ్ళాడు. అయిదు గంటలకిగాని బేంకు ఉద్యోగులు బయటికిరారు. సమత ఇల్లు చేరేసరికి ఆరుగంటలౌతుంది. ఆ సమయానికి ఇల్లు చేరుకుంటే చాలు అనుకున్నాడు.

టాంక్‌బండ్ మీద ఓ సిమెంటు సోఫామీద కూర్చున్నాడు. సాయంత్రపు ఎండ హుసేన్‌సాగర్ నీటిమీద పడి తళతళలాడుతోంది. బస్సులు వస్తూపోతూ వున్నాయి. ఫుట్‌పాత్ మీద జనం అటూఇటూ నడుస్తున్నారు.

చలపతిరావు మదిలో సమత మెదిలింది. నిజానికి ఆ అమ్మాయిని పరీక్షించాలనే కోరిక తనకిలేదు. ఆ అమ్మాయి సైకాలజీని ఆరోజే కాస్త గ్రహించాడు- పిల్లమంచిదే.

కొడుకుని తృప్తి పర్చడానికి మాత్రమేగానీ నిజానికి ఒక వ్యక్తి గుణగణాలను అంచనా వెయ్యడం అంటే మాటలా? ఎన్నికోట్ల మంది వ్యక్తులున్నారో అన్నికోట్ల ప్రవృత్తులు- అన్ని రూపాలు, అన్ని గొంతులు. ఏమనిషి వ్యక్తిత్వం ఆ మనిషిదే.

మనిషి ప్రవర్తనమీద పరీక్ష పెట్టడం అంటే మాటలా! కెమిస్టు లిటమస్ పేపర్లు వాడి ఏసిడ్ టెస్టు చేసినట్లు చెయ్యడానికి వీలవుతుందా! ఇది అంతరంగానికి సంబంధించిన విషయం. ఎవరి గుండె ఎలాంటిదో, ఎవరి మనస్సు ఎలాంటిదో ఒకే సంఘటనలో ఎవరెలా స్పందిస్తారో చెప్పడం ఎవరితరం.

తన మట్టుకితాను ఎలాంటి కోడలితోనైనా సరిపెట్టుకోగలడు. తనకివచ్చే పెన్షనులో నిర్మలా, తనూ హాయిగా బతకగలరు. పిల్లలు జీవితాంతం తల్లిదండ్రుల్ని అంటిపెట్టుకునే వుండాలి అంటే కుదురుతుందా?

సృష్టిలో ఎన్ని జీవరాశులులేవు.

పక్షులు గూడుగట్టి గుడ్లుపెట్టి పొదిగి పిల్లల్ని చేస్తాయి. వాటి కడుపులు మాడ్చుకుని

ఆహారం తెచ్చి రెక్కలొచ్చేదాకా పిల్లల్ని సాకు తాయి. రెక్కలొచ్చిన తరవాత ఎగరడం నేర్పు తాయి. తరవాత ఎవరికివారే.

మానవులకే ఈ కట్టుబాట్లు, నిబంధనలు. జగదీష్ తాము కొన్నాళ్లు విడిగా ఎక్కడో వుంటాం అన్నాక నాకెలాంటి అభ్యంతరంలే దు. కాని నిర్మల తట్టుకోలేదు. అందుకే కనీసం ఆమె కోసమైనా సమత సైకాలజీ తెలుసుకోవా లని నిశ్చయించుకున్నాడు.

టైం చూసుకున్నాడు. అయిదుగంటలు కా వస్తూంది. విద్యానగర్ వెళ్లి ఆ కృష్ణమూర్తిగారి ఇల్లు వెతకాలి. మెల్లగా లేచాడు.

రోడ్ క్రాస్‌చేసి లిబర్టీ టాకీసువైపు నడిచా డు. బస్‌స్టాపులో అరగంట నిలబడ్డా కావల సిన బస్సు రాలేదు. ఆటో మాట్లాడేసుకుని విద్యానగర్ చేరుకున్నాడు.

చలపతిరావు అట్టే శ్రమపడకుండానే కృష్ణ మూర్తి ఇల్లు కనుక్కోగలిగాడు.

కృష్ణమూర్తి భార్య అన్నపూర్ణకి గేటు తెరుచు కుని వస్తున్న వ్యక్తి ఎవరో అర్థంకాలేదు.

పొరపాటున తమ ఇంటికి వస్తున్నాడేమో నని "ఎవరు కావాలండీ?" అనడిగింది.

"ఇది కృష్ణమూర్తిగారిల్లేనా?"

"అవును... రండి" అని లోనికి ఆహ్వా నించింది. అప్పుడే ఆఫీసునుంచి వచ్చి లోపల పేపరు చదువుకుంటున్న భర్త కృష్ణ మూర్తిని పిలిచింది.

కృష్ణమూర్తి బయటకు వచ్చాడు.

వచ్చిన ఆగంతకుడెవరో ఆయనకీ అర్థంకా లేదు.

"మీకు ఏ కృష్ణమూర్తి కావాలండీ?" అనడి గాడు.

చలపతిరావు కొంచెం ఇబ్బందిపడ్డాడు. ఏనాడూ పరిచయంలేకుండా అలా పిలవని పేరంటానికి వెళ్లినవాడు కాడు. తనని తనే పరిచయంచేసుకున్నా వాళ్లకి అర్థంకాదు. పరి స్థితికి నవ్వుకున్నాడు.

"సమత ఆఫీసునుంచి రాలేదా?" అనడిగా డు. అప్పటికి వాళ్లకి కొంచెం స్ఫురించింది.

షష్టిపూర్తి చేసుకున్నా కళతగ్గని అతని ముఖవర్చస్సుని వాళ్లమ్మాయి సమత ఇంతకు ముందే వర్ణించి చెప్పింది.

"రండి... దయచేయండి. వచ్చే వేళ యింది. అలా కుర్చీలో కూర్చోండి" అని వరండాలోని కుర్చీని చూపెట్టాడు కృష్ణమూర్తి.

"నన్ను మా జగదీష్ పంపించాడు" అన్నా డు చలపతిరావు సంభాషణ ప్రారంభిస్తూ.

వచ్చిందెవరో కృష్ణమూర్తి దంపతులకి స్ప ష్టంగా అర్థమయింది.

కృష్ణమూర్తి ఇబ్బందిపడ్డాడు– "తమరు చలపతిరావుగారా? మా అమ్మాయి మీ గు రించి చెప్పింది. పేరైనా చెప్పారు కాదు. మేము తికమకపడి మిమ్మల్ని కూడా తికమక పెట్టాం" అన్నాడు.

"ఫరవాలేదులెండి"

అన్నపూర్ణ ఇక అక్కడ వుండలేదు. లోనికె ళ్లి గబగబా గదులన్నీ సర్దింది.

చలపతిరావు నిరాడంబరత్వానికి, కలుపుగో లుతనానికి కృష్ణమూర్తి ఆశ్చర్యపోతుండగా సమత అప్పుడే బస్సుదిగి ఇంటికి వచ్చింది. వాళ్లింటిలోంచి కొత్తమనిషి లీలగా కని పిస్తుంటే, ఎవరబ్బా అనుకుంటూ లోపలికి ప్రవేశించింది.

వరండాలో కృష్ణమూర్తినీ, చలపతిరావుని చూసి ఆనందాతిరేకంతో హృదయం లయ తప్పినట్లయింది.

అనుకోని హటాత్సంఘటనకి ఆశ్చర్యపో యింది.

"నమస్కారం అంకుల్" అని రెండు చేతు లూ ముకుళించి నమస్కారం పెట్టింది.

రెప్పలార్పకుండా సమతని గమనించాడు చలపతిరావు. సమత కలవరపడింది. "ముందుగా తెలిస్తే సెలవుపెట్టేదాన్ని అంకుల్! ఎంతసేపయిందో మీరొచ్చి?" అంది నొచ్చుకుంటూ.

"ఎందుకమ్మా... అంత కంగారుపడతావు. మీ నాన్నగారితో లోకాభిరామాయణం మాట్లాడే అవకాశం దొరికింది. వెళ్లు... వెళ్లి కాస్త ముఖం కడక్కుని రిఫ్రెష్ అయిరా" అన్నాడు.

అసలితనికి కొత్తనేదేలేదే. స్వంత ఇంట్లోలాగే ఎంత ఫ్రీగా మాట్లాడుతున్నారో అనుకున్నారు




ముగ్గురూ.

పది నిమిషాల్లో తయారై వచ్చింది సమత. చలపతిరావు కళ్లకి అందాలభరణిలాగే కని పించింది. రూపం కాదు— ఇప్పుడామె గుణం చూడాలి అనుకున్నాడు.

ఈలోగా బిస్కట్లూ, నాలుగు కప్పుల కాఫీ ట్రేలో తెచ్చి అన్నపూర్ణ టీపాయ్‌మీద పెట్టింది.

"తీసుకొండన్నయ్యా" అని చలపతిరావు నుద్దేశించి చెప్పింది.

నలుగురూ కాఫీలు తాగారు.

"చాలా సంతోషం అంకుల్— మీరు మా ఇంటికి వచ్చారు" అని సమత సంభాషణ ప్రారంభించింది.

ఊరకేరారు ఏదో కారణం వుండే వుంటుంది— అని గ్రహించింది సమత.

తనకి కావలసిన సమత రానే వచ్చింది. వచ్చినపని పూర్తిచేసుకుని వెళ్లాలనుకున్నాడు చలపతిరావు.

"కృష్ణమూర్తిగారూ... మీ అమ్మాయి సమ తని ఏకాంతంలో కొన్ని ప్రశ్నలు అడగాలి. మమ్మల్ని ఏకాంతంలో మాట్లాడుకోనిస్తారా?" అనడిగారు.

"అలాగే... దానికేం అభ్యంతరం" అన్నా డు కృష్ణమూర్తి. "వెళ్లమ్మా... అంకుల్‌ని నీ గదికి తీసుకునివెళ్లి మాట్లాడు" అని సమతకి పురమాయించాడు.

"రండంకుల్" అని లోనికి తోవతీసింది సమత. అది మిడిల్ ఇనకమ్ గ్రూపు ఇల్లు. ఓ హాలులోనుంచి నడిపించింది. హాలుని కలియ చూశాడు. పక్కనున్న రేక్‌లో పుస్తకాలు చక్కగా అమర్చివున్నాయి. వీళ్లూ బుక్ లవర్స్ అనుకు న్నాడు.

రెండు బెడ్‌రూముల్లోనూ ఒకదాన్ని సమత కే కేటాయించారు. ఆ గదిలోనికి తీసుకునివె ళ్లింది.

గదిని చూడగానే సమత మనోప్రవృత్తి అర్థ మైంది. ఓటేబుల్. దానిమీదే టేబుల్‌లాంపు. కొన్ని పుస్తకాలు. మంచం. దానిమీద పరుపు, తలగడలు. గోడ బీరువా. దానిలో చీరలు. నీట్‌గా కొన్ని హేంగర్లలోనూ, కొన్ని అరలలోనూ సర్దివున్నాయి.




రెండు కుర్చీలూ వాటిమీద ఫోమ్‌మెత్తలూ వేసున్నాయి. గోడలమీదికి దృష్టిసారించాడు. రెండేరెండు సీనరీలు- బయటి ప్రపంచాన్నీ ప్రకృతి సౌందర్యాన్ని చూపిస్తున్నాయి. సమత అంతరంగం, అభిరుచులు అర్థమయ్యాయి.

"కూర్చోండి అంకుల్" అని కుర్చీని చూ పించింది.

చలపతిరావు కుర్చీలో కూర్చున్నాడు.

సమత రెండో కుర్చీలో కూర్చుంది.

చలపతిరావు తోవలోనే సమతని ఎలా పరీ క్షించాలో ఆలోచించుకున్నాడు. జీవితం ఎవరి దివారిదే. అయినా పదిమందితో ముడిపడి వుంటుంది. సరియైన క్రమశిక్షణ, కట్టుబాట్లు, సాంఘిక నియమాలు సాంఘిక సహజీవనం మీద సదవగాహనవున్నవాళ్ళు ఆలోచించేతీరు ఇంచుమించు ఒక్కలాగే వుంటుంది. అటు వంటివాళ్ళు సమస్యలను అర్థం చేసుకోగలరు. వారు సమస్యలకి చూపించే పరిష్కారం కూడా సర్వజనామోదకంగా వుంటుంది.

సమతకి చలపతిరావు ఎందుకు వచ్చిందీ తెలుసును. ఓ నెలరోజులక్రితం దాకా తన హృదయాన్ని మనస్సుని తనలోనే పదిలంగా దాచుకుంది. కాని తర్వాత వాటిని జగదీష్‌కే అర్పించుకుంది. పెళ్ళంటూ జరిగితే అతని తోనే లేదా జీవితాంతం తల్లిదండ్రులను అంటిపెట్టుకుని వారి రుణంతీర్చుకుంటూ బ్ర హ్మచర్యం చెయ్యడమే. తాను పరీక్షలో నెగ్గక పోతే పెళ్ళి అయ్యే యోగ్యతని పోగొట్టు కుంటుంది. ఉద్యోగాలకి, ఇంటర్వ్యూలకి వెళ్ళి నప్పుడు కూడా ఏనాడూ ఇంత టెన్షన్ అనుభ వంలోనికి రాలేదు.

"అడగండంకుల్" అంది ఎంతో మర్యా దగా.

ఎలాంటి పరీక్షపెడతాడో, ఏమడుగుతాడో నని భయంగా వుంది.

చలపతిరావు "ప్రశ్నలు అడిగి నిన్ను వేధి స్తాననుకున్నావా అమ్మాయ్! లేదు. నీకు ఆసక్తి కలిగించే ఓ భేతాళకథ చెపుతాను. దానికి నువ్వు సమాధానం చెప్పాలి-! అంతే" అన్నా డు.

"చెప్పండయితే" అంది

చలపతిరావు గొంతు సవరించుకుని కథ

మొదలుపెట్టాడు.

గదిలో నిశ్శబ్దం.

"అనగనగా ఓ విప్రనారాయణ. ఆయనకి అందమైన మనసెరిగిన సోమిదమ్మ అనే భార్యవుండేది. ఎంతో అన్యోన్యంగా కాపురంచేశారు. వాళ్ళనిమించిన అదృష్ట వంతులులేరు- అనుకున్నారందరూ. కాని వాళ్ళంత దురదృష్ట వంతులు లేరని కాలం నిర్ణయించింది. వాళ్ళకి సంతానం కలగలేదు. ఐదేళ్ళు గడిచాయి. సంతానం కలగలేదు. పిల్లలు పుడతారనే ఆశమాత్రం చావలేదు. పదేళ్ళు గడిచిపోయాయి. పిల్లలు పుట్టలేదు. కొలవని దేవుడు లేడు. తిరగని తీర్థంలేదు. గొడ్డుబోతు జీవితం చాలించాలనే అనుకున్నారు. కాని జీవితంమీది తీపివారిని చావనివ్వలేదు.

విప్రనారాయణకి తెలిసిన ఓ డాక్టరున్నాడు. వాళ్ళ పరిస్థితికి జాలిపడి 'పిచ్చివాళ్ళలారా... దేవుళ్ళని కొలిచి యాత్రలు చేస్తే పిల్లలు పుడతారా? ఓమారు హాస్పిటల్ కి రండి' అని చెప్పాడు. హాస్పిటల్‌కి వెళ్ళారు. అన్ని టెస్టులూ చేశారు. సోమిదమ్మకి ఏదో లోపం వున్నదని తేలింది. ఆపరేషన్ చేశారు.

ఆమె గర్భవతి అయింది. విప్రనారాయణ తండ్రి అయ్యాడు. వాళ్ళకో కొడుకుపుట్టాడు. లేకలేక పుట్టిన సంతానంగదా యజ్ఞనారాయణ అనిపేరుపెట్టుకుని అల్లారుముద్దుగా పెంచారు. విద్యాబుద్ధులు చెప్పించారు. అప్పటివరకూ సంపాదనమీద శ్రద్ధలేని ఆ విప్రనారాయణ పుల్లాపుడకా చేసి కొడుకుకోసం ఒక చక్కని ఇల్లు కట్టాడు. వృద్ధాప్యంలో కొడుకూ కోడలూ మనమలూ మనుమరాళ్ళతో హాయిగా జీవితం గడిచిపోతుందని కలలుకన్నాడు.

యజ్ఞనారాయణ ఎంతో ప్రతిభావంతుడయ్యాడు. చదువు పూర్తిచేశాడు. మంచి ఉద్యోగం దొరికింది. 'నాయనా... ఇంక పెళ్ళిచేసుకుని గృహస్థజీవనం చెయ్యి' అన్నారు ఆదంపతులు. ఒప్పుకున్నాడుకాదు. మరి కొంత కాలం గడిచింది. 'నీకునచ్చిన పిల్లనైనా చేసుకోరాబాబూ-' అని బతిమాలారు.

'దేనికైనా సమయం రావాలమ్మా! ఆరోజు రానివ్వండి' అని బుద్ధిమంతుడిలాగ వేదాంతం ఒలకబోశాడు.

అలా మరికొన్నాళ్ళు గడిచాయి.

ఓరోజు ఓచక్కని చుక్కలాంటి అమ్మాయిని తీసుకువచ్చి "అమ్మా ఇదిగో నా భార్య. రిజిష్టరు పెళ్ళిచేసుకున్నాను. నాలాగే అమ్మానాన్నకి ఒకే బిడ్డ" అని పరిచయం చేశాడు.

ఆ వృద్ధదంపతులు తెల్లపోయారు.

ఒడుగూ, ముహూర్తం అదీలేకుండా పెళ్ళయిపోవడం, అదీ కన్నవాళ్ళకి చెప్పకుండా చేసుకోవడం వాళ్ళకి బాధనిపించింది. ఉన్నవాడొక్కడు. వచ్చిన కోడలు ఎదురుగావుంది. గుండెల్లో అగ్నిగోళాలు దాచుకుని ఏమీ అనలేక కొడుకును, కోడలునీ లోనికి ఆహ్వానించారు. అన్ని సౌకర్యాలు చూశారు. పోనీలే ఏదో కోడలు కావాలనుకున్నారు, వచ్చింది- అని సరిపెట్టుకున్నారు.

కాని ఆ సంతోషం అట్టేసేపు నిలవలేదు.

యజ్ఞనారాయణ 'నాన్నగారూ! మీకోడలు కూడా ఉద్యోగం చేస్తున్నది. మేము వేరేఇల్లు అద్దెకి తీసుకున్నాం. విడిగా వుంటాం. అప్పుడప్పుడు వచ్చి చూసిపోతూవుంటాం' అన్నాడు.

సోమిదమ్మ గుండెల్లోకి గునపం దిగినట్లయింది. విప్రనారాయణ మెదడులో పిడుగుపాటు. ఇద్దరూ చేష్టలుడిగిన శిలాప్రతిమలయ్యారు.

కాసేపటికి ఆషాక్ నుంచి తెప్పరిల్లిమెల్లగా స్వస్థతకి వచ్చారు.

'బాబూ! నీకిది భావ్యంకాదు. ఇప్పటిదాకా నీకు పెళ్ళయినట్లే మాకు తెలియదు. రేపు అందరికీ తెలుస్తుంది. పెళ్ళవగానే విడిపోయాడేం అని అడిగేవారికి మేమేం సమాధానం చెప్పాలి. కొన్నాళ్ళు మాతో కలిసివుండండి. తరవాత మీఇష్టం వచ్చిన చోటకాపురం పెడుదురుగాని- అప్పటికి మా ముచ్చటా తీరుతుంది' అని ఎంతో బతిమాలారు.

కాని ఆ ధాత్రిసురుడు ససేమీరా ఒప్పుకోలేదు. పైపెచ్చు 'ఏమిటమ్మా మీ చాదస్తాలూ మీరూను. పక్షులూ ఇలాగే అనుకుంటున్నాయా? రెక్కలు రాగానే ఎగిరిపోవడం లేదూ. వేరే గూడు కట్టుకోవడం లేదూ! అలాగే అనుకుని సరిపెట్టుకోవాలి' అని పూరడించా

డు.

బ్రతికుండగానే చితి పేర్చాడనుకున్నారు ఆ దంపతులు. పక్షుల ఉపమానంలో దానికి నిప్పు కూడా అంటించినట్లయింది.

కోడలు అభిమతం కూడా అదేనేమో. కొడుకే రాళ్లతో కొడితే, కోడలు పూలతో పూజిస్తుందా అనుకుని వూరుకున్నారు''

అంతవరకూ ఎంతో వడిగా సాగిన కథ టక్కున ఆగిపోయింది.

సమత ఆసక్తిగా వింటున్నది.

కథ ఆగిపోవడంతో చలపతిరావు ముఖంలోకి చూసింది.

''తరవాతేమైంది అంకుల్! నాకు చాలా బాధగా వుంది. పాపం వాళ్ల గతేమిటి? తల్లిదండ్రుల మీద దయలేని పుత్రుడు పుట్టనేమి, పుట్టి గిట్టనేమి, పుట్టలోని చెదలు పుట్టవా గిట్టవా అనే పద్యం జ్ఞాపకం వస్తున్నది'' అంది.

చలపతిరావు కథ చెప్పడమైతే అలా కల్పించి చెప్పాడుగాని జగదీష్ నిజంగా అలా చేస్తే తను భరించగలడా? నిర్మల బతుకుతుందా?— అనుకున్నాడు.

మెల్లగా అన్నాడు— ''ఏమౌతుందమ్మా... మన బంగారం మంచిది కానప్పుడు కంసాలిని తప్పుపట్టలేం కదా అని ఆ దంపతులు వూరుకున్నారు. అంతే!'' అని కథ ముగించాడు.

''ఇందులో ప్రశ్నేదంకుల్! ఎవరికి తోచేదైనా ఒక్కటే. అతను పెళ్లి కాగానే తల్లిదండ్రులని అలా వదిలెయ్యడం తప్పు'' అంది.

''ప్రశ్న వుంది. ఆ కథలోని యజ్ఞనారాయణ సనాతన సాంప్రదాయాలకు తిలోదకాలు వదిలి ఆధునిక దృక్పథం ఏర్పరచుకున్నవాడు. స్త్రీ ఏ విషయంలోనూ పురుషుడికి తక్కువ కాదు అని మనస్ఫూర్తిగా నమ్మినవాడు. సంతలో పశువుని కొని తెచ్చుకున్నట్లు స్త్రీయే పురుషుడి ఇంటికి ఎందుకు రావాలి. పురుషుడు మాత్రం స్త్రీ ఇంటికి ఎందుకు వెళ్లకూడదు. పెళ్లిచేసుకున్నారు. ఒక్కటయ్యారు. అందుచేత ఎలాంటి పక్షపాతాలూ లేకుండా మరో ఇల్లు ఏర్పరచుకుని వేరే కాపురం పెట్టడంలో తప్పేముంది— అనుకున్నాడతడు.

అతని వేగం అలాంటిది. ఆ వేగాన్ని వాళ్లు అందుకోలేకపోవడం వీళ్ల తప్పు. బతికుండగానే వాళ్లని కాటికి పంపానని చితిపేర్చి మంట పెట్టానని అతడికి తెలియదు. ఆగి ఆలోచించే తీరిక ఎక్కడిది?

చితిలో కాలి మాడి మసవ్వాలా? లేక బతికి బట్టకట్టాలా అన్నది ఆ తల్లిదండ్రులే నిర్ణయించుకోవాలి. కొడుకు సంగతి వాళ్లకు తెలుసును. అందుకే ఇక వాళ్లు వాదించి చెప్పడానికి ఏమీ లేకపోయింది.

ఇక్కడ నిన్ను ప్రశ్నించేదొక్కటే. నువ్వే ఆ అమ్మాయివైతే ఏం చేసేదానివి? నీవనుకున్నట్లు ఆ విప్రదంపతులతో ఆ కొడుకూ కోడళ్లు వుండి, వాళ్లు కట్టిన ఇంట్లోనే కాపురం వుండటమే ధర్మం అనుకుంటే ఏం చేస్తావు? ఆ యజ్ఞనారాయణ జగమొండి. అలాంటివాడిని ఎలా ఒప్పిస్తావు? ఆలోచించుకుని రెండురోజుల్లో మా ఇంటికి వచ్చి తీరిగ్గా చెప్పు. తెలిసీ చెప్పకపోయినా నీతల వెయ్యి వ్రక్కలు కాదులే'' అని నవ్వుతూ కథ ముగించాడు.

సమత సీరియస్‌గా ఆలోచించింది. జగదీష్ అలాంటి మొండిఘటమా? పెళ్లవగానే వేరు కాపురం పెడతామని చెప్పాడా? ఎంత ఘోరం. తమకీ పిల్లలు పుడతారు. వాళ్లూ ఇలాగే అంటే అప్పుడేం చెయ్యాలని ఆలోచించలేదా! గట్టిగా బుద్ధిచెప్పాలి అనుకుంది.

''అలాగే అంకుల్... చెప్పికాదు— చేసిచూపిస్తాను. రేపు సాయంత్రం ఆరు గంటలకి మీ అబ్బాయిని ఇందిరాపార్కుకి నేను రమ్మన్నానని చెప్పండి'' అంది.

చలపతిరావు సమతకి విషయం ఎలా అర్థమైందో ఎలాంటి అపోహ కలిగిందో సులువుగానే అర్థంచేసుకున్నాడు. మెల్లగా కుర్చీమీద నుంచి లేచాడు. సమత కూడా చలపతిరావుని అనుసరించింది. ఇద్దరూ సమత గదిలోనుంచి బయటికి వచ్చారు.

చలపతిరావు కృష్ణమూర్తి, అన్నపూర్ణల దగ్గర సెలవు తీసుకున్నాడు.

అన్నపూర్ణ ''వదినగారిని అడిగానని చెప్పండి అన్నయ్యగారూ'' అంది.

సమత, కృష్ణమూర్తి చలపతిరావుని రోడ్డు




దాకా సాగనంపారు.

అప్పుడే ఖాళీగా వస్తున్న ఆటో రావడం కనిపించింది. చలపతిరావు చెయ్యి వూపి ఆపాడు. ఆటోలో ఎక్కి సెలవు తీసుకున్నాడు.

నమత "అంకుల్... రేపు మీ అబ్బాయిని ఇందిరాపార్కుకి పంపడం మరిచిపోకండి" అని జ్ఞాపకం చేసింది.

"అలాగే" అన్నాడు.

ఆటో బయలుదేరి వెళ్ళిపోయింది.

ఆ మరునాడు సాయంత్రం అయిదున్నరకే జగదీష్ ఇందిరాపార్కు చేరుకుని నమతకోసం



ఎదురుచూడసాగాడు.

సరిగ్గా వాచ్‌లోని సెకండ్ల ముల్లు ఆరు గంటలు పూర్తిచెయ్యడానికి పన్నెండు మీదికి వచ్చేసరికి సమత బెంచీమీద జగదీష్ సరసన సిమెంటు సోఫామీద కూర్చుంది.

సమతకి వున్న టైమ్ సెన్సుకూడా జగదీష్‌ని వశంచేసుకుంది. సరిగ్గా గంట అయ్యేసరికి ఎవరో గిల్లినట్లు ఎంత ఇంటరెస్టింగు టాపిక్ నడుస్తున్నా లేచి "బై జగదీష్" అని వెళ్లిపోతుంది.

సమత బెంచిమీదనైతే కూర్చుందిగాని జగదీష్‌వేపు కన్నెత్తి కూడా చూడలేదు. గలగలా మాట్లాడే పిల్ల, మాటలు మొదలుపెడితే వరద గోదావరిలా చుట్టూవున్నవాళ్లనందర్నీ కొట్టుకుపోయే అమ్మాయి మాట్లాడదేం అనుకున్నాడు జగదీష్.

"ఏమిటి అమ్మాయిగారూ... మౌనవ్రతమా! ముంగిలాగ కూర్చోవడానికి కూడా పార్కుకి రావాలా? ఒస్తే వచ్చావు. నీకో తోడుకావాలని కబురెందుకు పంపావు?" అన్నాడు.

మరికాస్త అటు తిరిగి బోటుమీద పోతున్న జంటలనూ, తలపైనున్న కొబ్బరి చెట్లనూ చూడసాగింది.

"ఏదో కోపం వచ్చినట్లుందే. నిన్న మానాన్నగారు నీకెక్కడో కనిపించారట. నన్ను రమ్మని కబురు పంపించావని వచ్చాను. తీరా వస్తే ఇదీ వరస. మా నాన్నగారేమైనా నీ మనసు నొప్పించారా సమతా?"

జగదీష్‌కి ఆడవాళ్ల అలకలు అవీ తెలియవు. కొంచెం చిరాకు వేసింది.

"మాట్లాడకపోతే పోనీలే. అమాత్రానికి కబురు పంపడం దేనికి?" అని బెంచీమీదనుంచి లేచి నిలబడ్డాడు. సమత మెల్లగా "ఆగండి... దయచేసి కూర్చోండి" అంది.

"అదీ అలాగుండాలి, ఇపుడు చెప్పు నన్నెందుకు రమ్మని కబురు పంపించావు" అడిగాడు.

"జగదీష్‌గారూ... మనం స్నేహితులుగా కలుసుకున్నాం. ఈమధ్యనే ప్రేమలోపడ్డాం. కాని మనపెళ్ళిజరగదు" అంది.

జగదీష్ పిడుగుపడ్డట్టు అదిరిపోయాడు.

"ఏం... ఎందుకని?"

"మా అమ్మానాన్నలకి ఒకే అమ్మాయిని నేను. నా పెళ్ళయితే వాళ్ళగతేమిటి? నేనువాళ్ళ ఆలనా పాలనా చూడగలనా? అందుకే నేను పెళ్ళి చేసుకోదలచుకోలేదు"

"ఓస్... ఇంతేగదా. ఇంకేదోకారణం అనుకున్నాను. పెళ్ళి చేసుకున్న అమ్మాయిలు తల్లిదండ్రుల్ని చూసుకోవడం లేదా? పెళ్ళవగానే నిన్ను కట్టిపడేస్తాననుకున్నావా?" అన్నాడు బలవంతాన నవ్వుతూ.

"లేదు జగదీష్... నేను హాస్యానికి చెప్పడంలేదు. ఒక్కరోజు కూడా వాళ్ళని విడిచి వుండలేను".

"ఎవరుమాత్రం వాళ్ళతల్లిదండ్రులను విడిచిపెట్టి వుండగలరు? అయితే ఒకేకూతురుగా పుట్టినవాళ్ళందరూ పెళ్ళిచేసుకోవడంలేదా! అత్తవారింటికి వెళ్ళికాపురాలు చెయ్యడంలేదా" అన్నాడు.

సమత జగదీష్ వేరుకాపురం ప్రసక్తి తెచ్చేదాకా అతడి మనసులోని మాట బయట పెట్టేదాకా దానికి అనుగుణ్యమైన ప్రశ్నలే వెయ్యాలనుకుంది.

"మీకేం... మగమహారాజులు. అత్తవారింటికి వెళ్ళికాపురం చేసే అవసరం వుండదు. మా ఆడపుట్టుక అలాంటిది" అని వాపోయింది.

"ఓహెూ అదా నీబాధ. మనసంప్రదాయాలు అలాంటివి. దానికి మనమేం చేస్తాం?"

ఇంకా అసలు పాయింటుకి రాడేం చెప్మా అనుకుంది.

"ఇంతకీ మనం పెళ్ళవగానే మీ ఇంట్లోనే కాపురం పెట్టాలంటారా?" అడిగింది.

సమతని ఎంతో బుద్ధిమంతురాలు అనుకున్నాడు. అలాంటి ప్రశ్నవినగానే ఒళ్ళు కంపరమెత్తినట్లయింది. ఏమిటి ఈమె ఉద్దేశం. పసితనమో తలబిరుసుతనమో అర్థంకాలేదు.

"ఇంతకీ ఏమిటి నువ్వనేది? లేకపోతే మీ ఇంట్లో కాపురం పెడదామంటావా?" అని ప్రశ్నించాడు.

తన చేతనే వేరుకాపురం మాట ఎత్తించా




లనే ప్రయత్నంలాగుంది. ఛీ... తన ప్రాణంపో యినా సరే... సరదాకైనా ఆ మాట తననోటితో అనలేడు.

"జగదీష్‌గారూ... శ్రద్ధగా వినండి. మీరు మీఇంట్లోనూ, మాఇంట్లోనూ కాకుండా వేరుకాపు రంపెట్టడానికైనా సిద్ధపడతారని నాకు తెలు సును. కాని నా ప్రాణంపోయినా వేరుకాపురం పెట్టను. మీరు మీతల్లిదండ్రులకు ద్రోహంచే సినా నేను మాత్రం తల్లిదండ్రులకన్నా మి న్నగా పెంచిన మాచిన్నాన్న పిన్నిలకు ద్రో హంచెయ్యను. ఇలా పెళ్ళవగానే తల్లిదండ్రు లను పిల్లలు వదిలిపోతే వృద్ధాప్యంలో వాళ్ళగ తేమిటి? ఇది సమాజం జగదీష్‌గారూ! మనం మనుషులం- మననున్న మనుషులం పక్షు లంకాదు. రెక్కలు రాగానే ఎగిరిపోవడానికి "బేర్ ఇట్ ఇన్‌మైండ్" అని మరోమాట కైనా తావివ్వకుండా వినవిసా పార్కులోనుంచి వెళ్ళిపోయింది.

ఆమె ముఖం ఎరుపెక్కింది. ఆకోపమెందు కో తానేమన్నాడో జగదీష్‌కి అంతుపట్టలేదు. ఏమిటీ అమ్మాయి. ఈసమతకి నిజంగానే ఏదో పిచ్చివుంది. ఇలాంటిదని తెలియక ఇంత కాలం ఎంత ఆరాధించాడు. ఎందుకిలా మన ను పారేసుకున్నాడు.

సమతా... సమతా అని వెంటపడాలనుకు న్నాడు. కానిమనసు ఒప్పలేదు. ఏమిటీవిడ ఉద్దేశం. తను ఇల్లరికం వెళ్ళాలనా? ఇంకా నయం అత్తవారింటినుంచి పూచికపుల్లకూడా ముట్టకూడదని ఎప్పుడో నిర్ణయించుకున్నాడు.

హృదయం ఎంతో భారమైంది. పెళ్ళి అయిపోయినట్లు, సమత వాళ్ళఇంటికివచ్చి మంచి కోడలుగా పేరుతెచ్చుకుని అమ్మనీ నాన్నను మెప్పించినట్లు ఎన్నికలలు కన్నాడు. చివరికిలాముగుస్తుందని ఊహించుకోలేకపో యాడు. మనసంతా దిగులు ఆవరించింది. హృదయాకాశంలో ప్రతిష్ఠించుకున్న నవ్వుల జాబిల్లి తొలగిపోయినట్టయింది. బతుకులో ఇక వెన్నెలలు విరుస్తాయా? మరో వనితను గుండెల్లోకి రానివ్వగలడా? అసంభవం.

పిచ్చివాడిలా అలా చీకట్లోనే చాలాసేపు వుండిపోయాడు. తరవాత మెల్లగాఇల్లు చేరు కున్నాడు.

చలపతిరావు కొడుకు రాకకోసం ఓగంటక్రి తంనుంచీ ఎదురు చూస్తున్నాడు.

దిగాలు పడివస్తున్న కొడుకు ముఖం చూశా డు. దానిలో కళాకాంతులులేవు. కొడిగట్టిన దీపవు కళికలా, పొగచూరిన అద్దంకింది ఛాయాచిత్రంలాగా వున్నాడు. ఏదోగట్టి దోసేఇ చ్చినట్లుంది అనుకున్నాడు.

"ఏరా జగ్గూ... సమత కనిపించిందా"!అ న్నాడు.

"డాడీ... ఇప్పుడు నన్నేమి అడక్కండి దయచేసి. ఆ సమతపేరు నాదగ్గర ఎత్తొద్దు" అని తనగదిలోకి వెళ్ళి తలుపేసుకున్నాడు.

చలపతిరావుకి నవ్వొచ్చింది.

మెల్లగా భార్యనిర్మల దగ్గరికివెళ్ళి తాను విద్యానగర్ వెళ్ళిన దగ్గర్నుంచి జరిగినదంతా చెప్పాడు.

నిర్మలాదేవి భయపడిపోయింది. అంతగా ప్రేమించిన ఆపిల్ల ఏమి చెప్పిందో ఏమిటో. ఆ సమత పేరెత్తొద్దూ అన్నాడూ అంటే ఎంత బాధపడుతున్నాడో. ప్రేమలో విఫలమైన ప్రే మికులు ఎలాంటి అఘాత్యాలైనా చేస్తారు. భర్త చేసినపని ఆమెకి నచ్చలేదు. ఇలాంటి పరీ క్షలా పెట్టేది. పై పెచ్చు నవ్వుతున్నారు.

"మంచిపని చేశారులెండి. మనస్సుపాడై వాడేదైనా చేస్తేనో వెళ్ళి జరిగింది చెప్పండి త్వరగా" అని తొందర చేసింది.

చలపతిరావుకి కొడుకు వ్యక్తిత్వం తెలుసు ను. తనపెంపకంమీద తనకి నమ్మకం వుంది. ఒక స్త్రీ తిరస్కరించినంతమాత్రాన తనగమ్యం మరిచిపోయే టంత బేలతనం జగదీష్‌లో వుండదు.

"ఛీ... నోర్ముయ్, నా కొడుకేవాడు" అని గుండెలమీద కొట్టుకున్నాడు.

నిర్మల గబగబా జగదీష్ గది దగ్గరికి వెళ్ళింది.

"జగదీష్! నీతో పనివుంది. ఇలారా అయ్యా!" అని ప్రేమగా పిలిచింది.

"అమ్మా! నేనీరోజు భోజనం కూడా చెయ్య ను. నన్ను డిస్టర్బ్ చెయ్యొద్దు" అని మంద లింపుగా అరిచాడు.

"తలుపు తియ్యరా" అని ప్రాధేయపూర్వకంగా మళ్ళీ అడిగింది.

"తియ్యను" అన్నాడు మొండిగా.

చలపతిరావు మెల్లగా తలుపు దగ్గరికిచేరి, "ఒరే జగ్గూ... నేను నిన్న సమత వాళ్ళింటికి వెళ్ళాను" అని కొడుక్కి వినిపించేలా అన్నాడు.

"మంచిపనిచేశారు లెండి"

"సమతకి పరీక్షపెట్టాను"

"గొప్పపని చేశారులెండి" జగదీష్ అసహనంగా సమాధానం చెప్పాడు.

"ఆ పిల్ల రత్నంరా! నేనుపెట్టిన పరీక్షలో నూటికి నూరుమార్కులతో పాసైంది" అన్నాడు.

"నన్ననవసరంగా విసిగించకండి నాన్నా! మీ పరీక్షలో పాసైనా ఈరోజు నా పరీక్షలో తప్పింది. ఇంక ఆ అమ్మాయి మాటెత్తకండి. నాకు ఒళ్ళు మండుతుంది" అన్నాడు మరింత కోపంగా.

"ఆహా... తెలివైనపిల్లే! అచ్చం నేను చెప్పినట్లే చేసిందన్నమాట..." అని సరదాగా నవ్వసాగాడు.

చలపతిరావు ధోరణిచూసి ఏమయింది ఈ ముసలాయనకి అనుకుంది నిర్మలాదేవి.

జగదీష్‌లో ఉత్కంఠ బయలుదేరింది. 'నిజంగానే ఇదేదో తండ్రి ఆడిన నాటకమే అయి వుంటుంది. లేకపోతే సమత ఏమిటి, అలా ప్రవర్తించడం ఏమిటి?'

"ఏమిటి నాన్నా... మీరు చెపుతున్నది? చెప్పేదేదో సరిగ్గా చెప్పండి చంపక"

లోపలినుంచే చిరాగ్గా అన్నాడు జగదీష్.

"ఎలా చెప్పాలిరా? నువ్వు గదిలో అలా బిడాయించుకుని వుంటే చెప్పను. బయటికొస్తేనే చెపుతాను. నాకు అరిచే ఓపికలేదు. నిర్మలా... ఆహా ఏం పిల్లే, సమతవంటి పిల్ల లేదోయి. సమత మన కోడలేలేవోయి!" అని దీర్ఘం తీశాడు.

నిర్మల నవ్వుకోసాగింది.

ఓ క్షణం తరవాత మెల్లగా తలపుతెరిచి తండ్రిని చూశాడు.

"చెప్పండి త్వరగా" అన్నాడు.

చలపతిరావు సోఫాలో కూర్చున్నాడు. వాళ్ళని కూడా కూర్చోమని సంజ్ఞ చేశాడు.

నిర్మలా, జగదీష్ కూడా సోఫాలో కూర్చున్నారు.

"నేను నిన్న జరిగింది చెపుతానుగాని పార్కులో సమత ఈరోజు నీతో ఏమన్నదో ముందు చెప్పు?" అన్నాడు.

"ఏముంది... వాళ్ళ పిన్నినీ చిన్నాన్ననీ, వదలలేదట. నేనే ఇల్లరికం వెళ్ళాలట. నువ్వు నీ తల్లిదండ్రుల్ని విడిచిపెట్టినా నేను నా తల్లిదండ్రుల్ని విడిచిపెట్టలేను. మీరు సిగ్గులేకుండా వేరుకాపురం పెట్టినా నేను అందుకూ ఒప్పుకోను. రెక్కలు రాగానే ఎగిరిపోవడానికి మనమేం పిట్టలంకాము" అని ఏమేమో వాగింది. సమత పిచ్చిపిల్లనాన్నా" అని జరిగిందంతా చెప్పాడు.

చలపతిరావుకి సమత తెలివితేటలమీద, వ్యక్తిత్వంమీద గౌరవం ఏర్పడింది.

భార్యకీ, కొడుకుకీ ఆ క్రితంరోజు సాయంత్రం సమతకి చెప్పిన భేతాళకథ, మొత్తం విషయాలన్నిపూసగుచ్చినట్లు చెప్పాడు.

"అంకుల్... నేను దీనికి సమాధానం చెప్పను– చేసి చూపిస్తాను అందిరా. నువ్వు వేరుకాపురం పెడతాననివుంటావని ఊహించి వుంటుంది. ఎలాచేసి చూపిస్తుందా అనుకున్నాను. భలే పిల్లరా! ఒరే... మాకు ఈ కోడలేకావాలి" అని సరదాపడ్డాడు చలపతిరావు.

నిర్మల కూడా ఎంతో సంబరపడిపోయింది.

జగదీష్‌కి విషయం అర్థమైంది. సమత మీది కోపం మలయపవనం తాకిడికి వేసవి తాపం చల్లారినట్లు చల్లారిపోయింది.

చలపతిరావు అదే అదనుగా భావించి "ఒరే జగ్గూ! మీ అమ్మా నేనూవెళ్ళి ఇంక పెళ్ళి ముహూర్తాలు పెట్టిస్తాం. నీ కోరిక ప్రకారం అమ్మాయిని పరీక్షించుకున్నాను. అమ్మాయి నచ్చింది. ఇంక అభ్యంతరంపెట్టకు" అన్నాడు.

"సరే... మీ ఇష్టం నాన్నా" అని ఒప్పుకున్నాడు జగదీష్.

ఆ మరునాడు చలపతిరావు సమతని




బ్యాంకుకు వెళ్ళి కలుసుకున్నాడు.

సమత ముఖం వాడివుంది. జరిగిందంతా చెప్పాడు చలపతిరావు! ఆ చల్లని వార్త చెప్ప గానే ఉదయభానుని లేత కిరణాలు సోకినట్ల యింది. ఆమె ముఖకమలం వికసించింది. అనుమానపు తెరలు తొలగిపోయాయి. జగదీష్ జగమొండి, నిరంకుశుడు, స్వార్థపరుడు అనుకుని అనవసరంగా అసహ్యించుకుంది. హృదయవీణ కళ్యాణిరాగం ఆలపించసాగింది. కల్యాణమండపంలో జగదీష్ సరసన కూర్చున్న అనుభూతి. ఊహల పల్లకిలో ఊరేగ సాగింది.




శ్రావణమాసం. ఆకాశంనిండా మేఘాలు అలముకున్నాయి. వర్షాకాలం కావడంచేత ఉండీ ఉడిగి ఒక జల్లు వర్షం పడుతోంది. కాస్త ఉక్కగా అనిపించి చలపతిరావు, నిర్మల ఆరు బయట డాబామీదికి రెండు కేన్ కుర్చీలు తెచ్చుకుని కూర్చున్నారు.

మేఘాలు మరింతగా ఆకాశాన్ని ఆవరించు కున్నాయి. చూస్తూ వుండగానే నల్లనిమేఘాలు పొడుచుకొచ్చాయి. చల్లనిగాలి శరీరాన్ని తాకి హాయి అనిపించింది.

"రేగమా మేఘమా" అని ఎవరు అబ్బా పొల్చింది అనుకున్నాడు చలపతిరావు. కూర్చున్నంతసేపులేదు చినుకులు మొదల య్యాయి. కుర్చీలు మోసుకుని లోనికి వెళ్ళిపో యారు.

"అబ్బాయి వచ్చే వేళయింది. వచ్చిన తరువాతనైనా పడిందికాదు వెధవవాన" అంది చలపతిరావుతో.

చలపతిరావు ఆమె మాటలు వినలేదు. జగదీష్ పెళ్ళి ఎలా చెయ్యాలి, ఉన్నవాడు ఒక్కడు. చాలా ఆడంబరంగా చెయ్యాలని వుంది. కాని పెళ్ళిళ్ళలో డబ్బు తగలెయ్యడం జగదీష్‌కి ఇష్టం వుండదు. నిరాడంబరంగా చెయ్యాలి అని ముందే చెప్పాడు. ఏదో చిన్న విందు చేద్దాం. అదీ చాలా ముఖ్యమైన బంధువులకీ, ఆత్మీయులైన స్నేహితులకు మాత్రమే అని ఖచ్చితంగా చెప్పాడు.

మంచి ముహూర్తం చూసుకుని నిర్మలా, చలపతిరావు సమతవాళ్ళ ఇంటికి వెళ్ళి విషయం చెప్పి ముహూర్తాలు కార్తీకమాసంలో పెట్టించాలని నిర్ణయించుకున్నారు. ఆ విష యాన్ని గురించే ఆలోచిస్తున్నాడు.

ఇంతలో జగదీష్ స్కూటర్ శబ్దం విని పించింది. కాసేపట్లోనే గబగబా పైకివచ్చాడు.

నిర్మల అనుకున్నట్లే అయింది. బాగా తడి సిపోయాడు. టవల్ అందించింది. శుభ్రంగా తుడుచుకుని బట్టలు మార్చుకున్నాడు.

జగదీష్ ముఖం వెలవెల పోయి వుంది. చలపతిరావుకి కొడుకు సైకాలజీ బాగా తెలుసును. ఏదో ఘర్షణపడివుంటాడు అనుకున్నా డు.

"ఏరా.... మళ్ళీ ఏమయింది? పెళ్ళికళ తొణికిసలాడవలసిన ముఖం. అలా వెళ్ళాడే సుకొచ్చావేం?" అనడిగాడు.

"ఈ లోకం మనుమల్ని తిన్నగా బతకని య్యరు నాన్నా! ఏవేవో పుల్లవిరుపు మాటలు మాట్లాడి ఎదుటివాడి మనసు నొప్పిస్తేనేగాని వాళ్ళకి శాంతి వుండదు.

"ఏమయిందో వివరంగా చెప్పు... ఎవరన్నారు, ఏమన్నారు?" అడిగాడు.

కొడుకు ఖిన్నుడై ఒంటరిగా బాధపడటం చలపతిరావు సహించలేడు. మనోరోగాలను చిటికెలో నయంచెయ్యగల మహావైద్యుడు.

"నా ఫ్రెండ్స్ నాన్నా... క్లోజ్ ఫ్రెండుకి సమత గురించి చెప్పాను. అది ఆఫీసంతా పాక్కింది. కట్నం ఎంత తీసుకుంటున్నావేయ్ అన్నారు కొందరు. కట్నం నేను చచ్చినా తీసుకోను. కట్నం తెచ్చే పిల్లని అసలు పెళ్ళే చేసుకోను అన్నాను. కొయ్ అన్నాడొకవెధవ. వాడంటేనే నాకు కోపం. బోలెడు కట్నం, లాంఛనాలు రాబట్టుకుని కూడా భార్యని ఇంకా

సతాయిస్తూ ఉంటాడు.

తరవాత సమత వాళ్ళ తల్లిదండ్రుల వివరాలు, ఇల్లూపొల్లూ ఒక్కతే కూతురు మొదలైన విషయాలు అడిగి తెలుసుకున్నారు.

కొయ్ అన్నవాడే– "జగదీష్... నీలాంటి తెలివైనవాళ్ళు ఉండర్రా లోకంలో! ఒకే కూతురు అంటున్నావు, కట్నం తీసుకోను అంటున్నావు, కట్నం ఇచ్చే పిల్లని చేసుకోను అంటున్నావు. మరి ఆ ఇల్లు నీకే దక్కుతుంది గదుటోయ్– ఇంకా కట్నం ఎందుకు? ఈరోజుల్లో విద్యానగర్‌లో ఇల్లంటే మాటలా– రెండు మూడు లక్షలు చేస్తుంది" అని వాగాడు.

నాకు కోపం వచ్చింది. వాడిలాంటి కట్నం కక్కుర్తివాడనుకున్నాడు.

"నాకు కావలసింది కేవలం ఆ అమ్మాయి. ఆ ఇల్లూ గాడిదగుడ్డూ నాకేం అవసరంలేదు" అన్నాను.

"అందరూ అలాగే అంటారు నాయనా... ఏం... మీ మామతో వారి తర్వాత ఆ ఇంటిని అనాథశరణాలయానికి రాసెయ్యమంటావా? నువ్వు రాసెయ్యమంటే వాళ్ళు రాసేస్తారా? మీ ఆవిడ సారీ– కాబోయే ఆవిడ దానికి ఒప్పుకుంటుందా? ఎత్తంటే నీదేనోయ్" అన్నాడు నాన్నా. నేను భరించలేకపోయాను. సమత ఓ పేదపిల్ల అయితే ఎంత బాగుండిపోను" అని చాలా బాధపడిపోయాడు.

చలపతిరావుకి కొడుకు ఆదర్శాలు తెలుసును. కాని వాడు తనలా సమాజాన్ని ఇంకా కాచివడపొయ్యలేదు. నిజాయితీ అనేది ఉంటుందని వాళ్ళు నమ్మరు. జగదీష్‌ది వేడి రక్తం.

"ఒరేయ్... నేను చెప్పేది శ్రద్ధగావిను. ఈ లోకం నీకింకా బాగా తెలియదు. ఫలానావాడు లంచం తీసుకోడు అని ఓ లంచగొండి దగ్గర అనిచూడు" "వాడిమొహం పిరికితనమండీ బాబూ! రిస్కు తీసుకోలేక అలా ఉన్నాడుగానీ ఏ రిస్కూలేకపోతే అలాంటివాళ్ళే బాగా మింగుతారు" అంటాడు.

ఫలానా ఆవిడ ఇల్లాలు అని ఓ కులట దగ్గరగనకంటే ఆమెకి అరికాలిమంట నెత్తికెక్కుతుంది. "అలాంటివాళ్ళవి బయటికిరావండీ దొరికిన వాళ్ళేగదా దొంగలు" అంటుంది.

"ఇలాంటివాళ్ళమాటలు పట్టించుకుని నువ్వేపూల్‌లాగ బాధపడుతున్నావా?" అని మందలించాడు.

"లేదునాన్నా... నాకు సమత తప్ప ఆమె ఏ ఆస్తీవద్దు" అన్నాడు జగదీష్.

"ఏమిట్రా బుద్ధిలేకుండా. మేంమాత్రం కావాలంటున్నామా? మనకి ఏమీవద్దు– సరేనా? కాని అలా గిరిగీసుకుని కూర్చోవడం కూడా తప్పే. ఆ అమ్మాయికి ఏతృణమో ఫణమో పెట్టుకుంటారు. దానిని స్త్రీధనం అంటారు మనవాళ్ళు. ఆమాత్రం ఆస్తి స్త్రీకి ఉండటం తప్పంటావా?" అని ప్రశ్నించాడు చలపతిరావు.

"మీరెన్నయినా చెప్పండినాన్నా! నాకా ఇల్లు మాత్రంవద్దు" అన్నాడు కరాకండిగా.

"మరి ఆమె ఒంటిమీది బంగారం కావాలా?"

"అది నాదెలా అవుతుంది?"

"ఇల్లు మాత్రం నీదవుతుందా? ఇల్లు కూడా ఆమెదే అవుతుంది. కాని నువ్వు ఇల్లు తీసుకోవడంలేదు అన్నావనుకో– ఆ బంగారం బాగానే పెట్టారు. ఐదేళ్ళు కొనేపని లేకుండా చీరలు కొన్నారు. బాగానే పెట్టారు అంటాడు వాడు. అప్పుడేం చేస్తాం" అని తేలుకొండేల్లాంటి ప్రశ్నలు వేశాడు.

జగదీష్‌కి ఒకో ప్రశ్న ఒకోచురకలాగా అంటుకున్నాయి. హృదయానికి కనిపించని గాయాలయ్యాయి. ఎవరు పెట్టారీ పద్ధతులు. ఎలా తయారయ్యిందీ సమాజం. ఆదిమానవుడే నయమేమో! తాను ప్రేమించిన యువతి కోసం అన్నీ త్యాగాలే చేసివుంటాడు. ఏమీ ఆశించే ప్రశ్నే ఆనాడు ఉదయించి ఉండదు.

"ఛీ... ఈ పెళ్ళిళ్ళూ, పద్ధతులూ నాకు నచ్చలేదునాన్నా. పెళ్ళేలేకుండా ఉండిపోతేనే నయమేమో" అన్నాడు విరక్తిగా.

కొడుకు బాధని అర్థం చేసుకున్నాడు. ఇలాంటి యువకులే దేశానికి కావాలి. ఇలాంటి ఆదర్శభావాలు వుంటేనే అదృష్టం. వాటికి నీరుపోసి పెంచి ప్రోత్సహించడం తల్లిదండ్రుల కర్తవ్యం. కాని జరుగుతున్న దేమిటి





బూజుపట్టిన సనాతన సంప్రదాయాలను వాళ్ళ నెత్తిన రుద్దుతున్నారు. ఎలాగైనా తనే ఈ సమస్యకి పరిష్కారం చూడాలి.

"ఇదేమిట్రా జగదీష్... విఘ్నేశ్వరుడి పెళ్ళికి అన్నీ విఘ్నాలే వచ్చాయట. అలాగే నీపెళ్ళికీ అన్నీ అడ్డంకులే వస్తున్నాయి. సరే... నాకువదిలెయ్. నీకు కట్నం తీసుకున్నాడు, ఇల్లు తీసుకున్నాడు– అనే అపవాదు రాకుండా చేసేపూచీ నాది. అందుకు అనేక కట్టుదిట్టాలుంటాయిలే" అన్నాడు.

జగదీష్ ఆశ్చర్యంతో తలమున్కలయ్యాడు. నాన్న దేవుడు. ఏవేవో అద్భుతమైన ఊహలు వస్తాయి. తనైతే కలలోనైనా అలాంటివి ఊహించగలడా? ఈ సమస్యకి పరిష్కారం తడుతుందా!

"నాన్నా... నువ్వెంత మంచివాడివినాన్నా! ఆ పని చెయ్యినాన్నా నీకు పుణ్యముంటుంది. ఆ వెధవలకి ఫిట్టింగ్ రిప్లై అదేనాన్నా" అని బతిమాలాడు.

నిర్మలాదేవి ఈ తతంగమంతా చూస్తూనే ఉంది. ఆమెకి కట్నకానుకలంటే ఇష్టంలేదు. తనూ ఏమీ తెచ్చుకోలేదు. భర్త మొదట్నుంచీ నూరిపోశారు. కాని ఇదేమిటి? ఇలా అయితే స్త్రీలకి అసలు ఆస్తులేవుండ కూడదా. ఏమిటీ మగబుద్ధి. ఎవడో ఏదోకూశాడని ఆనాడు రాముడు సీతని అడవులకి పంపాడు. ఇప్పుడు వీడు బంగారంలాంటి పిల్లని ఈ అర్థంలేని కారణంగా పెళ్ళి చేసుకోకుండా వూరుకోవాలా.

"మీకేమైనా మతిపోయిందా! మీరుకూడా అబ్బాయి వాదస్తానికి వంత పలుకుతున్నారా! లోకులు కాకులు– ఏదో అంటూనే ఉంటారు. ఈ అపవాదు వస్తుందని సమతని చేసుకోవడం మానేద్దామా. అనుకునేవాళ్లని అనుకోనివ్వండి. మనం వెంటనే ముహూర్తాలు పెట్టించేద్దాం. పెళ్ళిముందు అయిపోవాలి అంతే" అంది.

"ఒరే జగ్గూ... మీ అమ్మ చెప్పిందే సబబుగా వుందిరా! వాళ్లకి పిల్లలు లేరని సమతని వదిలేద్దామా? అన్ని ఆశలురేపి పరీక్షలుపెట్టి ఇప్పుడిలా చేస్తే ఇష్టంలేక ఇలా అంటున్నారని అనుకోదూ ఆ పిల్ల. నువ్వు ముందొకమాట చెప్పు– ఆడపిల్లలకి ఆస్తిహక్కు వుండాలా వద్దా? రేపు నీకో కూతురు పుడితే అలాగే రిక్తహస్తాలతో పంపించేస్తావా?" అని అడిగాడు.

జగదీష్‌కి జ్ఞానోదయం అయింది. అమ్మో.... తన కూతుర్నలా పంపగలడా! నిజమే... ఆస్తిమీద, కట్నంమీద తనకి వ్యామోహం లేదని నిరూపించడానికి సమతకి గల జన్మహక్కుని కాదనే హక్కు తనకెక్కడుంది? పిల్లో పిల్లాడో పుట్టినా సగం ఆస్తి ఇస్తామంటే అప్పుడేం చెయ్యాలి.

"అమ్మ చెప్పినట్లే చేద్దాం నాన్నా! ఆడపిల్లకి కూడా పురుషుడితో సమానంగా ఆస్తిహక్కు వుండాలి– అదే ధర్మం. వెంటనే ముహూర్తాలు పెట్టించండి. తరవాత వాళ్లకి సంతానం కలిగేలా మాత్రం తప్పకుండా చూడాలి. అది మాత్రం మానొద్దు" అన్నాడు జగదీష్.

★ ★ ★

సమతా జగదీష్‌ల వివాహం అనుకున్నట్లుగానే కార్తీకమాసంలో జరిగిపోయింది.

అప్పగింతల రోజున అన్నపూర్ణా, కృష్ణమూర్తిల బాధ చూస్తే వాళ్లు సమతని ఎంత ప్రాణప్రదంగా పెంచారో చలపతిరావుకీ, నిర్మలాదేవికీ అర్థమయింది.

యుక్తవయస్సు వచ్చేదాకా పెంచి విద్యాబుద్ధులు చెప్పించి, ఉద్యోగం చేస్తున్న ఆడపిల్లని అత్తవారింటికి అయాచితంగా పంపే తల్లిదండ్రులకన్నా త్యాగమూర్తులు మరెక్కడ కనిపిస్తారు! అంతకన్నా ధర్మదాతలు మరెవరు? ఆడపిల్లని కని కన్యాదానం చేసినవారి జీవితం ధన్యంకదూ! అలాంటి పుణ్యమూర్తుల్ని ఇంకా పీడించి పిప్పిచేసే అల్లుళ్లకి పుట్టగతులుంటాయా! అలాంటి అల్లుళ్లకి సుఖం వుండదు. శాంతి వుండదు. వాళ్ల జీవితం నరకప్రాయం అనుకున్నారు.

శోభనంరోజు రాత్రి పెళ్లికిముందు వాళ్ల ఇంట్లో జరిగిన తతంగమంతా సమతకి వివరించి చెప్పాడు జగదీష్. సమత పతిదేవుడు ఒడిలో వాలిపోయింది. జగదీష్ అపురూపమైన వరాన్ని పొందినవాడిలా సమతని అక్కున చేర్చుకున్నాడు.

ఎన్ని జన్మల సుకృతమో ఇంత మంచి

భర్తను పొందగలిగాను. ఇంత మంచి అత్తమా మలు దొరికారు– అనుకుంది నమత.

నిజంగా పిన్నికి ఒక కొడుకుంటే ఎంత బాగుండేది. తన కళ్లముందే ఎన్ని అవమానాలు. గొడ్రాలని ఎంత చిన్నచూపు. ఎంత చిన్న చూపు చూసిందీ సంఘం. పిల్లలు లేకపోవడం ఎంత నరకం!

మామగారు దేవుడు. ఆయనే అన్నీ చూసుకుంటారు. తను ఈ విషయంలో ఏమీ కలుగజేసుకోకూడదు అనుకుంది.

నమతా– జగదీష్‌లిద్దరూ పూవూతావిలా, పాలూతేనెలా కలిసిపోయారు. వాళ్ల హృదయాలూ, మనస్సులూ ఒకటయ్యాయి. పెనవేసుకుపోయారు.

★ ★ ★

ఆదివారం –

ఉదయం పదిగంటలవుతుంది.

చలపతిరావుగారింటి ముందు ఓ ఆటో ఆగింది. దానిలోనుంచి అన్నపూర్ణ, కృష్ణమూర్తి దిగారు.

అక్రితంరోజే చలపతిరావు విద్యానగర్ వెళ్లి వాళ్లిద్దర్నీ భోజనానికి రమ్మని ఆహ్వానించాడు. సందర్భం లేకుండా అలా భోజనానికి వెళ్లడమే ఇష్టంలేదు. అదేమాట కృష్ణమూర్తి అంటే చలపతిరావు కోప్పడ్డాడు.

ఇహ ఒప్పుకోక తప్పలేదు.

చలపతిరావు ఇద్దర్నీ సాదరంగా ఆహ్వానించాడు.

హాలులోని సోఫామీద కృష్ణమూర్తి, చలపతిరావు కూర్చున్నారు.

అన్నపూర్ణని నిర్మలాదేవి వంటగదిలోకి తీసుకుపోయింది.

కృష్ణమూర్తికి అల్లుడి అలికిడి వినిపించలేదు.

"జగదీష్ లేడా ఇంట్లో?" అడిగాడు.

"ఏదో ప్రోగ్రాంకి ఆహ్వానం వస్తే రవీంద్రభారతికి వెళ్లాడు. పన్నెండు గంటలకల్లా వచ్చేస్తానని మీకు చెప్పమన్నాడు" అని చెప్పాడు చలపతిరావు.

చేసేదేమీలేక టీపాయ్‌మీది దినపత్రికను తీసాడు కృష్ణమూర్తి.

"పేపరుకేంగానీ, అలా కాస్త తిరిగొద్దాం" అని లేచాడు చలపతిరావు.

"సరే" అని తనూ లేచాడు కృష్ణమూర్తి.

వంటగది తలుపుదాకా వెళ్లి "నిర్మలా... మేమిద్దరం అలా తిరిగి భోజనంవేళకి వచ్చేస్తాం" అని చెప్పి వచ్చాడు.

"ఎక్కడికి వెళదామంటారు?" అడిగాడు కృష్ణమూర్తి. నిజానికి ఇంట్లో హాయిగా కూర్చుందామనే వుందాయనకి.

"ఈ ఆదర్శనగర్‌కి అన్నివైపులా వ్యాహ్యాళికి పనికొచ్చే ప్రదేశాలే. అందుకే రిటైర్మెంట్ తరువాత నాకొచ్చిన డబ్బంతా పోసికొన్నాను. పెన్షన్‌తో, వచ్చే ఇంటి అద్దెతో కాలక్షేపం చేస్తున్నాము. మా జగదీష్‌కి జాబు వచ్చిన తర్వాత ఆర్థికమైన ఇబ్బందులు కాస్త తగ్గాయి. ఇప్పుడు మీ అమ్మాయి కూడా సంపాదిస్తున్నది. ఏదో ఇలా జరిగిపోతే చాలు" అన్నాడు చలపతిరావు. అతని చివరిమాటల్లో కాస్త వేదాంతధోరణి కనిపించింది.

కృష్ణమూర్తికి చలపతిరావుమీద మొదటిసారి వాళ్ల ఇంటికి వచ్చినరోజునే గౌరవభావం ఏర్పడిపోయింది. మనసు విప్పి మాట్లాడతాడు. ముక్కుసూటితనం. అరమరికలులేని మనస్తత్వం.

చలపతిరావు రిడ్జి హోటల్‌రోడ్ మీదుగా తోవతీశాడు. పబ్లిక్‌గార్డెన్‌లోకి నడిచారిద్దరూ.

ఉదయం పదకొండు గంటల సమయంలో పబ్లిక్‌గార్డెన్స్‌లో అంత రష్ వుండదు. అక్కడికి సాయంత్రం వేళల్లోనే ఎక్కువమంది జనం వస్తారు. ఆదివారం కావడంచేత పలచగా అక్కడక్కడా జనం తిరుగుతున్నారు.

హెల్త్‌మ్యూజియం బిల్డింగ్ ఎదురుగా వున్న చెట్లకింద సిమెంట్ బెంచీలవైపు మెల్లిగా నడుచుకుంటూ వెళ్లారు.

ఎండ అంతగా లేదు. వచ్చిపోయే మేఘాలతో వాతావరణం చల్లగా హాయిగా వుంది. చెట్టునీడ బాగా పడుతున్న ఓ బెంచీమీద కూర్చున్నారు. ఎదురుగా చక్కని గడ్డిమైదానం. మధ్యన ఫౌంటెన్. దూరంగా వచ్చేపోయే పిల్లలతో బాలభవన్ కళకళలాడుతోంది.

కృష్ణమూర్తిది కళాహృదయం. ఎన్నిమార్లు




పబ్లిక్‌గార్డెన్స్‌కి వచ్చాడో, ఏనాడూ ఇంతహాయి అనిపించలేదు. ఇదంతా చలపతిరావు సాహచర్యం, అతని సన్నిధిలోని మహాత్యం అనుకున్నాడు.

"ఎన్నోసార్లు పబ్లిక్‌గార్డెన్స్‌కి వచ్చాను. కాని ఇంత ఆహ్లాదకరంగా ఏనాడూ అనిపించలేదు. మీతో కలిసిరావడంలో ఎంతోహాయి వుందండి" ముందుగా మాట్లాడాడు కృష్ణమూర్తి. ఎందుచేతనో బావగారూ అనడం ఇంకా అలవాటుకాలేదు.

"బావగారూ... అంటే నీసొమ్మేం పోయిందయ్యా కృష్ణమూర్తి!" అన్నాడు చలపతిరావు.

కృష్ణమూర్తి సిగ్గుపడ్డాడు.



"నేను అన్నా అనకపోయినా మీరు నాకు బావగారే గదా! ఎందుకో అంత చనువు తీసుకోలేకపోయాను. నన్ను క్షమించండి బావగారూ" అన్నాడు నవ్వుతూ.

"అదీ అలాగుండాలయ్యా బావా" అని మరింత చనువుగా అన్నాడు చలపతిరావు.

చలపతిరావు అంటే గౌరవంవల్ల కలిగే చిన్నభయం ఉంది కృష్ణమూర్తికి. ఎలా మాట్లాడాలో అనుకున్నాడు. చలపతిరావు చనువుగా మాట్లాడి ఆ భయాన్ని పటాపంచలు చేశాడు.

"కృష్ణమూర్తీ... నీతో ఓసంగతి మాట్లాడాలని తీనుకువచ్చానయ్యా. నువ్వు ఏమీ అనుకోకపోతే నిన్నోసంగతి అడగాలి. మీకు పిల్లలు అసలు పుట్టలేదా. పుట్టిపోయారా?" అని రెండు ప్రశ్నలు వేశాడు.

కృష్ణమూర్తికి మామూలుగా పిల్లల టాపిక్ ఇష్టంవుండదు. మీకెంతమందండీ సంతానం. ఎందుకని పిల్లలు పుట్టలేదు, లోపం ఎవరిలో వుందో డాక్టరుకి చూపించుకున్నారా? వంటి ప్రశ్నలు ఎప్పుడువిన్నా హృదయం కలుక్కుమంటుంది. మూడ్స్ చెడిపోతాయి.

మౌనంగా వుండిపోయాడు.

అతని ముఖకవళికల్ని చదవగలిగాడు చలపతిరావు. కృష్ణమూర్తిని బాధపెట్టానా అనుకున్నాడు.

"ఏవయ్యా బావా... అలా నిశ్చేష్టుడవైపోయావు, ఏమైనా తప్పుగా మాట్లాడానా?" మళ్ళీ హాస్యధోరణిలోనే అడిగాడు.

"అబ్బే అదేంలేదండీ... మాకు కావలసినవారు మీరు అడగడంలో తప్పేముందండి" అన్నాడు ఎంతో దైన్యంగా.

"నువ్వు బాధపడకోయ్" అని నముదాయించి– జగదీష్‌కీ అతని ఆఫీసుమేట్స్‌కు జరిగిన వాదోపవాదాలు ఇంట్లో రేగిన దుమారం, జగదీష్ బాధ వివరించాడు.

కృష్ణమూర్తికి అల్లుడి ఔదార్యం, మంచితనానికి ఎంతో సంతోషం వేసింది. ఇలాంటి యువకులు యాభైశాతం మందివున్నా దేశంలో ఆడపిల్లల ఆత్మహత్యల వార్తలు వినిపించేవికావు అనుకున్నాడు.

"సందర్భం వచ్చింది గనక చెపుతున్నాను బావగారూ! నాకో కూతురు పుట్టినా మా సమత కన్నా ఎక్కువ ప్రేమగా చూసేవాడిని కాను. నాభార్యకి మరోప్రాణమే సమత. మాకు పిల్లలు లేరనే భావన ఎప్పుడూ కలగలేదు. ఇప్పుడిక పిల్లల్ని కని మాప్రేమని పంచే ఓపికాలేదు" అన్నాడు.

చలపతిరావు వాళ్ళకి సమతమీదగల ప్రేమ కన్నప్రేమకన్నా గొప్పదని ఏనాడో గ్రహించాడు.

"కృష్ణమూర్తీ... నేను చెప్పేదికాస్త సీరియస్‌గా తీసుకో. నిజంగానే చెపుతున్నాను. మీ ఇల్లూ, ఆస్తి కాజెయ్యాలని మీకొక్కతే కూతురని తెలిసి నాకొడుకు నీ కూతుర్ని చేసుకున్నాడని లోకం అనుకోవడానికి వీలులేదు. ఈ అపవాదునుంచి మీదంపతులు మమ్మల్ని బయటపడెయ్యాలి"

కృష్ణమూర్తికి మతిపోయింది. ఏమిటి వీళ్ళకింత చాదస్తం. లోకం నోరు ఎవ్వరూ ముయ్యలేరని తెలీదా వీళ్ళకి.

"బావగారూ... అబ్బాయికి తెలియక ఏదో పంతానికి పోయివుంటాడు. మీరూ ఇలా పట్టుదలగా మాట్లాడటం ఆశ్చర్యంగా వుంది. లోకంనోరు మనం ముయ్యగలమా! రేపు వాళ్ళకి మరోలోపం కనిపిస్తుంది. లోకానికి నిర్వచనం ఏమిటి అని నన్నెవరైనా అడిగితే "లోపం చూడగలిగేదే లోకం" అంటాను. అందుచేత దాన్ని వదిలెయ్యాలి. అది అరిచేదేగాని కరిచేదికాదు. ఈలోకం మా లోపాలు కూడా బాగానే ఎత్తిచూపింది. పాపం అరిచిఅరిచి అలిసిపోయింది" అన్నాడు.

"కృష్ణమూర్తీ... నన్ను అపార్థం చేసుకోకు. అసలు మీకు పిల్లలు పుట్టకపోవడానికి కారణం ఏమిటో ముందు చెప్పు?" చలపతిరావు ఎంతో అనునయంగా అడిగాడు.

"ఏం చెప్పమంటారు... మాకు పెళ్ళయి దాదాపు ఇరవై సంవత్సరాలైంది. పెళ్ళయిన కొత్తలో రెండు గర్భస్రావాలు జరిగాయి. తరువాత చాలామందులు వాడాము. డాక్టర్లు అన్నపూర్ణకి డి.ఎన్.సి చేయించాలంటే అదీ చేయించాము. అయినా తరువాత గర్భంరాలేదు. నావీర్యకణాలలో లోపంలేదని పరీక్షించిన డాక్టర్లు చెప్పారు. పిల్లలు పుట్టే యోగంలేదని




వూరుకున్నాము. నన్ను పెంచి పెద్దచేసి చదివించి ఉద్యోగంలో వేయించిన మా అన్నయ్యా వదినా వరప్రసాదంలాగ సమతని మా రక్షణ భారానికి వదిలిపెట్టి వెళ్ళిపోయారు. మా సరదాలు, ముచ్చట్లు ఆమెతోనే తీర్చుకున్నాము. అంతే! అని మొత్తం గతమంతా చెప్పాడు.

వాతావరణమే కలుషితమైనట్లయింది. కృష్ణమూర్తి భారమైన నిట్టూర్పువిడిచాడు. చలపతిరావు గుండెలు కూడా బరువెక్కాయి. ఎలాంటివాళ్ళని కలుపుతాడీదేవుడు. వాళ్ళ గతం కూడా జ్ఞాపకం వచ్చింది. జగదీష్ లేకపోతే వాళ్ళజీవితంలో వెలుగుండేదా. అలాగే సమత కృష్ణమూర్తి, అన్నపూర్ణల జీవితాలలో జాబిల్లిలా ఉదయించి వెన్నెలలు కురిపించి వుంటుంది. అలాంటి చందమామని తమని వదిలి వాళ్ళబతుకు చీకటైతే చూస్తూ వూరుకోగూడదు.

మరింత పట్టుదల వచ్చింది చలపతిరావుకి.

"సరే... అయిందేదో అయింది. నువ్వు పేపర్లు అలవాటుగా చదువుతున్నావా?" అడిగాడు.

"ఎందుకు చదవను?"

"ఈమధ్య వచ్చిన టెస్టు ట్యూబ్ బేబీల వార్తలు చదివారా?"

"ఆ... చదివాను. ఎవరో బెంగుళూరులోని డాక్టరు ఇంగ్లండుకు భార్యని తీసుకుని వెళ్ళి అక్కడ టెస్టుట్యూబ్ సాయంతో గర్భం వచ్చిన తరువాత వచ్చి ఈమధ్యనే కొడుకును కన్నారు. అదేనా?" అన్నాడు.

"ఆ... అతను డాక్టరు ప్రకాష్, ఆయన భార్య నిరుపమ. వాళ్లకి ఓ చక్కని బాబు పుట్టాడు. ఆమెకి అచ్చం చెల్లమ్మకున్న ప్రాబ్లమే. ఒకసారో రెండుసార్లో గర్భం వచ్చిపోయింది" అని వివరించాడు.

"చెప్పానుగదండీ.... పిల్లలమీది వ్యామోహం చంపుకున్నాము. అయినా ఇంగ్లాండు వెళ్ళి పిల్లల్ని కనేస్తోమతు వున్నవాళ్లకి అలాంటి ఆలోచనలు వస్తాయి, మాకెందుకొస్తాయండి" అన్నాడు కృష్ణమూర్తి.

చలపతిరావు అందుకున్నాడు— "పిచ్చివాడా! నీలా చదువుకున్నవాళ్ళు కూడా ఈ పెంపొందించిన వైజ్ఞానిక ప్రగతిని ఉపయోగించుకోకపోతే ఎలా? ఈనాడు పిల్లలు కావాలనుకున్నవాళ్ళు పిల్లల్ని కనడం ఏమంత కష్టంకాదు. పూర్వంలాగా ఈయన గొడ్డువాడు, ఈమె గొడ్రాలు అని నలుగురూ ఛీదరిస్తుంటే గుడ్లనీరు కక్కుకుంటూ ఊరుకునే రోజులుపోయాయి. గర్భందాల్చే శక్తి తల్లికి లేకపోయినా లేక వీర్యకణాలలో లోపంవున్నా పిల్లల్నికనే అదృష్టానికి ప్రతి జంటా నోచుకునేరోజులు వచ్చాయి. అలాంటిది మీకేమయ్యా— నిక్షేపంలా రెండుమార్లు గర్భంవచ్చి ఎబార్షన్ జరిగిపోయిందంటున్నావు. ఆమె ఫెలోపిన్ ట్యూబులో ఏదో బ్లాక్ ఏర్పడివుండవచ్చు. నీభార్య అండాన్ని తీసి, నీ వీర్యకణంతోటే టెస్టు ట్యూబ్‌లో పొదిగించి పిండోత్పత్తి జరిగిన తరవాత మీ ఆవిడ గర్భాశయంలోనే ప్రవేశపెడతారు. ముమ్మూర్తులా మిమ్మల్ని పోలినపిల్లలు మీకు పుడతారు. ఇంతమంచి సువర్ణావకాశం వుంచుకుని కూడా ఉపయోగించుకోకుండా జీవితం వృధాచేసుకుంటున్నారా?" అని కోపడ్డాడు చలపతిరావు.

కృష్ణమూర్తి బిత్తరపోయాడు. చలపతిరావు సీరియస్‌గానే చెపుతున్నట్లు రూఢీఅయింది. నిజంగా ఓ యాభైఏళ్లక్రితం గొడ్రాలు పిల్లల్ని కనడం అంటే "చందమామని అందుకో" అన్నట్లుగా వుండేది. ఇప్పుడెంత తేలిగ్గా అనేస్తున్నాడాయన. బజారుకెళ్ళి ఆటబొమ్మ కొనుక్కోలేమా అన్నంత తేలిగ్గా చెపుతున్నాడే!

ఓ పిల్లాణ్ని కనిచూపించడం, తండ్రి అనిపించుకోవడంకన్నా తనకి మాత్రంకావలసిందేముంది! అన్నపూర్ణ తల్లిఅయి చిన్నారి పాపచేత "అమ్మా" అని పిలిపించుకుంటే ఎంత హాయిగా ఉంటుంది.

"ఏమిటయ్యా! ఇంకా ఆలోచన. నువ్వు దీనికిగనుక ఒప్పుకుంటే మిగతాది నేను చూసుకుంటాను" అని గదమాయించాడు చలపతిరావు.

నిజంగా ఈయన దేవుడే. ఎంత శ్రద్ధ, ఎంత చనువు తీసుకుంటున్నారు.

"మీ ఇష్టం. ఎలా చెయ్యమంటే అలాచేస్తాను. కాని మరోవిషయం ఆలోచించాలి. నాకిప్పుడు నలభైఅయిదు సంవత్సరాలు— మరో

పన్నెండేళ్లలో రిటైరైపోతాను. పుట్టినవాడికి చదువూసంధ్యా పూర్తికావద్దా? జనాభా పెరుగుదలని అరికట్టాలని ప్రభుత్వం చూస్తుంటే మీరు మరోప్రాణిని ఈ కరువుదేశంలోకి తెస్తానంటారేమిటి?'' హాస్యంగా అన్నాడు కృష్ణమూర్తి.

''పిల్లలు లేనివాళ్ళతో పిల్లల్ని కనవద్దని ఏ దేశమూ చెప్పదు. ఎక్కువమంది పిల్లల్ని కనవద్దని మాత్రమే చెబుతుంది. నువ్వు ఇంక ఎలాంటి దిగులూ పెట్టుకోవద్దు. రిటైరైన తరవాత వచ్చిన డబ్బుతో కొడుకుని చదివించుకోలేవా? లేకపోతే వాళ్లక్కవుండదా? మనమందరమూ లేమా?'' అన్నాడు.

''సరే... మీయిష్టం. ఏంచెయ్యాలో చెప్పండి?'' అని గ్రీన్ సిగ్నల్ ఇచ్చాడు కృష్ణమూర్తి.

''ఏంలేదు... ఓనెలరోజులు సెలవుపెట్టు. చెల్లమ్మకి విషయమంతా వివరించు. నేను కూడా మీతో బొంబాయి వస్తాను. కింగ్ఎడ్వర్డ్ మెడికల్ హాస్పిటల్‌కి వెళదాము. వాళ్ళు ఇప్పటికే నీలాంటి ఎంతోమందికి సంతానప్రాప్తి కలిగించారు'' అని ప్రోత్సహించాడు చలపతిరావు.

సంభాషణ అంతటితో ముగిసింది.

''ఇంక లేద్దామా'' అని లేచాడు చలపతిరావు. కృష్ణమూర్తికూడా లేచాడు.

ఇద్దరూ ఇంటికి చేరుకునేసరికి ఒంటిగంట దాటిపోయింది.

జగదీష్ ఒక్కడూ హాలులో పేపరు చదువుతూ కనిపించాడు.

వంట గదిలో ఆడవాళ్ళు సరదాగా మాట్లాడుకుంటున్నారు. మధ్య మధ్యలో నవ్వులు.

జగదీష్ ''ఇంతసేపు చేశావేమిటి నాన్నా! ఆకలిదంచేస్తోంది. రండి మామయ్యా, భోజనంచేసేద్దాం'' అని కృష్ణమూర్తిని కూడా పలకరించాడు.

అప్పటికే డైనింగ్ టేబుల్‌మీద అన్నీసర్దేసి ఉన్నాయి.

వంటకాలు ఎంతో బాగా కుదిరాయి. అందరూ అవురావురుమంటూ తిన్నారు.





తరవాత కాసేపు విశ్రాంతి తీసుకున్నారందరూ.

సాయంత్రం టిఫిన్‌కూడా ముగిశాక అన్నపూర్ణ, కృష్ణమూర్తి సెలవుతీసుకుని విద్యానగర్ వెళ్ళిపోయారు.

ఆరాత్రి చలపతిరావు భార్య నిర్మలకి, కొడుకు జగదీష్‌కీ జరిగినదంతా చెప్పాడు.

సమత అంతా వడ్డిస్తూ విన్నది.

★ ★ ★

సుబ్బారావు చలపతిరావుకి బాల్యమిత్రుడు. ప్రాణమిత్రుడు అని చెప్పుకున్నా అతిశయోక్తి కాదు.

హైదరాబాదు ఎప్పుడు వచ్చినా చలపతిరావుతో ఓరోజు గడపందే వెళ్ళడు. బొంబాయిలో ఇల్లు సంపాదించుకుని స్థిరపడ్డాడు. సెంట్రల్ ఎక్సయిజ్ డిపార్టుమెంటులో మంచిహోదాగల వుద్యోగం. వచ్చిన ప్రతిసారీ బొంబాయి ఒక్కమారు రమ్మని సతపెడుతూ వుంటాడు— కాని చలపతిరావుకి వెళ్ళడానికి పడలేదు.

''సుబ్బారావూ... ఎప్పుడో ఒకసారి తప్పకుండా బొంబాయి వస్తాను మీ ఇంటికి. నువ్వు నాతో విసిగిపోయి ఇంక దయచెయ్యి అనేదాకా కదలను... సరేనా?'' అనేవాడు.

ఇపుడు కృష్ణమూర్తి, అన్నపూర్ణల వైద్యంకోసం బొంబాయి వెళ్ళే అవకాశం దొరికింది. సుబ్బారావుకి కృష్ణమూర్తి, అన్నపూర్ణల విషయం రాసి కె.ఇ.ఎమ్.హాస్పిటల్‌లో కావలసిన సమాచారం తెలుసుకుని వెంటనే జవాబు రాయమని ఓ ఉత్తరం రాసిపడేశాడు. ఓ నెలరోజులు వుండటానికి ఏర్పాట్లు కూడా చేసిపెట్టమన్నాడు.

సుబ్బారావు వారంరోజుల్లోనే సమాధానం రాశాడు. కె.ఇ.ఎమ్. హాస్పిటల్‌లో పనిచేస్తున్న ఓ లేడీడాక్టరుని కలిసి మొత్తం వివరాలు తెలుసుకుని రాశాడు. టెస్టులన్నీ చెయ్యడానికి టైము బాగానేపడుతుందనీ, ఎప్పుడు వచ్చినా ఫరవాలేదనీ, డాక్టరు దగ్గర ఎపాయింట్‌మెంట్ తీసుకున్నాననీ, వెంటనే బయలుదేరి రమ్మనీ రాశాడు.

చలపతిరావు కృష్ణమూర్తిని కలుసుకుని నెలరోజులు సెలవుపెట్టమన్నాడు.

ప్రయాణం నిశ్చయమైపోయింది. రిజర్వేష

ను కూడా చేయించుకున్నారు.

★ ★ ★

సుబ్బారావు ఎప్పుడో ముప్పైఏళ్ళ క్రితం బొంబాయి ఉద్యోగరీత్యా వచ్చాడు. అప్పట్నుంచీ బొంబాయిలోనే అలవాటైపోయింది. బొంబాయిలోనే బతకాలి అని ఓ ఫ్లాట్ సంపాదించాడు. కారు కొన్నాడు.

సుబ్బారావు పిల్లలు ఇంట్లో ఎంత చక్కని తెలుగు మాట్లాడతారో బయట అంతే చక్కటి మరాఠీ మాట్లాడతారు.

చలపతిరావు టెలిగ్రామ్ చూసి సుబ్బారావు వి.టి. స్టేషనుకి కారులో వెళ్ళి చలపతిరావునీ, కృష్ణమూర్తినీ, అన్నపూర్ణనీ రిసీవ్‌చేసుకున్నాడు. ఏకారణంగా అయితేనేం బాల్యమిత్రుడు చలపతిరావు బొంబాయి వచ్చి, వాళ్ళ ఇంటికి రావడం ఎంతో సంతోషాన్ని కలిగించింది.

పరిచయాలయ్యాయి. కారులో ఇంటికి తీసుకువచ్చాడు. వాళ్ళింటిలోనే వాళ్ళకి బెడ్‌రూమ్ కేటాయించాడు. ఆ గదికి బాత్‌రూమ్ టాయ్‌లెట్ అన్నీ వున్నాయి. చలపతిరావుకి అలా సుబ్బారావు ఇంట్లో నెలరోజులు మకాంవెయ్యడం ఇష్టంలేదు. కాని బొంబాయిలో ఎకామిడేషన్ పెద్ద ప్రాబ్లమ్. తక్కినవి డబ్బు పారేస్తే దొరుకుతాయి. అందుకే వూరుకోకతప్పలేదు.

సుబ్బారావు భార్య ముప్పై ఏళ్ళుగా బొంబాయిలోవున్నా తెలుగు సంప్రదాయాలూ, తిండీ, కట్టూ బొట్టూ, మర్యాదలూ ఏవీ వదిలిపెట్టలేదు. ఎన్నో మర్యాదలు చేసింది. వాళ్ళింట్లో రుచైన తెలుగుభోజనం చేశారు.

చలపతిరావుకి కాలం వృధాచెయ్యడం అంటే ఎలర్జీ. ఏ పనీలేకుండా అనవసరంగా ఎక్కడికీ వెళ్ళడు. వెళ్ళిన పని,దానిని సాధించడంతప్ప వేరేవి అతని బుర్రలోకి రావు. అదే రోజు సాయంత్రం డాక్టర్ని కలుసుకోవాలని కూర్చున్నాడు.

సుబ్బారావు కూడా పని విషయంలో స్నేహితుడికి తీసిపోడు. అతడూ పనిముందు అనేరకమే. రేపటి పని ఈరోజు, ఈరోజు పని ఇప్పుడు అని పాట పాడుతూవుంటాడు. అదీ కాక ఎప్పుడూరాని మిత్రుడు చలపతిరావు బొంబాయి ఎందుకు వచ్చాడో సుబ్బారావుకి తెలుసును.

వెంటనే ఆ లేడీడాక్టరుకి టెలిఫోన్ చేశాడు. కృష్ణమూర్తి, అన్నపూర్ణ వచ్చిన సంగతి చెప్పి ఎన్ని గంటలకి రావాలో కనుక్కున్నాడు. సాయంత్రం ఆమె క్లినిక్‌కి జనరల్‌చెకప్ చెయ్యడానికి, కేసు వివరాలు అడిగి తెలుసుకోవడానికి రమ్మంది.

సాయంత్రం ఆమె చెప్పిన టైముకు సుబ్బారావు ముగ్గుర్నీ కారులో డాక్టరు క్లినిక్‌కి తీసుకు వెళ్ళాడు.

లేడీడాక్టరు అన్నపూర్ణ ఆరోగ్యాన్ని చెక్‌చేసింది. అన్నీ నార్మల్‌గా వున్నాయని చెప్పింది. మెన్సస్ పీరియడ్స్‌ని గురించిన ఇతర వివరాలు కూడా అడిగి తెలుసుకుంది.

కృష్ణమూర్తిని కూడా కొన్ని ప్రశ్నలు వేసింది. అన్నిటికి సమాధానాలు చెప్పాడు. అదివరకు గర్భస్రావం జరిగిన సంగతి వినగానే ఆశాజనకంగానే కనిపించింది.

కృష్ణమూర్తికి నిజంగా ఆ వయసులో ఇంకా పిల్లలు పుడతారా అనే అనుమానం పోలేదు. ఆ మాటే అడిగాడు.

"తప్పకుండా పుడతారండీ. 1970 లోనే ఎందరో డాక్టర్లు గట్టి ప్రయోగాలు చేశారు. 1978లో పేట్రిక్ స్టెప్టెయో, రాబర్ట్ఎడ్వర్డ్‌ల ఆధ్వర్యంలో ఇంగ్లాండులో మొదటి టెస్టు ట్యూబ్ బేబీ పుట్టాడు. అతని పేరు లూయిస్ బ్రౌన్. తరవాత ఇప్పటికే కొన్నివేల మందికి అలాంటి బేబీలు పుట్టారు. భారతదేశాన్ని తీసుకుంటే డాక్టర్ ప్రకాష్‌కి అతని భార్య నిరుపమకీ ఓ బాబు పుట్టాడు. కాకపోతే ఎంబ్రియో ట్రాన్స్‌ఫర్, అదే ఆర్టిఫిషియల్ ఫెర్టిలైజేషన్ ఇంగ్లాండులో జరిగింది. బెంగుళూరులోని సెయింట్ ఫిలోమినాస్ హాస్పిటల్‌లో జూన్ 14, 1986 సంవత్సరం శనివారం రోజున పుట్టాడు.

భారతదేశంలోనే అన్నీ జరిగిన మొదటిబిడ్డ మా కె.ఇ.ఎమ్ ఆసుపత్రిలో ఈ మధ్యనే పుట్టింది. డాక్టర్ ఇందిరా హిందుజగారి ఆధ్వర్యంలోనే అంతా మనదేశంలోనే మా హాస్పిటల్‌లోనే జరిగింది. పిల్లలుపుట్టని స్త్రీలలో దాదాపు 90 శాతం మందికి పిల్లలుపుట్టే అవకాశాలున్నాయి.




ఆమెకు మళ్లీ నమ్మకం కలిగేలాగ కృష్ణమూర్తితో... "ఇదేమిటిసార్– మీరిలాగంటారు. మొన్న జూన్ 18 తేదీని ఫ్రాన్సులో టెస్టుట్యూబ్ కవలపిల్లలు కూడా పుట్టారు. వాళ్లకి వైసెంట్, కామిల్లె అని పేర్లు పెట్టారు.

ఈ ప్రక్రియని మా వైద్యపరిభాషలో ఇన్-వైట్రో ఫెర్టిలైజేషన్ ఎంబ్రియోర్ ట్రాన్స్‌ఫర్ (IVF-ET) అనిపిలుస్తారు. తప్పకుండా మీకు పిల్లాడు పుడతాడు. రేపు హాస్పిటల్‌కి రండి. అక్కడ మీలాగే ఎంతోమంది పిల్లల కోసం క్యూలో కనిపిస్తారు" అని ధైర్యం కలిగేలాగ నమ్మకంగా చెప్పింది.

కృష్ణమూర్తికి ధైర్యం వచ్చింది.

మరునాడు ఉదయమే కె.ఇ.ఎమ్ హాస్పిటల్‌కి కృష్ణమూర్తినీ, అన్నపూర్ణను తీసుకునివెళ్లారు.

లేడీ డాక్టరు ముందుగానే అన్ని ఏర్పాట్లూ చెయ్యడంచేత అన్నపూర్ణని ముందుగా కొందరు లేడీ డాక్టర్లు చెక్ చేశారు.

మరో వార్డులో కృష్ణమూర్తి వీర్యకణాలను డాక్టర్లు పరీక్షించారు. అతని వీర్యకణాలు ఆరోగ్యంగా వున్నట్లు మైక్రోస్కోపు టెస్టులో తేలిపోయింది.

అన్నపూర్ణ విషయంలో చలపతిరావు వ్యూహించినట్లే ఫెల్లోపియన్ ట్యూబ్స్‌లో బ్లాంకేజ్ ఏర్పడి అండం గర్భాశయంలోకి చేరుకోవడం లేదని తేలింది.

డాక్టర్లు అన్నపూర్ణ హార్మోన్సుని ఉత్తేజపరచడానికి ఇంజక్షన్లు చేశారు.

సాధారణంగా అండాశయంలో ఒక్క అండం మాత్రమే ఒక్కోమారు ఉత్పత్తి అవుతుంది. హార్మోన్సుని ఉత్తేజపరచడం ద్వారా పదినుంచి పదిహేను అండాలు ఉత్పత్తి అవుతాయి.

అన్నపూర్ణ అండాశయంనుంచి పరిపక్వానికి వచ్చిన తొమ్మిదిగుడ్లని ఎన్నుకుని అండాశయం నుంచి బయటికి తీశారు. కృష్ణమూర్తి వీర్యకణాలుగల పెట్రిడిష్‌లో విడిచారు. వీర్యకణాలు అండప్రవేశంచేసి కణవిభజన మొదలై తొమ్మిది పిండాలు ఏర్పడ్డాయి. రెండురోజులు పెట్రిడిష్‌లోనే కణవిభజన జరిగింది. ఆ తొమ్మిది పిండాలలోనుంచి మూడు పిండాలను ఎన్నికచేసి అన్నపూర్ణ గర్భాశయంలోకి ప్రవేశపెట్టారు.

మిగిలిన ఆరు పిండాలను లిక్విడ్‌నైట్రోజన్‌లో ఘనీభవింపజేశారు. ఘనీభవించడానికి ముందే రెండు పిండాలు చనిపోయాయి. మిగతా నాలుగూ ఘనీభవించాయి.

అవి చెక్కుచెదరకుండా రెండేళ్లు అవసరం అనుకుంటే ఇంకా ఎక్కువకాలం వాటిలోని జీవం నిద్రాణ స్థితిలో వుంటుందని చెప్పారు డాక్టర్లు. మళ్లీ అవసరం అనుకున్నప్పుడు శరీర ఉష్ణోగ్రత దగ్గరికి తీసుకురాగానే వాటికి మళ్లీ బతుకు మొదలౌతుంది.

దురదృష్టవశాత్తూ మొదటి విడతలోని మూడుపిండాలలో ఒక్కటి కూడా అన్నపూర్ణ గర్భంలో నిలువలేదు

మరొకరినైతే లాభంలేదని పంపేసేవారే. కాని చలపతిరావు, సుబ్బారావుల పట్టుదలవలన మళ్లీ అదివరకటి నాలుగుపిండాలలో నుంచి రెంటిని మాత్రం క్లీన్‌చేసి అన్నపూర్ణగర్భంలో ప్రవేశపెట్టారు. మిగిలిన రెండూ ఉత్తరోత్రా, అన్నపూర్ణ అండం వుత్పత్తి చెయ్యలేకపోయినా, కృష్ణమూర్తి వీర్యకణాలలో జీవం లేకపోయినా ఉపయోగించుకోవచ్చు.

దాతల ప్రమేయంలేకుండా అలాంటి పిండాలు మరొకరికి దానం చెయ్యగూడదనే ఆంక్షవుంది. దాతల అనుమతివుంటే మరో స్త్రీ కూడా ఆ పిండాలతో గర్భం దాల్చగలుగుతుంది. కాకపోతే రూపురేఖలు, శరీరతత్వం దాతలను పోలివుంటుంది.

రెండోమారు అన్నపూర్ణకి గర్భం నిలిచింది.

డాక్టర్లు దాదాపు నెలరోజులు అన్నపూర్ణని రెగ్యులర్‌గా చెక్ చేశారు. ఆమె ఆరోగ్యం బాగుగానేవుంది. ఇంక తీసుకువెళ్లవచ్చునని చెప్పారు. తగినమందులు, గర్భిణీ స్త్రీలకి తీసుకోవలసిన జాగ్రత్తలన్నీ తీసుకొమ్మని చెప్పారు.

"మళ్లీ పురుటికి ఇక్కడికే తీసుకుని రావాలా?" అని అడిగాడు డాక్టర్లని.

"అవసరంలేదు... కాకపోతే సిజరియన్ చేసైనా పిల్లని తియ్యడానికి కూడా అవకాశమున్న హాస్పిటల్‌లో పురుడుపోయించడం మంచిది" అన్నారు వారు.



ఆ శుభవార్తని హైదరాబాదుకి తెలియజేశాడు చలపతిరావు.

నిర్మల, సమత ఎంతో సంతోషించారు.

"అత్తయ్యా... మామయ్య ఎంతమంచివారు. ఆయనకి ఎంత పట్టుదల. అనుకున్నది సాధించారు. మాపిన్ని చిన్నాన్నలకి పిల్లలు పుడతారని కలలోకూడా వూహించలేదు" అంది సమత.

ఆయన ఎంత మహాత్ముడో, ఆయన హృదయం ఎంత విశాలమైనదో నీకు ఇంకా సరిగా తెలియదు సమతా! ఆయన రేపటి మనిషి. రేపటి మనుమలు కూడా ఆయనంత ఆధునికంగా ఆలోచించలేరు. నీకు ఆయనగురించి తెలిసింది చాలా తక్కువ. రేపు మా జగదీష్ని సమయం వచ్చినప్పుడు అడుగు చెపుతాడు" అంది.

అలా అంటున్నపుడు నిర్మల కళ్లు నీళ్లతో నిండుకున్నాయి. ఆయనవంటివారు మరి వుంటారా. ఆయనకి అంత ఆదర్శభావాలు లేకపోతే తనకి మాతృత్వం దక్కేదా. ఎన్నిజన్మల పుణ్యమో అంత మంచిభర్త దొరికారు అనుకుంది.




కాలచక్రం ఒక్కోమారు గిర్రునతిరిగిపోతుంది. ఒక్కోమారు చాలా మందకొడిగా సాగుతుంది.

చలపతిరావు, కృష్ణమూర్తి అన్నపూర్ణని సికింద్రాబాదు తీసుకువచ్చేసిన తరవాత మాత్రం కాలం చకచకాసాగిపోయింది.

ఓ లేడీడాక్టరుకి వారంవారం చూపించేవాడు కృష్ణమూర్తి. మందులు టైముప్రకారం వాడించి కంటికి రెప్పలాగా చూసుకున్నాడు. బలానికి ఇంజక్షనులు, ధనుర్వాతం రాకుండా ఇంజక్షనులు అన్నీ చేయించాడు. బహుశా ఏగర్భిణీ స్త్రీకి అంత ఆలనాపాలనా జరిగి వుండదు.

కృష్ణమూర్తి దేనికైనా ఒప్పుకున్నాడుగాని బొంబాయిలో చలపతిరావుని పైసాఖర్చుపెట్ట నివ్వలేదు. అందుకని సికింద్రాబాదు వచ్చిన తరవాత మళ్ళీ విజృంభించాడు చలపతిరావు. రోజుతప్పించి రోజు వచ్చి చూడటం పళ్ళూ ఫలాలూ లాంటివి తేవడంచేశాడు. జగదీష్, సమతా వారానికోరోజు వచ్చి చూసిపోయేవారు.

నెలలు నిండాయి. ఏదైనా మంచి నర్సింగ్ హోమ్లో చేర్పించాలనుకున్నారు మొదట. కాని అన్ని సౌకర్యాలూ వుండవు. చివరినిమిషంలో అది లేదు ఇదిలేదు గవర్నమెంటు ఆసుపత్రికే తీసుకుపొండి అనేస్తారు తేలిగ్గా. అప్పుడెంత ఇబ్బంది అందుకని గాంధీహాస్పిటల్లో చేర్పించాలనే నిర్ణయానికొచ్చారు. జగదీష్కి ఇష్టంలేకపోయినా పురుడయ్యేదాకా వాళ్ళమ్మకి సాయంగా వుంటుందని సమతని వాళ్ళవాళ్ళింటికి పంపించాడు.

ఆరోజూ రానేవచ్చింది.

ఓరోజు వేకువజామున ఐదుగంటలకి పొత్తికడుపులో చురుక్కుమన్నట్లయింది. అన్నపూర్ణ తెలునుకోలేకపోయింది. తరవాత మరికాస్త గట్టిగా నొప్పివచ్చింది. అనుమానం వచ్చి సమతని లేపింది. సమత కృష్ణమూర్తిని లేపింది.

మరి ఆలస్యం చెయ్యలేదు. కృష్ణమూర్తి పొరుగింటాయనని లేపాడు. ఆయనకి కారుంది. ఎప్పుడైనా కారు అడగమని స్వయంగా తీసుకువెళ్ళి డ్రాప్ చేస్తానని చెప్పాడు. వెంటనే లేచిబట్టలు వేసుకున్నాడు ఆ మిత్రుడు.

వారింట్లో ఫోన్కూడా ఉంది. చలపతిరావుకి ఫోనుచేశాడు. తిన్నగా సికింద్రాబాదు గాంధీ హాస్పిటల్కి రమ్మన్నాడు.

సమత వాళ్ళపిన్నిని పొదివిపట్టుకుని కారులో ఎక్కించి వెనకసీట్లో కూర్చుంది. కృష్ణమూర్తి ముందు సీట్లో డ్రైవరుపక్కన కూర్చు











న్నాడు.

కారు హాస్పిటల్ చేరుకుంది. నమత వాళ్ళ పిన్నిని మెల్లగా నడిపించుకుని మెటర్నిటీ వార్డులోనికి తీనుకుని వెళ్ళింది.

కృష్ణమూర్తి అక్కడి డ్యూటీ డాక్టరుకి అన్న పూర్ణకేనుని వివరించి చెప్పాడు. కె.ఇ.ఎమ్. హాస్పిటల్నుంచి డిస్చార్చి అయినప్పుడిచ్చిన పేపర్లు చూపించాడు.

ఆ డాక్టరు అవనరమైతే సిజేరియన్ చెయ్య డానికి కూడా ఏర్పాట్లు చేసింది.

లేబర్రూమ్కి తీనుకుని వెళ్ళి కడువంతా శ్రద్ధగా అన్నివేపుల తడిమిచూసింది. శిశువు

పొజిషన్‌లోనే వున్నదని తెలుసుకున్నాక కంగా రుపడవలసిన అవసరంలేదని కృష్ణమూర్తికి, నమతకి తెలియజేసింది.

మరో పావుగంటలో చలపతిరావు, నిర్మల, జగదీష్ వచ్చారు.

గంటకిపైగానే గడిచింది.

అందరూ ఎంతో ఉత్కంఠతో ఎదురుచూడ సాగారు. కేసుమామూలుదికాదు. అంత నస్వె న్సు జీవితంలో ఎప్పుడూ అనుభవంలోకి రాలే దు కృష్ణమూర్తికి. ఏ బిడ్డపుట్టినా మహాప్రసా దమే కానీ తల్లీపిల్లా క్షేమంగా వుండాలని- దేవుళ్ళను నమ్మనివాడుకూడా ఆవదమొక్కు లు మొక్కుకున్నాడు.

చలపతిరావు, జగదీష్ మాత్రం తప్ప కుండా కొడుకే పుట్టాలని కోరుకున్నారు.

చివరికి కొడుకే పుట్టాడు. కాకపోతే కాస్త బలహీనంగా పుట్టాడు. రెండున్నర కిలోగ్రా ముల బరువుతూగాడు.

వాళ్ళసంతోషానికి అవధులు లేకపో యాయి. స్పెషల్ రూం తీసుకుని అన్నపూర్ణని అక్కడికి తరలింపజేశారు. తల్లీపిల్లల కండి షన్ బాగుంది.

మూడోరోజునే డిస్చార్జి చేశారు.

అందరూ విద్యానగర్ చేరుకున్నారు.

బోలెడు సెలవులుండటం చేత జగదీష్ కూడా ఆ మూడురోజులూ సెలవుపెట్టి హాస్పి టల్ చుట్టూ తిరిగాడు.

ఇంటికి చేరుకోగానే అందరికీ కొండంత బరువు దించినట్లయింది.

నమత అందరికీ చక్కగా భోజనం వండింది.

చలపతిరావు, జగదీష్, కృష్ణమూర్తి డైనింగ్ టేబుల్‌మీద భోజనానికి కూర్చున్నారు. మూడు రోజుల నుంచీ సరియైన తిండిలేదేమో ఆవు రావురుమని పోటీలు పడితిన్నారు.

చలపతిరావు "కృష్ణమూర్తీ... కంగ్రాచ్యులేష న్స్. కొడుకుని కని తండ్రివయ్యావు" అన్నాడు నవ్వుతూ.

కృష్ణమూర్తి చెవుల్లో "తండ్రివయ్యావు" అనే మాటలు వీనులవిందుగా సోకాయి. ఎంతో హాయి అనిపించింది. వద్దనుకున్నప్పుడు పిల్ల లు పుడితే దంపతులకు శాపంలాగా వుంటుంది. కాని ఇక పిల్లలు పుట్టేయోగం లేదుఅని నిరాశచేసుకున్న కృష్ణమూర్తి అన్నపూ ర్ణలకు అదొక వరం. లక్షలు కలిసొచ్చినా కలగని ఆనందం అది. తమ దాంపత్యానికి ఓ పరిపూర్ణత వచ్చినట్లు సంతోషించాడు కృష్ణ మూర్తి. దీనికంతటికీ కారణం దేవుడిలాంటి చలపతిరావు అని గుర్తురాగానే కన్నుల్లో ఆనందాశ్రువులు నిండుకున్నాయి. గొంతు మూగపోయింది.

ఎలాగో నిభాయించుకుని "అంతా మీశ్రద్ధ బావగారూ! ఆ తర్వాత అల్లుడి పట్టుదల, మా అదృష్టం" అన్నాడు.

నమత ఓతమ్ముడు పుడితే బాగుండునని ఎన్ని కలలుకన్నది. ఆ కలలిప్పుడు నిజమ య్యాయి. ఆనందాశ్రువులు ఆపుకోలేకపో తోంది.

అన్నపూర్ణ పొత్తిళ్ళలో పాపని అపురూపంగా నిమురుతూ మురిసిపోయింది. డైనింగ్ హాలు లోనుంచి వాళ్ళమాటలు వినిపిస్తూనే వున్నాయి. నమత చేత అమ్మా అనిపించు కుంది. కాని ఏదో వెలితి. ఇప్పుడా వెలితికూడా లేదు. తను తల్లి కాగలిగింది. తన కడుపు పండింది. ఇదంతా నాకన్నతల్లి నమత చలవ కాదూ. వీళ్ళెంతవద్దన్నా నమతకి మొత్తం ఆస్తిలో నగంవాటా ఇప్పించనూ- అనుకుంది.

మెల్లగాలేచి డైనింగ్ టేబుల్ దగ్గరకి వచ్చింది.

నమత కంగారుపడి "నువ్వెందుకమ్మా ఇక్కడికి?" అని వారించింది.

"ఫరవాలేదు... నేను బాగానే ఉన్నాను లేవే" అని కృష్ణమూర్తిని ఉద్దేశించి, "ఏమ టండీ... అలా ఊరుకుంటారు. అల్లుడు ఎంత వద్దంటే మాత్రం నమత తరవాతే వీడు. దాని నగంవాటా దానికి ఇవ్వకపోతే మనకి పుట్టగతు లుంటాయా?" అంది.

"మనమివ్వడమేమిటే? నమతకి నగంవా టాకి హక్కులేదా? అన్నాడు కృష్ణమూర్తి.

చలపతిరావు- "రామాయణం అంతా విన్నీ రాముడికి సీతేమౌతుంది అన్నారట మీలాంటి వాళ్ళే. మేంకట్నం తీసుకోలేదు అని గప్పాలు




కొట్టుకుందామని ఇన్నితిప్పలూ పడితే మళ్ళీ మొదటికేవస్తున్నారే" అన్నాడు చేతులు కడుక్కుంటూ.

సమత మామగారికి టవల్ అందించింది.

"మీరిలా అనడం బాగులేదండి బావగారూ? ఆడపిల్లలకి ఆస్తిలో హక్కువుండకూడదంటారా మీరు?" అన్నాడు కృష్ణమూర్తి.

"స్త్రీని ఓ పశువుతో పోలుస్తున్నందుకు స్త్రీజాతి నన్ను క్షమిస్తే ఒకమాట. ఆఖరికి పశువుని పెంచినా పెంచినవాళ్ళకి ఎంతో కొంత డబ్బు ముడుతుంది. అలాంటిది ఓ స్త్రీని కన్నవారి నుంచి తీసుకుంటున్నప్పుడు ఆస్త్రీని కన్నతల్లిదండ్రులకు డబ్బివ్వాలి. అలా ఇచ్చేది పోయి మళ్ళీ కట్నాలూ కానుకలూ అడగడంలో ధర్మంఏదీ?" ప్రశ్నించాడు చలపతిరావు.

"అలా రిక్తహస్తాలతో వచ్చిన స్త్రీకి సమాజంలో ఏమి విలువ వుంటుందన్నయ్యా? ఎదురుప్రశ్నించింది" అన్నపూర్ణ.

"ఎందుకుండదు చెల్లెమ్మా! మా నిర్మలని అడగండి- మీ ఎదురుగానే వుందిగదా. నేను చిల్లు కానీ తీసుకోలేదు. ఇప్పుడు నేను సంపాదించినదంతా ఆమె చేతిమీదిగానే ఖర్చుతుంది. అన్నిటిలోనూ నాతో సమానంగా వాటా వుంది. స్త్రీకి తాను మెట్టినయింట్లో వాటా వుండదా? అలాంటి వాటా లేనప్పుడు పెళ్ళిచేసుకోవడం ఎందుకు? భర్తకి, అత్తమామలకి, ఆడబిడ్డలకి ఊడిగం చెయ్యడానికా?" అన్నాడు.

"అబ్బాయిలకే పూర్తిగా ఆస్తి చెందాలా, ఆడపిల్లలకి వుండగూడదా?" మళ్ళీ అడిగింది అన్నపూర్ణ.

"నేను చెప్పిందే అది. మీకింకా అర్థమైనట్లులేదు. కోడలుగా ఆస్తిలో హక్కు, కూతురిగా ఆస్తిలో హక్కు ఎందుకు? ఒకచోట పోగొట్టుకున్నది మరోచోట లభించడంలేదా? పురుషుడికి లేని ఈ ప్రత్యేకత స్త్రీకి ఎందుకు? రెండు వేపులా పదునున్న కత్తిలా విజృంభించడానికా?" వివరించి చెప్పాడు.

కృష్ణమూర్తి- "ఇప్పుడు గొడవలెందుకులెండి. ఆ సమయం రానియ్యి అన్నపూర్ణా! వాళ్ళకిష్టం లేకపోతే అమ్మాయిపేరున బేంకులో వేస్తాంగాని ఊరుకుంటామా?" అని తన ఉద్దేశం చెప్పాడు.

"అంతకన్నా ఓ అనాథశరణాలయానికి దానం చెయ్యండి మీ అమ్మాయి పేరున. అంతేగాని నేనుమాత్రం ఎలాంటి డబ్బూ తీసుకోను. సమతని తీసుకోనివ్వను" అని జగదీష్ఖచ్చితంగా చెప్పాడు.

చలపతిరావు సర్దిచెపుతూ "ఊరుకోండర్రా! డబ్బువున్నది కష్టాల్లోనూ సుఖాల్లోనూ ఒకరినొకరు ఆదుకోవడానికి. బంధుత్వాలు కలుపుకున్నది ఒకరికొకరం సాయపడుతూ సుఖంగా జీవించడానికి. ఒకరినొకరం పీడించడానికి కాదు. మనసూమనసూ కలిస్తే ఒకరికొకరం ఒద్దన్నా ఖర్చుపెడతాం. అందులో వున్న ఆనందంవేరు. ఇక ఆసంగతి వదిలెయ్యండి. కృష్ణమూర్తీ... సుబ్బారావుకి ఈ శుభవార్త తెలియజెయ్యాలోయ్" అన్నాడు.

"చెప్పండం మరిచిపోయాను. నేను పురుడు అయినరోజునే టెలిగ్రామ్ ఇచ్చాను"

కృష్ణమూర్తి చెప్పగానే సంతృప్తిగా ఊపిరిపీల్చుకున్నాడు చలపతిరావు.

సమతని మరోనెలరోజులు వాళ్ళమ్మకి సాయంగా ఉండిపొమ్మన్నారు.

జగదీష్కి ఇప్పటికే బోరుగావుంది.

కొడుకు బాధ చలపతిరావుకి తెలుసును.

అందుకే "కృష్ణమూర్తీ... ఓ నెలరోజులు మావాణ్ని ఇల్లరికం వుంచుకోండోయ్. తరవాత కోడల్ని వాడినీ మాఇంటికి పంపించెయ్యండి" నవ్వుతూ కొడుకుని చూశాడు.

జగదీష్" నాకు ఇక్కడ నిద్రపట్టదు నాన్నా! స్కూటరేగదా ఇక్కడ భోజనం చేసినా ఏరాత్రి పదిగంటలకో మన ఇంటికే వచ్చేస్తాను" మెల్లగా తలవంచుకుని చెప్పాడు.

కృష్ణమూర్తి రోడ్డు దాకావెళ్ళి చలపతిరావునీ, నిర్మలనీ ఆటో ఎక్కించి వచ్చాడు.

వాళ్ళు రేపటి మనుషులు!!

కలిసివుంటే మనసులు కలుపుకుంటే... ఆస్తులూ అంతస్తులూ అనే అడ్డు తెరలు పునాదుల్లేని గోడల్లా కూలిపోతాయి... ఇలాంటి మనుషుల చలవవల్లనే.





# రచయితలకు సూచనలు

ప్రచురించే ప్రతి నవలకు రు. 2000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే. వైవిధ్యపూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకోగల నవలలకు వేదిక 'చతుర'.



★ ''చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలుకాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. ''చతుర''లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 300 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 30 వేల పదాలకు తక్కువగాకుండా ఉండాలి. వ్రాతపతిలో వారి వారి దస్తూరినిబట్టి,ఒక పేజీకి ఎన్ని పదాలు వస్తున్నాయనేదానినిబట్టి మొత్తం నవల పేజీలకు ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ ప్రకారం ''చతుర'' కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికగాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగుపోస్టేజీని జతపరచాలి. వ్రాత ప్రతులు పోస్టులోగానీ, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్

# చతుర

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482.

# కాసుకు బలవుతున్న కళాఖండాలు

రాజస్థాన్‌లోని దిల్‌వారా జైనదేవాలయ అంతర్భాగపు ఉపరితలం.

ప్రాచీన కళాఖండాలు, పురాతన వస్తువులు గతించిన కాలానికీ, వర్తమానానికీ వారధి వంటివి. అవి భావితరాలవారి సృజనాత్మక శక్తిని ఉద్దీపింపజేస్తాయి. అంతేకాకుండా ఒక తరానికి సంబంధించిన కళాత్మక వస్తువులను పరిశీలించి ఆనాటి కళాకారుల భావనలను తద్వారా నాటి ప్రజల ఆలోచనాసరళిని, జీవన విధానాన్ని గురించి ఓ అవగాహన ఏర్పరచుకోగలుగుతాము. ఒక జాతి నాగరికత క్రమంగా ఏవిధంగా వృద్ధిపొందుతుందనే విషయం కూడా అవగతమవుతుంది. ప్రతి జాతి తమకు సంబంధించిన అటువంటి అపురూప కళావిశేషాలను అత్యంత జాగరూకతతో పదిలపరచుకోవాల్సి ఉంది. అయితే దురదృష్టవశాత్తూ అలా జరగడంలేదు. ప్రజలకు ప్రాచీన వస్తువుల విలువ తెలియకపోవడం, సులభంగా డబ్బు సంపాదించాలనే అవినీతిపరుల అత్యాశ దీనికి ముఖ్యకారణాలు.

డబ్బుతో పొందగలిగిన సకల సౌఖ్యాలు అనుభవించిన తరువాత ఎవరికైనా వాటిమీద ఆసక్తితగ్గడం సహజం. అప్పుడే అలౌకిక విషయాలు దేవుడు, మతం వంటి విషయాలమీద ఆసక్తిపెంచుకుంటారు. వాటిమీద నమ్మకం లేనివారు కళలు, సాహిత్యం వంటివాటిపట్ల మక్కువ పెంచుకుంటారు. అందువలననే కావలసినంత ధనం, తీరుబడి రెండూ ఉన్న పాశ్చాత్య కోటీశ్వరులు వివిధ కాలాలకు, నాగరికతలకు చెందిన ప్రాచీన కళాఖండాలను సేకరించడానికి ఎన్నికోట్ల రూపాయలయినా ఖర్చుపెట్టడానికి వెనకాడటంలేదు. ముఖ్యంగా తూర్పుఆసియా దేశాల నాగరికతలకు సంబంధించిన వస్తువులు వారిని విపరీతంగా ఆకర్షిస్తున్నాయి. మనదేశంలోని కొన్ని దేవాలయాల్లో దిక్కూమొక్కూ లేకుండా పడివున్న శిల్పాలు అసంఖ్యాకం. వీటిని లక్షలుపోసి కొనుక్కొనేవారున్నారన్న విషయం తెలుసుకొన్న కొందరు అవినీతిపరులు సులభంగా డబ్బు సంపాదించే మార్గం దొరికిందని సంబరపడ్డారు. కానీ వారు తమ జాతి ప్రాచీన





నాగరికతను, సంస్కృతిని వెలకట్టి విక్రయిస్తు న్నారన్న విషయం గుర్తించడంలేదు. ఢిల్లీ, ఉత్తరప్రదేశ్, హిమాచల్‌ప్రదేశ్, రాజస్థాన్‌లలో దాదాపు పన్నెండు ముఠాలు ప్రాచీన కళా ఖండాల దొంగరవాణా కార్యక్రమాలను సాగిస్తు న్నాయి. ఈ ముఠాలకు పారిస్, న్యూయార్క్ వంటి నగరాల్లో ఉన్న అంతర్జాతీయ ముఠా లతో లావాదేవీలు ఉన్నాయి. ప్రాచీన కళా ఖండాలను దొంగతనంగానో, మరోవిధంగానో సంపాదించేవారు. వాటిని సేకరించే పాశ్చాత్య కోటీశ్వరులు, వీరిద్దరిమధ్యా వారధివంటి దళా రులు- ఇలా మూడు స్థాయిల్లో అక్రమరవాణా ఎంతో పటిష్టవంతమైన ప్రణాళికతో కొనసాగు తోంది. సాధారణంగా భద్రతా ఏర్పాట్లు సరిగా లేని దేవాలయాలు, చర్చిలు, పురావస్తు ప్రద ర్శనశాలలనుండి ఈ ప్రాచీన కళాఖండాలను దొంగిలిస్తూ ఉంటారు. ఒక్కోసారి కొంతమంది ఏళతరబడి తమ ఇంట్లోపడివున్న పాత వస్తు వుల విలువ తెలియక వాటిని చౌకగా అమ్మే స్తూ ఉంటారు. 1969లో మన దేశంలోని ప్రిన్స్‌ఆఫ్ వేల్స్ మ్యూజియంలో ప్రదర్శించబ డిన మొహంజొదారో శిథిలాలకు చెందిన 16 వస్తువులను దొంగిలించారు. 1980లో రెడ్ ఫోర్ట్ మ్యూజియంలోనూ, 1981లో గయ మ్యూజియంలోనూ, 1982లో మద్రాసు మ్యూ జియంలోనూ జరిగిన దొంగతనాల్లో అనేక అపు రూపమైన,విలువైన కళాఖండాలు మాయమ య్యాయి. ఇలా మాయమయిన వస్తువులు అనేక దేశాలు తిరిగి చివరికి కోటీశ్వరులైన పాశ్చాత్యుల ఇళ్లలోనో లేదా మ్యూజియంలలోనో ప్రత్యక్షమవుతూ ఉంటాయి. ప్రస్తుతం చోళరా జుల కాలంనాటి కాంస్య విగ్రహాలకు, గుప్తుల కాలంనాటి రాజస్థాన్- హిమాచల్‌ప్రదేశ్‌లకు చెందిన మినీయేచర్ చిత్రాలకు గిరాకి బాగా ఉంది. తమిళనాడులోని దేవాలయాల్లో గత 20 ఏళ్లలో 200 కోట్ల రూపాయలు విలువచే సే దాదాపు 1000 విగ్రహాలు, శిల్పాలు దొంగి లింపబడ్డాయి. వాటిలో 80 లక్షల విలువచేసే శివపురం నటరాజ విగ్రహం, 60 లక్షలు విలువచేసే తిరువిలకూడి నటరాజ విగ్ర హంకూడా ఉన్నాయి.

ప్రజల అజ్ఞానంవల్ల కొంత నష్టం జరుగు తోంటే ప్రభుత్వ నిర్లక్ష్యవైఖరివల్ల మరికొంత నష్టంవాటిల్లుతోంది. ఇటీవల భారతప్రభు త్వం అమెరికాలోనూ, రష్యాలోనూ ఏర్పాటు చేసి 'భారతీయ ఉత్సవాలు' (ఇండియా ఫెస్టి



స్మగ్లర్లను ఆకర్షించే కాంస్య విగ్రహాలు



వల్)లో ప్రదర్శించడానికి ఆ దేశాలకు తరలించుకువెళ్లిన కళాఖండాలలో కొన్ని విరిగిపోవడమో, మాయమవడమో జరిగింది. అమెరికాకు పంపినవాటిలో 27 వస్తువులు, రష్యాకు పంపినవాటిలో 40 కళాఖండాలు ఇలా పాడయిపోయాయి. వీటిలో 25 కోట్ల రూపాయలకు ఇన్స్యూర్‌చేసిన దీదార్‌గంజ్ యక్షిణి ప్రతిమ కూడా ఉంది. 16వ శతాబ్దికి చెందిన మీరా దంతపు ప్రతిమ నిలువుగా ఏర్పడ్డ సన్నటి పగులుతో తిరిగొచ్చింది. లక్ష రూపాయలకు ఇన్సూర్‌చేసిన జహంగీర్ చేతిరుమాలు, బంగారుతో చేసిన ఒక హుక్కా గొట్టపు చివరి భాగం మాయమయ్యాయి.

1986 నవంబర్‌లో బెంగుళూరులో జరిగిన ఒక అంతర్జాతీయ సమావేశం సందర్భంగా విమానాశ్రయాన్ని అలంకరించడానికి ప్రభుత్వ అధికారులు పురావస్తు ప్రదర్శనశాల నుండి కొన్ని ప్రాచీన కళాఖండాలను తీసుకున్నారు. అయితే వాటిని తిరిగి అప్పగించలేదు. అవి ఏమయినదీ ఎవరికీ తెలియడంలేదుట! వీటన్నిటిని దృష్టిలో ఉంచుకొని ప్రదర్శనశాలలనుండి ఎటువంటి సందర్భంలోనూ వెలికితీయగూడని కళాఖండాల పట్టికను తయారు చేయించడానికి ప్రభుత్వం ప్రయత్నాలు జరుపుతోంది.

ప్రస్తుతం జరుగుతున్న అక్రమరవాణా, ప్రభుత్వ నిర్లక్ష్యవైఖరులనలా ఉంచితే, మన దేశాన్ని బ్రిటిష్‌వారు పాలిస్తున్నరోజుల్లో వారు ఇంగ్లండుకు తరలించుకుపోయిన కళాఖండాలకూ, వెలలేని వజ్రవైఢూర్యాలకూ, కొల్లగొట్టిన సిరిసంపదలకూ ఒక లెక్కంటూలేదు. అప్పటికే ఐక్యత లేకుండా ఒకరితో ఒకరు కలహించుకొంటూ బలహీనమైపోయిన స్వదేశ సంస్థానాధీశులు, మహారాజుల వద్ద నుండి కప్పమనీ, బహుమానాలనీ, వారసులులేరనీ– రకరకాల కారణాలతో దోచుకొన్న ఐశ్వర్యానికి అంతులేదు. వాటిలో కొన్ని అపురూపమైన కళాఖండాలు లండన్ నగరంలోని 'క్వీన్‌విక్టోరియా అండ్ అల్బర్ట్' మ్యూజియంకు చెందిన గోడౌన్‌లో అనామకంగా పడి ఉన్నాయి. బెంగాల్ రాజవంశీకులకు చెందిన నల్లరాతి సూర్యవిగ్రహం అత్యంత మనోహరంగా ఉంటుంది. చుట్టూ అప్సరసలతో, నాలుగడుగుల ఎత్తున్న ఈ శిల్పం పదవశతాబ్దికి చెందినది. 12వ శతాబ్ది

కి చెందిన విష్ణుమూర్తి కంచువిగ్రహం, ఇంకా అనేక శిల్పాలు కాలానికి అతీతంగా, శాంతంగా, స్థిరంగా, జీవం ఉట్టిపడుతున్నట్టుగా ఉన్నాయి. 1820 ప్రాంతంలో ఓధ్‌ను పాలించిన రాజులకు చెందిన విలువైన బంగారు సింహాసనం నిర్లక్ష్యంగా ఓ మూలన పడి ఉంది. మనదేశపు 11,000 విలువైన పట్టు, జరీ వస్త్రాలు, 5000 వ్రాతప్రతులు వీరివద్ద ఉన్నాయి. నిర్లక్ష్యానికి గురవుతున్న ప్రాచీన కళాఖండాలను భద్రపరచాలనే నెపంతో 17 98లో బ్రిటిష్‌వారు ప్రాచీన కళాఖండాల సేక రణ ప్రారంభించారు. ప్రస్తుతం మ్యూజియంలో చోటులేదన్న కారణంతో అపురూపమైన ఈ కళాఖండాలను ఒక గోడౌన్‌లో పడవేసి ఉంచారు. లండన్‌లో స్థిరపడ్డ భారతీయులు ఏర్పరచుకొన్న 'ఇండియన్ ఆర్ట్‌కౌన్సిల్'వారికీ, మ్యూజియం యాజమాన్యానికీ ఈ విషయమై వాగ్యుద్ధం జరుగుతూనే ఉంది. 1983లో శ్రీలంకకు చెందిన తంబి ముత్తు ఈ కౌన్సిల్‌ని స్థాపించారు. ప్రస్తుతం అధ్యక్షుడిగా ఉన్న బలరాజ్‌ఖన్నా భారత్‌దేశం నుండి దోచుకొన్న దొంగిలించిన కళాఖండాలను వెంటనే భారతప్రభుత్వానికి అప్పజెప్పాలని బ్రిటిష్ దూరదర్శన్ వార్తాపత్రికల ద్వారా మ్యూజియం అధికారులపై ఒత్తిడి తెచ్చారు. కానీ వారు మాత్రం అందుకు ఒప్పుకోవడంలేదు. అవన్నీ తాము చట్టసమ్మతంగా సేకరించినవేనని, ఇప్పుడు వాటిని భారతప్రభుత్వానికి అప్పజెప్పితే అది మిగతా దేశాలవారికి కూడా మార్గదర్శకమవుతుందనీ, ప్రతివారూ తమ తమ దేశాలకు చెందిన కళాఖండాలను తమకు అప్పగించమని ఒత్తిడితెస్తారనీ అంటున్నారు. ప్రస్తుత 'విక్టోరియా అండ్ ఆల్బర్ట్ మ్యూజియం' డైరెక్టర్ ఈ మ్యూజియం భవనాన్ని పునరుద్ధరించి భారతీయ ప్రాచీన కళాఖండాలను ప్రదర్శించాలనే అభిప్రాయంతో ఉన్నారు. దీనికిగాను ఖర్చయ్యే సుమారు 360 కోట్ల రూపాయలను ఇంగ్లండ్‌లో స్థిరపడ్డ భారతీయ వ్యాపారులు, ఉద్యోగస్తుల నుండి విరాళాల రూపంలో సేకరించాలని వీరి పథకం. భారతదేశం నుండి దోచుకొన్న కళాఖండాలను వారి దేశంలో ప్రదర్శించుకోవడానికి కూడా భారతీయులనుండే డబ్బు రాబట్టాలనుకోవడం తెల్లవారి గడుసుతనానికి నిదర్శనం.





అయితే లండన్ హైకోర్టులో కొన్నేళ్లుగా సాగుతున్న ఒక కేసుపై, 1988 ఫిబ్రవరి 17వ తేదీన ఇచ్చిన ఒక తీర్పు భారతీయులకు ఓ ఆశాకిరణమయింది. 1976లో తమిళనాడులోని తంజావూరు సమీపంలో ఉన్న పాతూరు దేవాలయానికి చెందిన ఒక నటరాజ విగ్రహం మాయమయింది. 12వ శతాబ్దికి చెందిన ఈ విగ్రహం మొదట రామమూర్తి అనే వ్యక్తికి ఆలయ ప్రాంగణంలో దొరికింది. దీన్ని అతడు చంద్రన్ అనే వ్యక్తికి రెండు వందల రూపాయలకు అమ్మేశాడు. అది అలా అలా చేతులు మారి మద్రాసు, బొంబాయిల మీదుగా లండన్ నగరం చేరింది. కెనడాకు చెందిన ఓ కోటీశ్వరుడు దాదాపు 60 లక్షల రూపాయలకు ఆ విగ్రహాన్ని కొన్నాడు. ఈ విషయం బయటకు పొక్కగానే పాతూరు ఆలయ ధర్మకర్త, తమిళనాడు ప్రభుత్వం లండన్ హైకోర్టులో కేసుపెట్టారు. తమిళనాడు, భారత ప్రభుత్వాలు, కలిసి ఈ దర్యాప్తు కోసం దాదాపు 13 లక్షల రూపాయలు ఖర్చుపెట్టారు. న్యాయమూర్తి ఫిబ్రవరి 17వ తారీఖున– ఆ నటరాజ విగ్రహం తమిళనాడులోని పాతూరుదేవాలయానికి చెందినదేనని తనకు నమ్మకం కుదిరిందనీ, దానిని తిరిగి పాతూరు దేవాలయానికి అప్పజెప్పాలనీ తీర్పుచెప్పారు. ఈ తీర్పు ఇలా ప్రాచీన కళాఖండాలను దొంగిలించేవారికి, అలాంటివారికి డబ్బు ఇచ్చి సేకరించేవారికీ ఒక హెచ్చరికగా పనిచేయవచ్చు.

ఏ మార్గంలోనైనా సరే సులభంగా డబ్బు సంపాదించాలనే అవినీతిపరులు అన్నిచోట్లా ఉంటారు. వీరికి భద్రతా ఏర్పాట్లు సరిగాలేని మ్యూజియంలు, దేవాలయాలు గనుల వంటివి. ఎంత డబ్బయినాసరే కళాఖండాలను కొనడానికి సిద్ధంగా ఉండే పాశ్చాత్య కోటీశ్వరులే ఈ ప్రాచీన కళాఖండాల దొంగరవాణాకు అసలు ప్రోత్సాహకులు. దొంగరవాణాలో పట్టుబడితే వారికి పడే తేలికపాటి శిక్షలు, ప్రజల అజ్ఞానం కూడా కొంతవరకు దీనికి దోహదమవుతున్నాయి. అలా పట్టుబడిన దొంగ వర్తకులకు బెయిల్ మీద విడుదల అయ్యే అవకాశం ఉంది. సామాన్యంగా ఓ ఆరునెలల ఖైదు శిక్షపడుతుందంతే!

ఈ దొంగరవాణాను అరికట్టే నిమిత్తం భారతప్రభుత్వం 1972లో 'ఆర్ట్అండ్ యాంటిక్

← మధ్యప్రదేశ్‌లోని ఖజరహో శిల్పసుందరి

యాక్టును ప్రవేశపెట్టింది. 1976 నుండి అమల్లోకి వచ్చిన ఈ చట్టంప్రకారం వంద సంవత్సరాల నాటి నాణాలు, విగ్రహాలు, శిల్పాలు, చిత్రాలు, కళాత్మకమైన భవన భాగాలు, వ్రాతప్రతులు - అన్నీ ప్రాచీన వస్తువుల జాబితాలోకి వస్తాయి. వ్యక్తులు, సంస్థలు ఎవరి వద్దనయినా అలాంటి పురాతన వసువులున్నట్టయితే వాటిని దగ్గరలో ఉన్న భారత పురావస్తు పరిశోధన శాఖవారి కార్యాలయాల్లో నమోదుచేయించాలి. ప్రభుత్వ అనుమతిలేనిదే వాటిని అమ్మడం లేదా కొనడం చట్టరీత్యా నేరం. కానీ 'ఆర్ట్ అండ్ యాంటిక్ యాక్టులో ఉన్న లోపాల వలన ఈ చట్టం పెద్దగా ఉపయోగపడటంలేదు. సి.బి.ఐ. ఆధ్వర్యంలో ఉన్న ప్రత్యేక కేంద్రపరిశోధనా విభాగం, (స్పెషల్ సెంట్రల్ ఇన్వెస్టిగేటివ్ యూనిట్) కళాఖండాల దొంగరవాణాను అదుపుచేయాల్సి ఉంది. కానీ కోట్ల రూపాయల పెట్టుబడులతో అంతర్జాతీయ స్థాయిలో పటిష్టంగా నడుస్తున్న దొంగరవాణా ముఠాలను ఎదుర్కోవడానికి ఆర్థిక లోపానికి తోడు తక్కువ సిబ్బందితో సతమతమవుతున్న స్పెషల్ సెంట్రల్ ఇన్వెస్టిగేటివ్ యూనిట్ ఏ మాత్రం ధీటుగాలేదు.

మన దేశంలోగల అసంఖ్యాకమైన పురాతన వస్తువులనన్నింటిని ఒక పద్ధతిలో నమోదుచేసుకొని, వాటి పట్టిక తయారుచేయడం ఒక బృహత్పథకం. అది సక్రమంగా అమలుపరచడానికి కావలసిన శక్తి, సామర్థ్యాలు, ఆర్థిక వనరులు మన పురావస్తు పరిశోధన శాఖవారికి లేవు. అందువల్ల ఈ చట్టం నామమాత్రంగానే మిగిలిపోయింది. దాదాపు 400 మంది పురాతన వస్తువుల వ్యాపారులు తమ పేర్లను పురావస్తు పరిశోధన శాఖవారి కార్యాలయాల్లో నమోదు చేయించుకొన్నారు. వీరిలో చాలా మంది తమకుగల సౌకర్యాన్ని దుర్వినియోగపరుస్తూ అనేక ప్రాచీన కళాఖండాలను విదేశాలకు చేరవేస్తున్నారు. దేశంలో ఎన్ని ప్రాచీన వస్తువులు ఉన్నాయన్నదే సరిగా తెలియకపోవటం వల్ల ఎన్నిబయటికి వెళుతున్నాయనేది ఎవరికీ ఖచ్చితంగా తెలియడంలేదు. ప్రాచీన కళాఖండాల దొంగతనాల కేసులు సంవత్సరానికి 450 నమోదు అవుతుంటే. అందులో కేవలం పదికేసుల్ని మాత్రం దర్యాప్తుచేయగలుగుతున్నారు. దర్యాప్తు పూర్తయిన కేసులు కూడా ఆ కోర్టు నుండి ఈ కోర్టుకు. ఈ కోర్టు



శిల్పాలు →

నుండి ఆ కోర్టుకు తిరుగుతూ సంవత్సరాలే గడిచిపోతుంటాయి. పట్టుబడిన నేరస్తులేమో రాజకీయ ఒత్తిడులు, అధికారుల అవినీతి చర్యల మూలంగా శిక్ష తప్పించుకోవడం సర్వ సాధారణమయిపోయింది.

ఈ ప్రాచీన కళాఖండాల దొంగరవాణా అనేది ఒక్క మనదేశానికే కాదు– ఇటలీ ఫ్రాన్స్, బర్మా, థాయిలాండ్ వంటి అనేక దేశాలకు కూడా ఓ పెద్ద సమస్య అయిపోయింది. 1970లో 'యునెస్కో'వారు ఒక ఒప్పందం ద్వారా 1975లో ఇటలీలోని ఫ్లారెన్స్ నగరంలో అంతర్జాతీయ సంస్థను ఏర్పాటుచేశారు. దొంగిలించబడిన ప్రాచీన కళాఖండాలను తిరిగి ఆయా దేశాలకు అప్పగించడానికి ప్రణాళికలు వేశారు. అయినా అది ఇంకా ఆచరణలోకి రాలేదు. ఇటీవల భారత దేశం, శ్రీలంక, కొన్ని ఇతర తూర్పుఆసియా దేశాలు కలిసి బ్రిటిష్ ప్రభుత్వ హయాంలో వారు తమదేశాల నుండి తరలించిన కళాఖండాలను యునెస్కో సహాయంతో తిరిగి సంపాదించాలని సమాలోచనలు జరిపారు.

ఈ ప్రణాళికలు, సమాలోచనల వల్ల ప్రస్తుతానికి పెద్దగా ఫలితం కనబడకపోయినా దేశ సంస్కృతికి, ప్రాచీన నాగరికతకు వాటిల్లుతున్న నష్టాన్ని ప్రభుత్వం గుర్తించిందనవచ్చు దాన్ని అరికట్టడానికి ప్రయత్నాలు సాగుతున్నాయన్నది కొంత ఊరట కలిగిస్తుంది.



మంగళగిరి లక్ష్మీనరసింహస్వామి ఆలయంలోని గరుడవిగ్రహం.



క్రీ.శ. 2వ శతాబ్దికి చెందిన ఎర్రరాతి కుబేర విగ్రహం.

ప్రాచీన కళాఖండాల దొంగరవాణాను అరికట్టాలంటే ముందుగా ప్రజలు వాటి విలువ గుర్తించాలి. అవి పనికిరాని పాతవస్తువులు కావనీ, దేశ నాగరికతను తెలియజేసే సాంస్కృతిక వారసత్వచిహ్నాలని తెలుసుకోవాలి. అటువంటివి తమ ఇళ్లలో ఉన్నవారు పురావస్తు పరిశోధన శాఖవారి కార్యాలయాల్లో నమోదు చేయించాలి. ప్రభుత్వం పురావస్తు పరిశోధనా కార్యాలయాలను ప్రతి జిల్లా కేంద్రంలోనూ ఏర్పరచి ఆ జిల్లాలోని దేవాలయాలు, మసీదులు, చర్చిల్లో ఉండే కళాఖండాల పట్టికను తయారుచేయాలి. మ్యూజియంలకు, దేవాలయాలకు గట్టి రక్షణ ఏర్పాట్లుచేయాలి. ముఖ్యంగా 'ఆర్ట్అండ్ యాంటిక్ యాక్ట్'ను సవరించి అందులో ఉన్న లోపాలను సరిదిద్దాలి. అంతర్జాతీయ కళాఖండాల స్మగ్లింగ్ ముఠాలను ఎదుర్కోవడానికి కావలసిన ఆర్థిక వనరులను, సిబ్బందిని పురావస్తు పరిశోధనా శాఖవారికి, స్పెషల్ సెంట్రల్ ఇన్వెస్టిగేటివ్ యూనిట్‌వారికి సమకూర్చాలి.

— స్వర్ణలత

---

# వింత ప్రపంచం

## సినిమా చూస్తే ఫైను....

వినోదాన్నీ విజ్ఞానాన్నీ అందించే సినిమాలను ప్రేక్షకులెప్పుడూ ఆదరిస్తూనే వుంటారు. కాలక్షేపానికి సరదాగా సినిమాలకి వెళ్ళేవాళ్ళూ వున్నారు. కాని సినిమా చూడటమే పాపంగా, ఓ నేరంగా భావిస్తున్న జనం ఈరోజుల్లోనూ ఉన్నారంటే వింతేమరి! మహారాష్ట్రలోని జల్‌గాంవ్ అనే ఊళ్లో సినిమాలు చూస్తే జరిమానా విధిస్తున్నారు.

జల్‌గాంవ్ నగరంలోని $1^1/_2$ లక్షల ప్రజల్లో ముస్లింలు అధికం. వాళ్ళు తమ బాగోగులు సమీక్షించేందుకని కొందరిని ఓ కమిటీగా ఎన్నుకున్నారు. ముస్లిం మహిళ సినిమాలు చూడరాదని ఈ కమిటీ ఓ ప్రకటన విడుదల చేసింది. సినిమాలు చూసి స్త్రీలు ఆవేశం పెంచుకుంటారనీ, చెడిపోతారనీ, అతిగా ఆలోచిస్తారనీ, అవినీతిపరులుగా మారిపోతారనీ ఈ ప్రకటనకు కారణాలుగా చెబుతున్నారు. ఈ కమిటీ మెంబర్లకూ, నిర్ణయాలకూ ముస్లిం మత ప్రవర్తకుల ఆశీర్వాదాలూ ఉన్నాయి. స్త్రీలని పెడదారిపట్టించే ఈ సినిమాలే పురుషులు చూస్తే వక్రమార్గం వైపు నడిపించవా అనే అభ్యుదయవాదుల అభ్యంతరం అరణ్యరోదనగానే మిగిలిపోతున్నది.

స్త్రీలు సినిమాలు చూసేందుకు అనర్హులనే నిర్ణయం అకోలా, అమరావతి వంటి నగరాలకు కూడా పాకింది. కర్నాటకలోని కొన్ని ప్రాంతాలవారు కూడా ఈ నిర్ణయాన్ని ఆచరిస్తున్నారు. జల్‌గాంవ్‌కు చెందిన కుమారి రజియా ఈ నిర్ణయాన్ని నిరసిస్తూ ప్రతిఘటించిందిగానీ అక్కడి మహిళలే ఆమెను బలపరచలేదు. కమిటీ నిర్ణయాల్ని అంగీకరించటమే న్యాయం అంటున్నారట.

తన ఆజ్ఞలు ఉల్లంఘించినవారిని కఠినంగా శిక్షించాలని కమిటీ నిర్ణయం. ఏ మహిళైనా కమిటీ నిబంధనను ధిక్కరించి సినిమా చూస్తే మొదటిసారి ఆమెకు 51 రూపాయల జరిమానా విధిస్తారు. ఆమెతోపాటు ఆమె భర్త ఉంటే మరో 51 రూపాయలు జరిమానా పడుతుంది. ఆ స్త్రీగనుక మళ్ళీ సినిమాకి వెళ్తే ఈసారి 151 రూపాయల ఫైను వేస్తారు. అది చెల్లించి మూడవసారి కూడా



ఆమె సినిమా చూస్తే మతంనుండే బహిష్కరిస్తారు.

జల్‌గాఁవ్‌లోని శివాజీనగర్ నివాసి నూర్ బాను సినిమాకి బయల్దేరిందో రోజు. ఈ వార్త కమిటీ మెంబర్ల చెవిని పడి, సినిమా హాల్లోకి దూసుకువెళ్ళారు. కార్యకర్తలు నూర్బానును వెదికి బయటికి లాక్కొచ్చారు. ఆమెని అలాగే పెడరెక్కలు విరిచికట్టి ఊరేగిస్తూ ఆమె ఇంటికి నడిపించారు. దారి పొడవునా తిడుతూనే ఉన్నారు. ఇల్లు చేరాక ఆమె భర్తను జరిమానా చెల్లించమని నిలదీశారు. అతను నిరాకరించటంతో వారిని మతంలోనుండి వెలివేశారు.

శతకోటి దరిద్రాలకి అనంతకోటి ఉపాయాలన్నట్టు- కొందరు తమ భార్యలతో కలిసి సినిమా చూడాలనే కాంక్షను అణచుకోలేక వాళ్ళు ముస్లిమేతర స్త్రీల్లా అలంకరించుకున్నాక జంటగా వెళ్ళి సినిమాలు చూస్తున్నారట.

నలీంషేక్, అతని భార్య రెహానా రహస్యంగా వెళ్తే మర్నాడే కమిటీ వలంటీర్లు నలీం ఇంటికి వచ్చారు. తప్పిదానికి నంజాయిషీ కోరి క్షమార్పణ పత్రం రాసిమ్మని అడిగారు. దీనికి నలీం దంపతులు నిరాకరించటంతో నిర్దయగా ఇద్దరినీ చితకబాదారు. వెళ్తూవెళ్తూ వలంటీర్లు రెహానా పెదవుల్ని కోసేసి మరీ వెళ్ళారు.

ఈ దారుణోదంతంతో చలించిపోయిన నలీం పట్టరాని ఆగ్రహంతో పోలీసు రిపోర్టు ఇవ్వడానికి బయల్దేరాడు. వలంటీర్లు అతన్ని దార్లోనే పట్టుకొని కళ్ళు ఊడబెరికారుట.

స్థానిక పత్రికలు ఇలాంటి దురాగతాల్ని వెలుగులోకి తెచ్చినా పోలీసులు నేరస్థుల్ని దండించలేకపోతున్నారు. నలీం కళ్ళు పెరికిన పైశాచికత్వాన్ని ప్రతివారూ గర్హించినా మతప్రవక్తలనూ, కమిటీ మెంబర్లనూ వ్యతిరేకించటానికి ఎవరికీ ధైర్యం చాలటంలేదు.

ఇదిలా కొనసాగితే ఇక మానవత్వానికీ, స్వేచ్ఛకూ నిర్వచనం మారిపోతుందేమో?

## దీర్ఘదేహి

నలుగురిలా వుంటే ఎవరూ పట్టించుకోరు. ఏదో ఒక ప్రత్యేకత ఉంటే అందరూ వింతగా చూస్తారు. ఈ ప్రత్యేకత కలిగి వుండటం కొంత నరదాగానే ఉన్నా దానివల్ల ఆ వ్యక్తి కొన్ని బాధలకూ, చికాకులకూ లోనుకాకతప్పదు. అలాంటి కోవకు చెందినదే శాండీఅలెన్. అమెరికాలోని నయాగరా జలపాతాలకు దగ్గర్లోఉన్న అంటేరియా లోని గిన్నిస్ లివింగ్ మ్యూజియంలో ఈమె మోడల్‌గా పనిచేస్తోంది.

శాండీ అలెన్ 1955లో జన్మించినపుడు అందరు పిల్లల్లాగే 21 అంగుళాల పొడుగుండి 7 పౌండ్లు బరువుంది. కాని పదో



ఏడువచ్చేసరికి ఆరు అడుగుల, 3 అంగుళాల దాకా పెరిగింది. అప్పటినించే ఆమె కష్టపరంపర పెరిగింది. క్లాస్‌మేట్లంతా 'రాక్షసి' అనే మారుపేరుతో ఏడిపించేవారు. అందుకే ఎవ్వరితోనూ కలవక వంటరిగా గడవటం నేర్చుకుంది. నరదాలన్నీవదిలి, స్నేహితులతో ఆటలూ, పాటలూ మానుకుంది.

విలువ ఉందని తెలుసుకుందామె. ప్రపంచంలో అందరికంటే పొడువైన మహిళ ఏడు అడుగుల అయిదు అంగుళాలని విని గిన్నీస్ పుస్తకం ఎడిటర్‌కు తన వివరాలిస్తూ ఒక ఉత్తరం రాసింది అలెన్. సరైన కొలతనిస్తూ డాక్టర్ సర్టిఫికెట్ పంపించమని ఆమెకు తిరుగుటపాలో సమాధానం వచ్చింది. అలెన్ ఎత్తు 7 అడుగుల 5 అంగుళాలపై 5/16 అంగుళాలని డాక్టర్ ధృవీకరించి సర్టిఫికెట్ ఇచ్చాడు. అలా ఆమె ప్రపంచంలోకెల్లా పొడవైన మహిళగా గుర్తింపుపొందింది.

కొన్నాళ్ళకు సినిమాల్లో ఓ రాక్షసిపాత్ర నటించే అవకాశం దొరికిందామెకు. షూటింగ్ కోసం రోం నగరానికి వెళ్ళినపుడే పోప్‌ను కూడా కలుసుకుంది. కాని చుట్టూ ఉన్నజనం పోప్ ప్రసంగాన్ని వినడంకంటే అలెన్‌ని చూట్టంలోనే శ్రద్ధచూపించారుట.

ఆమె పొడుగెదగడం అంతటితో ఆగలేదు. 1979లో మళ్ళీ పొడుగు కొలుచుకుంటే 7 అడుగుల 7.25 అంగుళాలుంది. ఆమె పిట్యూటరీ గ్రంథిలో వున్న ఒక ట్యూమర్ ఈ పెరుగుదలకి కారణం అని డాక్టర్లు కనుగొన్నారు. వెంటనే ఆ ట్యూమర్ని తొలగించేందుకు ఆపరేషన్ చేశారు.

1978లో గిన్నీస్ మ్యూజియంలో అలెన్‌కి ఉద్యోగం దొరికింది. అందరిలాగే తనూ వివాహంచేసుకోవాలనీ, కుటుంబజీవనం గడపాలనీ కోరిక వున్నా బహుశా అది తీరనిదేమో అని అలెన్ బాధపడుతుంటుంది. ఆమెకోసం వస్తువులు అన్నీ ప్రత్యేకంగా చేయించవలసిందే. దుస్తులూ, పడుకునే మంచమూ, ఇంటి తలుపులూ లాంటివి తనకు అనుకూలంగా వుండేలా తయారుచేయించుకుంటుంది అలెన్.

ప్రపంచంలో అతిపొడవైనదని పేరొచ్చాక ఆమెను సామాన్య మహిళగా ఎవరు చూస్తారు. ఎవరైనా కలిసినా పరిహాసంగా ఆమెవైపు చూస్తారేగాని ఆ చూపులో స్నేహం, ఆప్యాయతలుండవు.

యాత్రికులకు ఓ ఆకర్షణగా మాత్రమే గుర్తించేదెవరని బాధ పడుతూ ఉంటుంది.

## ఆత్మహత్యలు

జీవితంలో ఎదురయ్యే చేదుఅనుభవాలను తట్టుకోలేక, మానసిక సంఘర్షణకు లోనై, విరక్తి చెంది జీవితాన్ని అంతంచేసుకునేవాళ్ళు




మనలో ఎందరో ఉన్నారు. వారి ఆత్మహత్యలకు కారణాలు ఏవైనా ఆ సమయంలో వారి మానసిక బలహీనతే అందుకు ప్రేరేపిస్తుందనేది నిజం. తమాషాఏమిటంటే - మన దేశంలో ఆత్మహత్యలు సాధారణంగా జూన్- అక్టోబరు నెలల మధ్యలో ఎక్కువగా జరుగుతున్నాయని ఓ సర్వేలో తేలింది. చాలావరకవి రాత్రి పొద్దుపోయాకగానీ, తెల్లవారు ఝామునగానీ జరుగుతుంటాయట!

జపాన్, కొరియా దేశాలలో ఆత్మహత్యలరేటు అత్యధికం. మన దేశజనాభాలో 6.54 శాతం




